# దరిజేరిననావ



పి. వి. కృష్ణమూర్తి


217




యం. శేషాచలం అండ్ కో.,
మచిలీపట్నం-సికింద్రాబాద్

EMESCO CROWN BOOKS - 13

DARIJERINANAVA

A Novel By

P. V. KRISHNAMOORTHY

First Edition:

FEBRUARY 1983

Publishers :

M. SESHACHALAM & Co,
Machilipatnam, Secunderabad-3

Cover Design :

TRIGUN

Printers:

PRASAD PROCESS,
Secunderabad-26

Distributors:

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
5237, Rashtrapathi Road, Secunderabad-500 003

Price : Rs. 8-00

# దరి జేరిన నావ

ఆ రోజు శుక్రవారం. ఉదయం పదిన్నర పదకొండుగంటల మధ్య సమయం.

జనవరి ఆఖరు రోజులు కావడంచేత ఎండ ఇంకా తీవ్రత సాపాదించుకోలేదు. పైగా చిరుచలి శరీరాలను చక్కిలిగింతలు పెడుతూనే వుంది. బంగళా కాంపౌండులో వున్న లాన్‌లో మడత కుర్చీ వేయించుకుని కూర్చుని, తలంటుకుని తడిగా వున్న శిరోజాలను ఆరబెట్టుకుంటున్నది వరలక్ష్మమ్మ. తెలుపు నలుపు మిశ్రమంతో ఆమె శిరోజాలు దీర్ఘంగానే వున్నవి. మధ్య మధ్య వేళ్ళను జుట్టుమధ్యకుపోనిచ్చి చిక్కు సవరించు కుంటున్నది. ఆమె వయస్సు సుమారు నలభై ఆరు సంవత్సరాలు వుండ వచ్చు. దబ్బపండులాంటి శరీరచ్ఛాయకు ఆమె కట్టుకున్న కుంకుమవన్నె కంచిపట్టు చీర యెంతో హుందాతనాన్ని తెచ్చిపెడుతున్నది. ఇంతకీ ఆ చీర కొత్తదేమీకాదు. తడిపి కట్టుడుచీరగా వాడుకోబడుతూ వున్నా చీర వన్నెలో నిగారింపు యెంతో మనోజ్ఞంగా వున్నది.

ఆవిడ ముఖంలో శాంత రసం పొలుకుతున్నా కాస్త అతిశయమూ గోచరిస్తుంది. కన్నులలో కరుణారసం వున్నా దానితోపాటు దర్పమూ తొంగిచూస్తుంది. ఈ దర్పమూ, అతిశయమూ కూడా ఆమె భర్త వుద్యో గపు హోదానుబట్టి వచ్చినవి. అవి ఆమెకు తప్పనిసరి. వొక విధంగా కవచంలాంటివి కూడాను. ఆమె భర్త గోవర్ధనరావు ఐ.పి.ఎస్. పోలీసాఫీ సరు. ఆ మేరకు ఆమెకు నడుచుకోక తప్పదు. అప్పటికి ఆమె భర్త డ్యూటీకి వెళ్ళిపోయాడు. వొక్కగానొక్క కూతురు మాలతి కాలేజీకి వెళ్ళిపోయింది. ఇంట్లో ప్రస్తుతానికి తాను చేయవలసిన పనియేమీ లేదు గనుక తీరికగా కూర్చుని తల ఆర్చుకుంటున్నది. ఇంట్లో వున్న ఇద్దరు ముగ్గురు పనివాళ్ళు వాళ్ళకు కేటాయించిన పనుల్లో వారు నిమగ్నులై

వున్నారు. తల వెంట్రుకలు ఆర్చుకుంటూనే వరలక్ష్మమ్మ అప్రయత్నంగా తల యెత్తి కాంపౌండు గేటువంక చూచింది.

చేతిలో ప్లాస్టిక్ సంచీ వొకటి పట్టుకుని గేటుదగ్గర వొకావిడ నిల బడి వున్నది. ఈమె ఎప్పుడు తనవంక చూస్తుందా అన్నట్టు వేచి వున్న ఆమె వరలక్ష్మమ్మ తన వైపు చూడగానే రెండు చేతులూ జోడించి నమ స్కారం చేసిందామె. ముష్టిదేమో యేదో ఇంత వేసి పంపుదామనుకున్నది వరలక్ష్మమ్మ. కాని యెందుకో వొకసారి పరిశీలనగా ఆమె వంక చూసింది.

యెవరో పాపం బతికి చితికిన దానిలా వుందిగాని ముష్టిదికాదని నిర్ధారణ చేసుకున్నది. ఏం అపేక్షించి వచ్చిందో. యేదయినా కేసుల్లో ఇరుక్కుపోయినవారి తాలూకు ఆడవాళ్ళు వచ్చి తనను దయాభిక్ష అర్థించ డం తనకు చేతనయిందివారికి సాయం చేయడం ఆమెకు పరిపాటే. ఈవిడ యెవరో అటువంటి బాపతే అయివుండవచ్చునన్న వుద్దేశంతో లోపలవున్న పనివాణ్ణి కేకపెట్టింది 'వెంకన్నా...' అని.

మరో రెండు నిముషాలకు వెంకన్న అనే పనివాడు ఆమె ముందు హాజరయినాడు.

'గేటుతీసి ఆమెను లోపలికి రమ్మను' అన్నది.

వెంకన్న వెళ్ళి గేటుతీసి ఆమెను లోపలికి ప్రవేశపెట్టి తనపని అయిపోవడంతో లోపలికి వెళ్ళిపోయాడు. దగ్గరికి వచ్చినావిడను వర లక్ష్మమ్మ మరింత పరిశీలనగా చూచింది. ఆమె వయసు ఇంచుమించు తనంతదె అని ఆమె ముఖం చెబుతున్నా అంత వయసున్నట్టు కనుపించదు. భర్తపోయినట్లుంది. ముఖాన సౌభాగ్య చిహ్నలేవీలేవు. కట్టుకున్నది సాదా నేత చీరే అయినా పరిశుభ్రంగా వుతికి కట్టుకున్నది. మెళ్ళో పగడాలదండ. చేతులకు సన్నగా వొక బంగారు గాజులజత వున్నవి.

ఆమె వరలక్ష్మమ్మను సమీపిస్తూనే నవ్వుతూ 'నమస్కారమండీ' అన్నది.

వరలక్ష్మమ్మ అంగీకార సూచకంగా తల ఆడించింది. తరువాత 'ఏం కావాలి?' అంది సౌమ్యంగా.

'మరేం లేదండీ. నేను అప్పడాలు, వడియాలూ, సాంబారుపొడి, కంది సున్ని వగయిరా తయారుచేసి అమ్ముతుంటానండీ!'

'అలాగా! ఏం అప్పడాలు?'

'మినప, బియ్యం, కంది, ఇంకా వడియాల దినుసులూ వున్నా యండీ!'

వరలక్ష్మమ్మ రెండు మూడు క్షణాలు ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టింది. ఆమె సంచీలోంచి అప్పడాల రకాలు పైకి తీయసాగింది. 'బాగుంటాయా?'

'బాగా గుల్లవిచ్చి కమ్మగా వుంటాయండీ. వొకసారి ప్రయత్నించి చూడండి.'

వరలక్ష్మమ్మ మళ్ళీ కాసేపు మౌనం వహించింది. ఆమె చేతిలో అప్పడాల కట్ట అలానే వున్నది. 'నీకు జీవనం వీటిమీదే గడుస్తుందా?' అని అడిగింది వరలక్ష్మమ్మ.

'అవునండీ!'

'నీవు వంట బాగా చేయగలవా?'

'ఎంత మందికి—'

'ఎంతమందికి అనికాదు. మా యింటికే వో వంటమనిషి కావాలి. నీకభ్యంతరం లేకపోతే...'

ఆమె ఆలోచనలో పడ్డట్టు ముఖం పెట్టింది.

'బలవంతం యేమీలేదు. నీకు ఇష్టమయితేనే' అంది వరలక్ష్మమ్మ.

'మరేం లేదండీ. నేనుండేది ఇక్కడికి చాలా దూరం. రోజూవచ్చి వెళ్ళడం అంటే కుదరదుకదా అని ఆలోచిస్తున్నాను.'

'ఎంత మంది పిల్లలూ?'

ఈ ప్రశ్నతో ఆమె ముఖంలో యేదో విషాదం అలుముకున్నట్టు తోచింది వరలక్ష్మమ్మకు. తాను అడగకూడని ప్రశ్న అడిగానేమో అని కూడా అనుకుంది. కాని ఆమె కాస్త నెమ్మదిగా జవాబు చెప్పింది. 'పద మూడు, పదకొండు ఏళ్ళలో ఇద్దరు ఆడపిల్లలు. కాని వారు నా దగ్గర వుండరు.'

'మరి...'

'మహిళా సభవారి హాస్టల్లో వుండి చదువుకుంటున్నారు.'

'అదేం...'

'నేనా వొంటరిదాన్ని. వాళ్ళు ఈడేరుతున్న పిల్లలు. ఏ ఆధారమూ లేక జీవనోపాధికోసం ఈ వ్యాపారం చేస్తూ ఇంటిపట్టున వుండక తిరగాల్సి వుంటుంది. ఇంట్లోకంటే అక్కడ అన్ని విధాలా భద్రత వుంటుందని ఈ యేడే చేర్పించాను. నేను యేం చేసినా వాళ్ళ భవిష్యత్తు కోసమేకదా. అక్కడయితే వాళ్ళకు లోకజ్ఞానమూ, క్రమశిక్షణా కూడా అలవడుతుంది.'

వరలక్ష్మమ్మ ఆవిడవంక ప్రశంసా పూర్వకంగా చూచింది. 'చాలా మంచిపని చేశావు. అయితే నువ్వు ఇక్కడే వుండిపోవచ్చు. జీతం ఎంత ఇవ్వమంటావు?'

ఆమె ముఖాన్ని మళ్ళీ ఏదో ఆలోచిస్తున్నట్టు పెట్టింది. తరువాత యెంతో వినయంగా అన్నది. 'నా వొక్కదానికే అయితే పట్టెడన్నం చాలు. నా దిగులంతా పిల్లల భవిష్యత్తును గురించే—'

వరలక్ష్మమ్మ చిన్నగా నవ్వింది.

'నీ పిల్లల విషయంలో నీవేమీ దిగులు పెట్టుకోకు. వారి చదువు నిర్విఘ్నంగా కొనసాగేట్టు చూచే బాధ్యత నాది-సరేనా!'

ఆమె తనను తానే నమ్మలేనట్టు చూసింది. 'అంతకంటే నాకు కావలసిందేమమ్మా. కాని ఇంత వరకూ నేను ఎవరి యింట్లోనూ వంట చేయలేదు. నా వంట మీకు నచ్చుతుందో లేదో' అన్నది.

'నేనూ ఇంత కాలం వంటమనిషిని పెట్టుకోలేదు. నేనే స్వయంగా చేస్తాను. ఈ మధ్య నాకు బి.పి. ఎక్కువగా వుంది. రెస్టు తీసుకో అంటాడు డాక్టరు. చెట్టంత ఆడది ఇంట్లో వుండి ఎక్కడిపని అక్కడ పారేసి రెస్టు అంటూ కాళ్ళు బారజాపుకు పడుకోవడం కుదురుతుందా' అంది వరలక్ష్మమ్మ.

'నిజమేలెండి!'

'ఇంట్లో వున్నది ఆయనా, నేనూ, అమ్మాయే అయినా ముగ్గురికీ మూడు రకాలవంట. నాకు చప్పగా, ఆయనకు వుప్పగా. ఇక అమ్మాయికి ఏ రుచి కావాలో దానికే తెలియదు. ఇకపోతే ఇంటికి వచ్చిపోయే వాళ్ళు. యేదో అలా సంబాళించుకుంటూ వస్తున్నాను. వేళ తప్పకుండా

ఈ పనులు చేయడానికి వోర్పూ, నేర్పూ వున్న వాళ్ళు కావాలి. నిన్ను చూస్తే నాకా నమ్మకం కలిగింది.'

ఆవిడ అభిమాన పడుతూ తలదించుకుంది.

'ఇంతకీ నీ పేరు-'

ఆవిడ 'సుభద్ర' అని చెబుతూవుండగా కాంపౌండులోకి ఒక కారు వచ్చి ఆగింది. అందులోంచి ఒక నడివయసు దంపతులుదిగారు. వారిని చూచి వరలక్ష్మమ్మ వుత్సాహంగా లేచినిలబడింది.

'రండి. రండి. ఎల్లుండి గృహప్రవేశం అన్నారు. ఇంతవరకూ పిలుపు లేదే! మా విషయం మరిచిపోయారేమో అనుకున్నాను.'

'ఎంత మాట. మిమ్మల్ని మరచిపోవడమే' అన్నాడాయన.

'లోపలికి రండి' అంటూ వరలక్ష్మమ్మ ఇంట్లోకి వెడుతూవుంటే వారిద్దరూ ఆమెను అనుసరించారు. సుభద్ర వాళ్ళు వెళ్ళినవైపు చూస్తూ నిలబడి పోయింది. కొన్ని నిముషాలు గడిచిపోయినై. సుభద్ర తన జీవితంలో ప్రవేశించబోతూవున్న ఈ కొత్తమలుపునుగురించి ఆలోచిస్తోంది.

ఇంతలో వెంకన్న వచ్చాడు లోపలినించి. అమ్మగారు మిమ్మల్ని లోపలికి రమ్మంటున్నారు అంటూ ఆమెను లోపలికి తీసుకువెళ్లాడు. ఆ వచ్చిన దంపతులు హాల్లో సోఫామీద కూర్చునివున్నారు. వరలక్ష్మమ్మ వారికి యెదురుగా నిల్చుని వున్నది.

'కనీసం కాఫీ అయినా తీసుకోండి!'

'ఈ వేళప్పుడు మీ రెందుకు శ్రమపెట్టుకుంటారండీ' అంటున్న దావిడ.

'మరేం ఫరవాలేదు' అంటూ వరలక్ష్మమ్మ లోపలికివచ్చింది.

వెంకన్న సుభద్రను వెనుక వరండానించి వంటింటివైపుకు తీసుకు వచ్చాడు.

'చూడమ్మా సుభద్రా రెండు కప్పుల కాఫీ తయారుచేయి. ఇదుగో ఫిల్టరూ, కాఫీపొడి, పాలు. నేను కాస్త వాళ్ళతో మాట్లాడుతుంటాను' అని చెప్పి వరలక్ష్మమ్మ హాల్లోకి వెళ్ళిపోయింది.

సుభద్ర గాస్ స్టౌ వెలిగించి కాన్‌లో నీళ్ళు పెట్టింది. ఏదో ఆలోచనవచ్చి సుభద్ర తన సంచిలోంచి అరిసెలు, మిక్చర్ ప్యాకెట్లు తీసి

రెండేసి అరిసెలు, కాస్తమిక్చర్ రెండు స్టీలుప్లేట్లలోపెట్టి రెండు గ్లాసుల్లో నీళ్లూ అన్నీఅక్కడున్న ఒకట్రేలోసర్ది వెంకన్ననుపిలిచి ఆట్రేను వాళ్ళ ముందు పెట్టిరమ్మన్నది. నీళ్ళు మర్లగానే ఫిల్టరులో పొడివేసి పోసి పాలు వేడి పెట్టింది. మరో అయిదు నిముషాలకు కాఫీ తయారయింది. దాన్ని మూడు కప్పుల్లో పోసి వెంకన్నచేత పంపించింది. తర్వాత సుభద్ర వరలక్ష్మమ్మ కోసం యెదురుచూస్తూ కూచుంది. పావుగంట గడిచాక కారు వెళ్ళిన శబ్దం వినిపించింది. వరలక్ష్మమ్మ లోపలకు వచ్చింది.

'అరిసెలూ, మిక్చరూ నువ్వు తయారు చేసినవేనా' అనిఅడిగింది.

'అవునండి. నమూనాకు చేసినవి. ఎవరయినా కావాలంటే తయారు చేసి పెడతాను.'

'అలాగా. చాలా రుచిగా వుందన్నారు. కాఫీకూడా బాగానేచేశావ్. ఫరవాలేదు. ఇంతకీ నీ అభిప్రాయం చెప్పలేదు?'

సుభద్ర మౌనంగా వరలక్ష్మమ్మ వంక చూసింది. ఆమె మౌనానికి అర్థమేమిటో వరలక్ష్మమ్మకు అవగాహనకాలేదు. సుభద్ర అంగీకరిస్తే బాగుండునని అప్పుడే ఆమెమనసు ఆందోళనపడసాగింది. కొన్నిక్షణాలు వరలక్ష్మమ్మ కూడా మౌనంగానే సుభద్రనుచూస్తూ వుండిపోయి తర్వాత 'చూడు సుభద్రా నీకు బొత్తిగా ఇష్టంలేకపోతే నిన్ను బలవంత పెట్టను. నీ పరిస్థితి చూస్తే నీకెవరూ లేరని స్పష్టమౌతున్నది. నాకూ ఒక మనిషి అవుసరం వున్నది. ఆయన డ్యూటీకి వెళ్ళిపోతే ఎప్పుడు ఇంటికి వస్తారో తెలియదు. ఇంక అమ్మాయి కాలేజీకి వెళ్ళిపోతుంది. అది ఇంటిపట్టునవున్నా దానిలోకం దానిది. నేను మానసికంగా ఒంటరితనంతో, బాధపడుతున్నాను. మాటకూ, మంచికీ, మనసులో విషయాలు చెప్పకో డానికీ, తోడుగా వోమంచి ఆడతోడుకావాలని తహతహలాడి పోతున్నాను', అన్నది.

ఇంతటి సంపదలోనూ, ఇంత మంచి పరిజనంమధ్యా ఈ ఇల్లాలు వొంటరితనంతో బాధపడుతున్నదా! సుభద్ర మనసు ఆర్ద్రమైపోయింది. నావల్ల మీకు మనశ్శాంతి కలుగుతుందనుకుంటే మీవద్ద వుండడానికి నాకేమీ అభ్యంతరం లేదుకాని...'

'ఏమిటమ్మా సందేహిస్తున్నావు?'

'వంటింటి పనివరకూ, మీకు యెలాంటి శ్రమ ఇవ్వను. కాని మీ వాళ్ళకు వడ్డనా...'

'అదా. ఆసంగతి నేను చూసుకుంటాలే. నీవేమీదిగులు పెట్టుకోకు.'

'ఎప్పటి నుండి రమ్మంటారు?'

'ఇంకా ఎప్పుడేమిటి! నీవు డ్యూటిలో జాయిన్ అయిపోయినట్టే లెక్క. ఈ అప్పడాలు వగయిరా ఇక్కడే వుపయోగపడతాయిగాని, నీవు ఇంటికివెళ్ళి నీ వస్తువులు తెచ్చేసుకో. ఈ రాత్రి నీచేతి వంటే' అన్నది.

'అలాగేనండీ!' అంటూ సుభద్ర తన సంచీ అక్కడే వదిలి ఇవతలికి వచ్చింది.

# 2

వరలక్ష్మమ్మ తననూ, తనుపనిచేసే తీరునూ అన్ని కోణాలనించీ పరిశీలనగా గమనిస్తున్నదని తెలుసుకోడానికి అట్టేసేపు పట్టలేదుసుభద్రకి. ఆమె తనకున్న కొద్దిపాటు సామాను రిక్షాలో వేయించుకుని వచ్చేసరికి నాలుగు గంటలైంది. వరలక్ష్మమ్మ సుభద్ర కోసం స్టోర్‌రూం పక్కన వున్నగది కాళీచేయించి శుభ్రం చేయించి అట్టేపెట్టింది అప్పటికే. అందులో వో నవారు మంచంకూడా వున్నది. సుభద్ర తను తెచ్చుకున్న సామాన్లు గదిలో వోపక్కనపెట్టి బాత్‌రూంకెళ్ళి కాళ్లూ చేతులూ కడుక్కునివచ్చి వరలక్ష్మమ్మ పాదాలకు నమస్కరించింది. వరలక్ష్మమ్మ కాస్త చకితురాలై వెనక్కి తగ్గింది.

'ఎందుకమ్మా ఇప్పుడు నమస్కారం...లే' అన్నది.

సుభద్ర యేమీ మాట్లాడలేదు. వరలక్ష్మమ్మ యేం పని పురమాయిస్తుందోనని చూస్తూ నిలబడ్డది. స్టోర్‌రూంలో వున్న సామాగ్రీ, వంటగదిలో సామాన్లు ఫ్రిడ్జి, కాఫీపొడి వగయిరా వస్తువులు వివరంగా చూపించింది వరలక్ష్మమ్మ.

'మీరు దినసరి కార్యక్రమం యేమిటో చెబితే మళ్ళీమళ్ళీ చెప్పే శ్రమలేకుండా చేసుకుపోతాను' అంది సుభద్ర.

'వంట అంటే ఏదో చేసుకుపోవచ్చులేగాని, అకస్మాత్తుగావచ్చే అతిథులకీ, స్నేహితులకీ టిఫిన్ అంటూ కూర్చుంటారు ఆయన. అప్పటి కప్పుడు యేది చేయాలన్నా ఇబ్బందిగానే వుంటుంది.'

'ఎందు కండీ. చేగోడీలు, జంతికలూ, మిక్చర్ లాంటి కారా దిను సులూ, బర్ఫీ, కొబ్బరి మిఠాయి లాంటి తీపి దినుసులూ కొన్నాళ్ళు నిలవ వుంటాయి. హఠాత్తుగాగాని, వేళకానివేళ వచ్చి వెళ్ళేవాళ్ళకు ఇవిఇచ్చి సంతృప్తిచేయవచ్చు. కాస్త తీరుబడిగావుండే అతిథులైతే, పెరుగు వడలూ మసాలవడలూ చేసిపెట్టవచ్చు. టీ, కాఫీ చేయడం యెంతసేపులెండి?'

'నీఇష్టం! ఈ క్షణంనించి ఈ వంటఇల్లునీది. ఈ పూటకి యేదైనా టిఫిన్ చేయి. అమ్మాయి కాలేజీనించి వచ్చేవేళ అయింది. అమ్మాయికికాఫీ మాత్రం స్ట్రాంగ్‌గా వుండాలి' అన్నది వరలక్ష్మమ్మ.

సుభద్ర 'అలాగే నండీ' అంటూ ఫ్రిడ్జి తెరిచింది. అందులో కాలీ ఫ్లవర్, బటానీలు, కారెట్, టమాటోలు మొదలయినకూరగాయలున్నాయి.

'ఈ పూటకి వెజిటేబుల్ వుప్మా చేయమంటారా' అని అడిగింది.

'చెయ్యమ్మా! అమ్మాయికి చాలా ఇష్టం. నాకే చేసిపెట్టే వోపిక వుండేది గాదు.'

'స్వీట్ యేదయినా చేయాలా?'

'ఇప్పటికిప్పుడు స్వీట్ అంటే యేంకుదురుతుంది?'

'కారెట్ వుంది. బూడిదగుమ్మడి చెక్క వుంది. హల్వా చేయడం ఎంతసేపూ!'

వరలక్ష్మమ్మ సుభద్ర వంక ఆశ్చర్యంగా చూసింది. ఈమె దగ్గర ఇంక వంటల విషయంలో నిర్ణయాలు తీసుకోవలసిన అవసరంకూడా తనకు వుండదు. తమ ఇష్టానిష్టాలు మాత్రం చెబుతేచాలు అనుకుంది. 'ఈ పూట గుమ్మడికాయతోనే హల్వా చెయ్యి. నీకు కూరలు తరగడానికి వెంకన్న సాయం కావలసివస్తే తీసుకో' అంది.

'అక్కరలేదండీ. ఏదయినా పెద్ద వంట చేయవలసివస్తే అలాగే అతని సాయం తీసుకుంటాను. మీరింక వెళ్ళి హాయిగా విశ్రాంతి తీసుకోండి. కాస్సేపట్లో అన్నీ సిద్ధం చేస్తాను.'

'అలాగే సుభద్రా.'

'వొక చిన్న విషయమండీ.' అన్నది సుభద్ర అభిమానపడుతూ.

'ఏమిటమ్మా? నిస్సంకోచంగా అడుగు ఫరవాలేదు.'

'మిమ్మల్ని ఏదో విధంగా పిలవక తప్పదు. ఎలా పిలవమంటారు?'

'నీకు ఎలా పిలవాలనుంటే అలా పిలువు. ఇందులో అడగడానికి ఏముందీ?'

'వదినగారూ అని పిలుస్తే మీకేమయినా అభ్యంతరమా?'

'నీ ఇష్టం' అని నవ్వుకుంటూ ఇంక అక్కడ తను వుండవలసిన అవసరం లేదన్నట్టుగా లోపలికి వెళ్ళిపోయింది వరలక్ష్మమ్మ. హాల్లోకి వచ్చి సోఫామీద కూర్చున్న వరలక్ష్మమ్మకి తన తలమీద నుండి పెద్ద బరువు దిగిపోయినట్టు మనసు తేలిక పడి యెంతో వుల్లాసంగా వున్నది. టీపాయ్‌మీద వున్న వారపత్రికను తిరగవేస్తూ కూర్చుంది. కాస్సేపటికి లోపల నుండి వుప్మా తాళింపు తాలూకు కమ్మటి వాసన వస్తూంటే అభినందనగా తల పంకించి తనలో తనే నవ్వుకుంది. రోజూ ఈ పాటికి ఇంటికి రావలసిన మాలతి ఇంకా రాలేదేమన్న ఆలోచన వచ్చింది. ఏదో ఆదుర్దా మనసును కదిలించగా లేచి బయట వరండాలోకి వచ్చి గేటువంక చూస్తూనే కాస్సేపు నిలబడింది. తోటపనివాడు చెట్లకు నీళ్ళు పడుతున్నాడు.

వరలక్ష్మమ్మ మళ్ళీ వచ్చి హాల్లో సోఫామీద కూర్చున్నది. మాలతి ఇంటికి వచ్చేసరికి అయిదున్నర దాటిపోయింది. వస్తూనే చేతిలో వున్న పుస్తకాలను టీపాయిమీద పడేసి తల్లిపక్కనే కూర్చుంటూ,

'అమ్మా! తెగ ఆకలిగా వుందే!' అంది.

'సరేగాని ఇంత ఆలస్యమేం?'

'క్లాసులు కాగానే మీటింగ్ పెట్టారమ్మా-ఎల్లుండి నాగార్జునసాగర్ ఎక్స్‌కర్షన్ ప్రోగ్రామ్ పెట్టుకున్నారు.'

'ప్రోగ్రామా! ఎల్లుండా!' అంది వరలక్ష్మమ్మ కంఠంలో అయిష్టతను ధ్వనింపజేస్తూ.

'అదేమిటమ్మా అలా అంటున్నావ్. ఇదివరకు నేను ఎన్నిసార్లు వెళ్ళలేదు' అంది మాలతి.

'అదిగాదే! ఎల్లుండి రమణయ్యగారింట్లో గృహప్రవేశం. మధ్యా

హ్నం ఆయనా, ఆయన భార్య కాంతమ్మా వచ్చి పిలిచి వెళ్ళారు. అందర్నీ తప్పకుండా రమ్మన్నారు.

'పిలిచేవాళ్ళు అలాగే పిలుస్తారు. మరి మనకు వీలు పడాలిగా.'

'అలాగేం! అయితే మీ వాళ్ళతోనే ఆ మాట అనలేకపోయావా పిలవగానే యెగిరి గెంతుకుంటూ వెళ్ళకపోతే!'

తల్లి ముఖంలో కోపం చూచి మాలతి చిన్నబుచ్చుకుంది. వరలక్ష్మమ్మ కూతురువంక చూచి నిట్టూర్పు విడిచి 'సరేలే వెళ్ళి బట్టలు మార్చుకురా. టిఫిను తీసుకుందువుగాని. ఇంక మీ నాన్నగారి ప్రోగ్రాములేమిటో-ఏ కాలికి తాకినా మోకాలికే నెప్పి అని ఇటువంటి విషయాల్లో నాకు తప్పదుగదా!'

మాలతి పుస్తకాలు తీసుకుని మేడమీద తన గదిలోకి వెళ్ళింది బట్టలు మార్చుకునే వుద్దేశంతో. వరలక్ష్మమ్మ వంటింటివైపు వెళ్ళింది. అప్పటికే సుభద్ర టిఫిను తయారుచేయడం పూర్తి అయింది.

'అమ్మాయి వచ్చింది. టిఫిను ప్లేటులో పెట్టివ్వు సుభద్రా' అన్నది.

'మీరు కూడా తీసుకోండి' అన్నది సుభద్ర రెండు ప్లేట్‌లలో వుప్మా, రెండు ప్లేట్లలో హల్వా పెట్టి 'ఈ ప్లేటులోవున్న వుప్మా మీకు. ఇందులో వుప్పులేదు' అంది.

'నా కోసం వేరే చేశావా?'

'లేదండీ. వుప్మా అయిపోయే సమయానికి కాస్త వేరేగాతీసుకుని, వుప్పునీళ్ళలోకలిపివేసి కలియపెట్టాను. మీకు కావలిస్తే కొద్దిగా టేబుల్ సాల్ట్ కలుపుకోండి' అన్నది సుభద్ర.

వరలక్ష్మమ్మ ఒక్క క్షణం సుభద్ర వైపుచూసి ఆ పదార్థాలు పెట్టిన ట్రే తీసుకుని డైనింగుహాల్ వైపుకు నడిచింది. డైనింగు హాలు డ్రాయింగు రూమును ఆనుకునివుంది. అక్కడే చేతులు కడుక్కోడానికి సింకూ వగయిరా వుండటంచేత వరలక్ష్మమ్మ తప్ప యెవరూ వంటింటి వైపు వచ్చేఅవసరంలేదు. ఎప్పుడైనా తల్లికి సహాయం చేయాలని బుద్ధి పుడితే మాలతి వంటింటివైపుకు వస్తుంది. లేకపోతే తనచదువు గొడవలో వుండి పోతుంది. ఇంక గోవర్ధనరావు అంతే. అందుకనే వంటింటి హైరానా అంతా వరలక్ష్మమ్మదే.

స్వీటునూ, వుప్మానూ ఆవురావురు మంటూ తింటున్న కూతురు వంక తదేకంగా చూస్తూ తను మెల్లిగా తింటున్నది వరలక్ష్మమ్మ. నిజంగానే ఆ పదార్థాలు చాలారుచికరంగా,అమృతతుల్యంగావున్నాయి. వంటింటి పనినుండి తనకు విముక్తి కలుగుతే కావలసినంత విశ్రాంతి. బి. పి. దానంతటఅదే సర్దుకుంటుంది. అప్పుడింక తను పథ్యం పాటించవలసిన అవసరం కూడా వుండదనుకుంది సుభద్రను మనసులోనే అభినందిస్తూ.

'మరి కాస్త వేయించుకుంటావా' అడిగింది మాలతిని వరలక్ష్మమ్మ.

'ఊ. కాని అమ్మా ఇవాళ ఏ దేవతైనావచ్చి నీచేతికి మంత్రం వేసిందా యేమిటి! వుప్మా ఇంత రుచిగావుంది. హల్వాకూడానూ.'

'నాచేతికి మంత్రం వేయలేదుగాని దేవతే స్వయంగా తయారు చేసింది. ఇకమీద అలావుంది ఇలావుంది అని సొడ్లు పెట్టకుండా తృప్తిగా తిండి తినొచ్చు మీరు' అన్నది వరలక్ష్మమ్మ.

'ఏమిటీ, నీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు.'

'సుభద్రా! ఇంకాస్త వుప్మా పట్టుకురా అమ్మా' అనిపిలిచింది వరలక్ష్మమ్మ.

'సుభద్ర ఎవరే' అంది మాలతి ఆశ్చర్యంగా.

స్టీలువాత్రలో వుప్మా పట్టుకొని అక్కడికి వచ్చింది సుభద్ర. మాలతి ఆవిడవంక తేరిపార చూసింది. వరలక్ష్మమ్మ కెందుకో సుభద్రను వంటావిడ అని పరిచయం చేయడానికి మనసొప్పలేదు. సుభద్రలో యేదో ఉన్నత సంస్కారాన్ని చూడగలుగుతోంది ఆమె.శాపగ్రస్తమైనట్టు కొన్ని గౌరవనీయమైన కుటుంబాలు చితికిపోతాయి. అలాంటి సందర్భాల్లో స్త్రీ దైన్యస్థితిలో నిలబడిపోతుంది. నిర్వేదంతో క్రుంగి పోకుండా వ్యక్తిత్వానికి దెబ్బతగలకుండా, భవిష్యత్తులోకి దృష్టిసారించి తనమీద ఆధారపడ్డ పిల్లల కోసం ప్రవాహానికి యెదరీదడానికి సిద్ధపడ్డవ్యక్తి. ఆమె వ్యక్తిత్వాన్ని కించపరిచినందువల్ల తనకు కలిగే లాభమేమిటి? తను గౌరవంగా చూస్తే తక్కినవారు గౌరవం ఇస్తారు. ఒక పోలీసు ఆఫీసరు భార్యగా యిలాంటి విషయాల్లో ఆమెయెంతహడావుడి అయినా చేయవచ్చునుగాని వరలక్ష్మమ్మ తత్వం అలాంటిదికాదు. పోలీసు ఆఫీసరు భార్య కాకముందు ఆమె ఒక న్యాయాధికారి కూతురుగా పెరిగి పెద్దదయింది. భర్త యొక్క హోదా

సహజంగా ఆమెలో పెంచవలసిన దురహంకారాన్ని యేమాత్రమూ పెంచ లేదు. అందుకనే మాలతితో అన్నది.

'ఈవిడే సుభద్ర. నీకు దూరంగా అత్తవరుస అవుతుందిలే. మా పుట్టింటివైపు బంధువులు. నీవుగాని మీ నాన్నగాని యెన్నడూ చూడలేదు' అంది.

సుభద్రకు వరలక్ష్మమ్మ పాదాలమీద అమాంతంగా వాలిపోవాల న్నంత ఉద్విగ్నత కలిగింది. కానిసమాళించుకుంది. కళ్ళల్లో తిరిగిన నీళ్ళు కనుపించనీయకుండా మాలతికి మరికాస్త వృప్మా వడ్డించింది. మాలతి సుభద్ర వంక పరిశీలనగా చూస్తూ, 'ఏమిటమ్మా నీవు మరీను. ఆవిడ మనల్ని చూడాలనివస్తే ఆవిడచేత ఇదంతా చేయించావా' అంది.

'అదేమీలేదమ్మా. అమ్మయేదో చేస్తానంటే వూరికే కూచోడమెందు కని నేనేచేశాను' అంది సుభద్ర.

'నాకేం నచ్చలేదత్తయ్యా ఇలా చేయడం. ఎంతయినా నీవు గెస్టువు గదా! నీకు మర్యాద చేయడంపోయి' అంది మాలతి.

ఈసారి కొంతయినా నిజం చెప్పక తప్పలేదు వరలక్ష్మమ్మకు.

'ఈ అత్తయ్య గెస్టుకాదే. ఇంక మనింటి మెంబరే' అన్నది.

'నిజం' అంది ఆశ్చర్యంగా మాలతి.

'నిజంగానేనే. ఇంక వంటింటి రాజ్యపాలన అంతా ఆవిడదే. నీకు మంచి నీళ్ళు కావాలన్నా ఆవిడనుఅడిగి త్రాగాలసిందే.తెలిసిందా.ఇప్పుడు కాఫీతాగి దానిరుచిచెప్పు' అంటూ ఫ్లాస్కులోకాఫీ కప్పులోవంపి మాలతికి ఇచ్చి తనూ వొక కప్పులో పోసుకుంది. మాలతి కాఫీని కాస్త చప్పరించి 'వండ్రఫుల్, సుపర్బ్' అని పెద్దగా అరిచినంత పనిచేసింది. కాఫీతాగడం పూర్తిచేశాక మాలతి 'అమ్మా ఎల్లుండి ఎక్స్‌కర్షన్‌కు ఏవైనా ఐటమ్స్ తీసుకు వెళ్ళాలే' అంది.

'ఎంత మందికేమిటి?'

'మా బాచ్ తొమ్మిది మంది.'

'అందరికీ నువ్వే పట్టు కెళ్ళాలా-వాళ్ళేమీ తేరా?'

'తెస్తారనుకో కాని నాకు మాత్రమే కాస్తంత పట్టుకెళ్ళాలంటే యెలాగో వుంటుంది.'

'విన్నావా సుభద్రా. ఇదీ దీనివరుస. అంత మందికీ నచ్చేట్టు ఏం చేసి పెడతావో నీఇష్టం నీవోపిక.'

'పులిహోర చేయనా, వెజిటెబుల్ బిరియాని చేయనా' అంది సుభద్ర.

'ఎప్పుడూ పులిహోరే! బిరియానీ చేసిపెట్టు అత్తయ్యా!'

'అత్తయ్యా' యెంతతియ్యని పిలుపు. అలాపిలిపించుకునే యోగ్యత తనకుందా అనుకున్నది సుభద్ర.

'అలాగేనమ్మా! స్వీట్ ఏమైనా కావాలా.'

'నాకేమీ తోచదత్తయ్యా. నీ చేత్తో ఏం చేసినా అమృతంలా వుంటుందని నా అభిప్రాయం.'

'రవ్వలడ్లు చేస్తాలే.'

'ఓ.కే...'

ఇంతలో ఇంటిముందు కారు వచ్చి ఆగిన శబ్దమైంది. 'నాన్నగారు వచ్చారు' అంది మాలతి. వరలక్ష్మమ్మ లేచి ఆయనకు ఎదురు వెళ్ళింది.

# 3

రమణయ్యగారి గృహప్రవేశానికి వెళ్ళి వచ్చాక వరలక్ష్మమ్మ మనస్సు తమకూ ఒక స్వంత ఇల్లు వుంటే బాగుండునన్న ఆలోచనలో పడింది. ఈ ఉద్యోగమూ, హోదా భర్తకు వున్నంత కాలమే తమకు ఈ లాంటి ఇండ్లు ప్రాప్తం. తరవాత ఏఅద్దెకొంపల్లోనో కాలం వెళ్ళబుచ్చవలసిందే. తను కాపురానికి వచ్చిన దగ్గరనుండీ ఆవూరు ఈవూరు బదిలీమీద తిరిగి తిరిగి ఇటీవలే వో అయిదేళ్ళుగా ఇక్కడే కుదురుగా వుండటం. గోవర్ధనరావుకీ వయస్సు మీదపడుతున్నది. పోలీసు ఉద్యోగిగనుక ఎంత గంభీరంగా కనుపించినా వయసు లక్షణాలు వయసువి. అతనికి యాభై రెండేళ్ళు దాటుతున్నవి. రిటైర్ కావడానికి ఇంకా ఎంతకాలమోలేదుగదా. రోజులుఇట్టే ఆశ్చర్యకరంగా తిరిగిపోతాయి. ఉద్యోగంలో గోవర్ధనరావు నిర్వహిస్తున్నది కీలకమైన స్థానమే. పై సంపాదనకు ఎన్నో అవకాశాలు వున్నవి. కాని ఏం లాభం, అతడు ముక్కుకు సూటిగావెళ్లే మనస్తత్వం

గలవాడు. తన చేతుల మీదుగా వీలుపడిన సహాయాన్ని ఎవరికయినా చేసి పెడతాడుగాని, ప్రతిఫలం మాత్రం ఆశించడు. వీలుకాకపోతే చెయ్యలేనని కచ్చితంగా చెప్పేస్తాడు. అందుకనే అతనంటే గౌరవమూ భయమూకూడా వున్నది ప్రజల్లోనూ, ఇతర సిబ్బందిలోనూ కూడా.

గోవర్ధనరావుకి ఇంటి విషయాల ధ్యాసకన్నా ఉద్యోగపుధ్యాసే యెక్కువ. ఏ కేసుతీసుకున్నా అది పూర్తి అయ్యేవరకూ నిద్రపట్టదతనికి. ఏ అపరరాత్రి టెలిఫోన్ మోగి అతను వెళ్ళవలసిన ఆవశ్యకతవున్నా మరో ఆలోచన చెయ్యకుండా రివ్వున వెళ్ళిపోతారు. అందుకనే ఇంటి జంజాటనంతా వరలక్ష్మమ్మ తలమీదేవుండేది. దీనికితోడు ఒక్కగానొక్క కూతురు ఎదిగివస్తున్నది. చూస్తూ వుండగానే మాలతికి ఇరవై ఏళ్ళు వచ్చేసినవి. ఆపిల్లది బి. ఏ. చదవ వచ్చు. తరువాత కావాలంటే యే ఉద్యోగ మయినా చేయవచ్చు. కాని తలిదండ్రులుగా ఆమెకు తగ్గవరుణ్ణి చూసి వివాహం చేయవసిన బాధ్యత తమమీదనే వుందిగదా. తగిన వరుడు అంటే ఈడూజోడూ మాత్రమేగాదు. తమతోపాటేవుండిపోగల కుర్రవాడు కావాలి. ఇది అక్షరాల ఇల్లరికపునికాదు. గోవర్ధనరావు ఉద్యోగం విరమించాక అమ్మాయితోపాటు తామూ వుండడానికి అభ్యంతరంపెట్టని వరుడు కావాలి.

గోవర్ధనరావు యొక్క హోదాచూసి సంబంధం చేయడానికి చాలా మంది తమ ఇష్టాన్ని వెలిబుచ్చినా వీళ్ళ వుద్దేశం ఈ విధంగా వుండడం చేత ఆయా సంబంధాలు తటస్థంగా నిలిచిపోయినయి. వరలక్ష్మమ్మ దృష్టిలో మాలతి వయసు పెరిగిపోతూవున్నదిగాని, గోవర్ధనరావుకి మాత్రం మాలతి ఇంకా బేబీనే. మాలతి మనసులోనూ అదేభావన. ఒక మంచి అయ్యచేతిలో తనకూతుర్ని పెట్టాలన్న తనతల్లి మనసులో ఆవేదన వారికి అర్థంగాదు. రాబోయే రోజులను ఒకవిధంగా అంచనావేసుకుంటున్న వరలక్ష్మమ్మ మనసులో గూడుకట్టుకున్న కోరికలు రెండు. తమ కంటూ వొక ఇల్లు కట్టుకోడం. మాలతి పెళ్ళి వీలయినంత త్వరలో చేసెయ్యడం! ఎలాగూ ఈ సంవత్సరంలో మాలతికి బి. ఏ. పూర్తి అయిపోతుంది. తరువాత ఎం. ఏ. అంటూ కూర్చుంటుందేమో కాని తాను మాత్రం పెళ్ళి విషయంలో కాస్త గట్టి ప్రయత్నమే చేయాలనుకుంది.

రమణయ్య గారి గృహప్రవేశ మహోత్సవం కన్నుల పండువుగా జరిగింది. ఇల్లు ఎంతో పొందికగా, ముచ్చటగా కట్టుకున్నారు. ఎనభై వేలు అయిందన్నారు. అన్ని వస్తువుల ధరలూ విపరీతంగా పెరిగిపోయిన ఈ రోజుల్లో అన్ని సౌకర్యాలూ అమర్చుకున్న ఇంత ఇంటికి అయిన ఖర్చేమీ ఎక్కువ కాదనిపించి వరలక్ష్మమ్మకి. తన వూహాలోవున్న ఇల్లూ ఈలాంటి సదుపాయాలతో కూడినదే. దానికి లక్షన్నర దాటుతుందేమోనని ఆమె భయపడుతూ వచ్చింది. ఈ మాత్రంతో ఇల్లు కట్టుకోగలిగితే చాలు. ధరలు ఇంకా ఆకాశాన్ని అంటుకోకముందే జాగ్రత్త పడడం మంచిది. ఆ రాత్రి భర్తతో ఈవిషయం కదపాలని ఆమె సమయంకోసం నిరీక్షిస్తూ వుంటే గోవర్ధనరావే అన్నాడు.

'రమణయ్య ఇల్లు చక్కగా వుంది కదూ' అని.

'అవునండీ. ఆ మాట నేనే అనిందామనుకుంటున్నా. మీరే అన్నారు. అలాంటిది మనంకూడా కట్టుకుంటే బాగుంటుందండీ. ప్లాటు కొనివుంచి అప్పుడే మూడేళ్ళు దాటిపోయినై' అన్నది.

'నేనూ అదే ఆలోచిస్తున్నాలే. వీలైనంతత్వరలో ఇల్లుకట్టుకొని స్వంత ఇంట్లో అమ్మాయి పెళ్ళిచేయాలని.'

'ఇన్నాళ్ళకి ఎంత మంచి మాట విన్నానండీ' అన్నది. భర్తమనసు లోనూ ఇంత తపన వున్నదని ఆమెకు ఇప్పటికిగాని అర్థం కాలేదు.

'వాళ్ళకి కట్టించిన ఇంజనీరు ఎవరో కనుక్కోండి. అతనికే ఈ పని అప్పచెబుదాం' అంది మళ్ళీ.

'మంచి ఆలోచనే. వుండు' అంటూ ఫోన్ యెత్తినంబరు కలిపాడు.

'హలో, రమణయ్య స్పీకింగ్.'

'నేనేనోయ్. గోవర్ధనాన్ని.'

'ఆహా, ఏమిటి విశేషం? నామీద ఏదయినా కేసు బనాయిస్తున్నావా ఏమిటీ కొంపదీసి?'

'అలా బనాయించే రోజువస్తే నీదగ్గరికి నేరుగానే వస్తాను. పోలీసు కంఠం వినగానే మరీ అంత కంగారు పడగూడదోయ్ రమణయ్యా.'

'తమాషా కన్నానులే మరీ పోలీసు ఫోజు కొట్టకు.'

'తమాషా విషయమే అయినా పైన తథాస్తు దేవతలు తిరుగుతూ వుంటారుటలే. సరేగాని ఇంతకీ నన్ను విషయం చెప్పనివ్వు.'

'చెప్పు మరి.'

'నీ ఇల్లు ఎవరు కట్టించారోయ్.'

'బలే వాడివే. అనుమానం లేదంటూనే ఇదేం ప్రశ్న. బాబూ ఇది నా స్వంత డబ్బుతో నేనే కట్టించుకున్నాను. ఏమైనా దాఖలాలు కావాలంటే నిరభ్యంతరంగా చూపిస్తాను.'

గోవర్ధనరావు గొల్లున నవ్వాడు.

'రమణయ్యా నీవునిజంగానే అనుమానపడేట్టు కంగారుపడిపోతున్నావోయ్.'

'మరేమిటి లేకపోతే నీ ప్రశ్న.'

'నీ ఇంటికి ప్లాన్ వేసి కట్టించిన ఇంజనీరు ఎవరూ అని నా ప్రశ్న యొక్క భావం. గుమ్మడికాయ దొంగ యెవరూ అంటే భుజాలు తడుము కున్నట్టుంది నీపని.'

ఈ సారి ఆ వైపునుండి నవ్వు వినిపించింది.

'మీ పోలీసు వాళ్ళకి ఎదుటి వాళ్ళని తికమకపెట్టే ప్రశ్నలు వెయ్యడం బాగా అలవాటు. ఈ ప్రశ్న నేరుగా అడుగుతే సరిపోయేదిగా.'

'ఇప్పుడు అర్థమైందిగదా చెప్పు.'

'ఏమిటి సంగతి? నీవూ ఇల్లు కట్టుకోవాలనా! రేపు ఉదయం నీవు ఆఫీసుకు వెళ్ళేముందు మాయింటికిరా. మాధవరావని ఆర్కిటెక్ట్ మా యింటికి సమీపంలోనేవుంటాడు. పరిచయం చేయిస్తాను. తక్కిన వివరాలు మీరు మాట్లాడు కోండి.'

'అలాగే థాంక్యూ వుంటాను' అంటూ ఫోన్ పెట్టేసి భార్య వంక తిరిగాడు గోవర్ధనరావు.

'రేపు వుదయం వాళ్ళ ఇంటికి వెళుతే ఆ ఇంజనీరుతో పరిచయం చేస్తాట్ట' అన్నాడు.

'వెళ్ళిరండి. శుభస్యశీఘ్రం అన్నారు పెద్దలు' అన్నదివరలక్ష్మమ్మ. ఆ రాత్రి వరలక్ష్మమ్మ భర్తను చాలా సేపు నిద్ర పోనివ్వలేదు, ఇంటికి ఎన్ని ద్వారబంధాలు వుండాలో, ఎన్ని గడపలు వుండాలో, వంట ఇల్లా,

స్టోరుగదీ ఎలావుండాలో వివరించి చెప్పడం మొదలు పెట్టింది. ఆమె చెప్పిందంతా తాపీగా విన్నాడు గోవర్ధనరావు. తరువాత 'నువ్వు వేసుకునే నిద్రమాత్ర ఒకటివ్వు' అన్నాడు.

'ఎందుకూ?' అన్నది వరలక్ష్మమ్మ ఆశ్చర్యంగా.

'నీఆలోచనలన్నీ నాతల కెక్కించావు. ఇంకనాకు నిద్రేం పడుతుంది' అన్నాడు నవ్వుతూ.

'చాల్లెండి పరిహాసాలు' అంటూ పక్కకు తిరిగి పడుకుంది వరలక్ష్మమ్మ.

ధనలక్ష్మి సిండికేట్ బ్యాంక్ అనబడే ఒక ప్రయివేటుబ్యాంకులో మంచి హోదాలో వున్నాడు రమణయ్య. గోవర్ధనరావూ అతనూ దూరపు బంధువులేకాక వొక ఈడు వారూ, క్లాస్‌మేట్స్ కూడాను. కాలేజీ చదువు పూర్తి కాగానే గోవర్ధనరావు ఐ. పి. యస్ లో వుత్తీర్ణుడై పోలీసు శాఖలో చేరాడు. రమణయ్య మొదట గవర్నమెంటు సర్వీసులోనే చిన్న వుద్యోగంలో చేరాడు గాని తన తెలివితేటలకి అది ఎదుగూ బొదుగూ లని ఉద్యోగంగా తోచి దానికి రాజీనామా ఇచ్చి వొక కమర్షియల్ బాంకులో ఉద్యోగం సంపాదించుకోగలిగాడు.

దాదాపు పదిహేనేళ్ళ క్రితం ధనలక్ష్మి సిండికేట్ బ్యాంక్ స్థాపించబడింది. ఆ బ్యాంకు నడపడానికి అనుభవజ్ఞులయిన బ్యాంకు వుద్యోగస్తులు కావలసిరావడంచేత వేతనాలూ ఇతర భత్యాలూ తక్కిన బ్యాంకులకంటే ఎక్కువ ప్రకటించారు. ఇతర బాంకుల్లో పైకి వెళ్ళే అవకాశాలు తక్కువ వున్న వారంతా ఈ బ్యాంకు వుద్యోగానికి ఎగబడ్డారు. అటువంటి వాళ్ళలో రమణయ్య వొకడు. తక్కిన బాంకులకంటే కూడా ఈ బ్యాంకు డిపాజిట్లు మీద వడ్డీరేటు కాస్త అధికంగా ఆశ చూపడంచేత చాలా మంది వ్యక్తులేగాక కొన్ని పారిశ్రామిక సంస్థలు కూడా ఈ బ్యాంకులోనే తమ నిధులను మదుపుపెట్టసాగారు. దానితో కొద్ది కాలంలోనే ధనలక్ష్మి సిండికేటు బ్యాంకు యొక్క వ్యాపారసరళి ఇతోధికంగా పుంజుకొని మంచి కీర్తిని సంపాదించుకొంది. సిటీలోనే మూడు బ్రాంచీలు కూడా తెరిచింది.

రమణయ్య మంచి వేతనంమీద వొక బ్రాంచీకి మేనేజరుగా వుంటు

న్నాడు. వెనుక ఆస్తిపాస్తులు యేమీ లేనివాడు ఈనాడు తనకంటూ ఒక చక్కని ఇల్లు కట్టుకోగలిగాడు. ఇంటి డిజైనే గాకుండా లోపల వసతులు కూడా చక్కని ప్రణాళికతో కట్టబడింది. ఈ విషయమే వరలక్ష్మమ్మను బాగా ఆకర్షించింది. దానితో తనుకూడా ఇలాంటి ఇల్లుకట్టుకుంటే బాగుండు నన్న ఆలోచన వచ్చింది. అంటే ఇది వరకు ఇల్లు కట్టుకోవాలన్న ఆలోచన లేకకాదు.

శాంతినగర్‌లో నాలుగువందల గజాలప్లాటు అమ్మకానికి వస్తే కొని రిజిష్టరు చేయించి మూడు సంవత్సరాలకు పైనే అయింది. కానిఇల్లుకట్టించే విషయమే యే కారణం చేతనో ఇంతవరకూ వాయిదా పడుతూ వచ్చింది. ఇప్పుడు ఈ భావనకు యేదో చలనం కలిగింది.

తనకు కలిగిన ఆలోచనే భర్తకు కూడా కలగడంతోవరలక్ష్మమ్మ మనస్సు ఆనందంతో పొంగిపోయింది. తాము కట్టుకోబోయే ఇల్లు కంటి ముందు కనిపిస్తున్నట్లుగా ఆమె సంబరపడిపోయింది. ఆ ఆనందాన్ని ఆలోచనలనీ మనసులో దాచుకోలేక భర్తతో ఏకరువు పెట్టేసి 'దేనికయినా ఘడియరావాలి' అంటూ నిద్రలోకి జారుకుంది ఆ రాత్రి వరలక్ష్మమ్మ.

# 4

మర్నాడు ఉదయం గోవర్ధనరావు రమణయ్య ఇంటికి వెళ్ళడానికి తయారవుతూంటే తల్లిద్వారా విషయం విన్న మాలతి తనూ తండ్రివెంట వెడతానన్నది.

'నువ్వెందుకూ?' అన్నది వరలక్ష్మమ్మ.

'రమణయ్య అంకుల్ ఇల్లు నేను చూడలేదుగా అందుకని' అన్నది మాలతి.

'పిలిచి పేరంటానికి రమ్మంటే పిక్నిక్కూ పితలాటమూ అంటూ వెడితివి. ఇప్పుడు వెడితే యేం బాగుంటుంది.'

'ఎందుకు బాగుండదూ. అయినా వెడితే వొద్దంటారా ఏమిటి?'

'కాలేజీకి వెళ్ళవా మరి?'

'ఎందుకు వెళ్ళనూ! అక్కడ్నించి అలాగే వెళ్ళిపోతాను.'

ఇంతలో గోవర్ధనరావు డ్రెస్ చేసుకుని వచ్చాడక్కడికి.

'అమ్మాయి మీతో వస్తానంటోంది' అన్నది వరలక్ష్మమ్మ.

'ఎందుకూ?' అన్నాడు ఆయనా వరలక్ష్మమ్మ లాగానే.

'నాన్నా! ప్లీజ్! వాళ్ళ యిల్లు చాలా బాగుందటగా. చూడాలనుంది' అంది మాలతి.

'అయితే మరి కాలేజికి వెళ్ళవా?'

'అటునుంచి నేరుగా వెళ్ళిపోతాను.'

గోవర్ధనరావు కాఫీ తాగటం పూర్తిచేసి ఇవతలికి వచ్చాడు.

ఆయన రోజూ తొమ్మిదిన్నర ప్రాంతానికి డ్యూటీకి బయలుదేరు తాడు. కాని అతనికోసం ఆఫీసుకారు మాత్రం ఏడున్నర గంటలకే హాజ రుగా వుంటుంది. మాలతీ, గోవర్ధనరావు వచ్చి కారు వెనుక సీట్లో కూర్చు న్నారు. డ్రయివరు కారు స్టార్టు చేశాడు. నల్లకుంటలో వున్నవారి ఇల్లు విడిచి, బరకత్‌పురా, నారాయణ గూడా మీదుగా, గగన్‌మహల్ వేపుకు వెళ్ళసాగింది కారు.

కారు రమణయ్య ఇల్లు చేరింది. రమణయ్య హాల్లోనే వున్నాడు అతని షడ్డకునితో మాట్లాడుతూ. గృహప్రవేశానికి వచ్చిన బంధువులు కొంత మంది ఇంకా అక్కడే వున్నట్లున్నారు.

రమణయ్యకు ముగ్గురూ ఆడపిల్లలే. ఇద్దరికి పెళ్ళి అయిపోయింది. మూడవది చిన్నపిల్ల. తొమ్మిదో క్లాసు చదువుకుంటోంది. కూతుళ్ళూ, అల్లుళ్ళూ ఇంకా తక్కిన వారితో ఇల్లు సందడిగానే వుంది.

వాళ్ళను చూస్తూనే రమణయ్య లేచి వచ్చాడు. 'ఓహో! అమ్మాయి కూడా వచ్చిందే. చాలా సంతోషం. కాంతం యెవరొచ్చారో చూడూ' అని భార్యను కేకవేశాడు.

ఆ కేక విని లోపలనించి కాంతమ్మ వచ్చింది. 'రండి అన్నయ్య గారూ! రా మాలతీ' అంటూ కాంతమ్మ వారికి సాదరంగా స్వాగతం పలి కింది.

'ఏం మాలతీ నువ్వు గృహప్రవేశానికి రాలేదేం' అన్నాడు రమ ణయ్య.

'ఎక్స్‌కర్షన్ వెళ్ళాం అంకుల్. అందుకనే ఈ రోజు ఇల్లుచూసి పోదామని వచ్చాను' అంది మాలతి.

'అదేమిటండీవాళ్ళను నిలబెట్టే మాట్లాడుతున్నారు. అలా కూర్చోమనండి. కాఫీ తెస్తాను.'

'చూడు కాంతమ్మా ఇప్పుడు ఆ హడావుడి యేమీ పెట్టుకోకు. అమ్మాయికి యిల్లు చూపించు. నేనూ మీ ఆయనా కాస్త బయటికి వెళ్ళి వస్తాం.'

'ఉండండి నాన్నగారూ! పది నిముషాలలో నేనూ మీతోపాటే వస్తాను' అన్నది మాలతి.

'ఆల్ రైట్' అన్నాడు గోవర్ధనరావు అక్కడకుర్చీలోకూర్చుంటూ.

'నా యిల్లు చూసి నీకూ కోరిక పుట్టిందన్నమాట' అన్నాడు రమణయ్య.

'అవునోయ్. సైట్‌కొని మూడేళ్ళయింది. ఇల్లు కట్టించే విషయం మాత్రం వాయిదా పడుతూ వచ్చింది. ఇప్పుడు ఘడియ వచ్చినట్లుంది దానికి' అన్నాడు గోవర్ధనరావు.

'అతడ్ని ఇక్కడికే పిలిపించమంటే పిలిపిస్తాను.'

గోవర్ధనరావు రెండుమూడు క్షణాలు ఆలోచించాడు.

'అక్కడికి వెళ్ళి కన్‌సల్ట్ చేయడమే మంచిదేమో.'

'సరే! వస్తానుండు. ఈయన మా తోడల్లుడు. నిన్న పరిచయం చేశానుగా మాట్లాడుతూ వుండండి. నేను డ్రస్ చేసుకుని వస్తాను.'

'అలాగే' అన్నాడు గోవర్ధనరావు. ఇంతలో రమణయ్య పెద్ద కూతురు కాఫీ తీసుకు వచ్చింది.

'ఎందుకమ్మా వద్దని చెప్పాను గదా.'

'తీసుకోండి అంకుల్ పరవాలేదు. ఏదో మీ పని వుండి వచ్చారు గాని మాటి మాటికీ మా యింటికి వస్తారా యేమిటి?'

'అబ్బో! అబ్బో! ఇంత పిల్ల నన్ను నిష్ఠూరమాడేంత పెద్దదానవై పోయావన్నమాట అప్పుడే' అన్నారు నవ్వుతూ. అలాగే కాఫీ కప్పుఅందుకున్నారు.

ఆ అమ్మాయి కాఫీ కప్పుతీసుకుని లోపలకి పోయింది. గోవర్ధన

రావు రమణయ్య తోడల్లుడితో మాట్లాడదా మనుకున్నాడుగానీ అతను పేపరు తిరగేస్తూ వుండడంతో ఇంటి గోడలకేసి చూస్తూ వుండిపోయాడు. మాలతికి కాంతమ్మ ఇల్లు చూపిస్తూ ఏదో చెప్పడం లోపలిగది నుండి స్పష్టంగా వినిపిస్తోంది.

'ఇల్లు చాలా బాగుంది ఆంటీ' అంటున్నది మాలతి.

'బాగా కట్టుకోగానేసరా అమ్మా! దాన్ని ఎప్పుడూ నీట్‌గా వుండేటట్లు చూడాలి. లేకపోతే ఇల్లుచూసి ఇల్లాల్ని చూడు అని నన్నే అంటారు.'

'ఆ మాటా నిజమే ఆంటీ! మీరింకా ఫర్నీచరూ అవీ తెప్పించినట్లు లేదే.'

'ఈ రోజులలో ఫర్నీచరు అంటేమాటలా? కనీసం పదివేలన్నా కావాలి. ఫ్రిజ్ యెలాగూ వుందనుకో, తక్కినవి వొక్కొక్కటే సేకరించుకోవాలి. ఇప్పటికి గూడు అంటూ ఏదో ఏర్పడింది గదా. తక్కినవి రాకపోతాయా.'

ఆ మాటలు విని గోవర్ధనరావు తనలో తాను నవ్వుకున్నాడు. ఇంతలో రమణయ్య డ్రస్సు మార్చుకొని వచ్చాడు.

'నేను రెడీ! పదండి' అన్నాడు.

'అమ్మాయ్ మాలతీ!' పిలిచాడు గోవర్ధనరావు.

'ఇదుగో వస్తున్నా నాన్నా! ఇంక నేను వెళ్ళొస్తానాంటీ' అంది కాంతమ్మతో మాలతి. కాంతమ్మ వొక జాకెట్‌పీస్ పెట్టి స్వీట్‌పాకెట్‌తో పాటు తాంబూలం ఇచ్చింది.

'ఇదంతా ఏమిటాంటీ! నేను నేరుగా కాలేజీకి వెడుతున్నా.'

'పరవాలేదు. కారులో పెట్టు ఇంటికి చేరుతుంది.'

'వస్తానాంటీ!'

ఇద్దరూ ఇవతలికి వచ్చారు.

'వస్తానమ్మా' అన్నాడు గోవర్ధనరావు.

'అలాగే అన్నయ్యా. త్వరలో ఇల్లు కట్టుకుని మాకంతాపప్పన్నం పెట్టండి' అంది కాంతమ్మ.

'ఆ ప్రయత్నమే...'

రమణయ్య తోడల్లుడు లేచి గోవర్ధనరావుకు నమస్కారం చేశాడు.

తరువాత ముగ్గురూ కారుదగ్గరకు వచ్చారు. రమణయ్య డ్రైవరుప్రక్కన కూర్చున్నాడు. గోవర్ధనరావూ, మాలతీ వెనుకకూర్చోగా కారుస్టార్టయింది.

రమణయ్య దోవచూపిస్తూ వుండగా డ్రయివరు రెండుమూడు మలుపులు తిరిగినాక ఒక బంగళాముందు కారు ఆపుచేశాడు.

ఆ బిల్డింగులో ఏదో కెమికల్ కంపెనీతాలూకు ఆఫీసువున్నట్లుంది. ఆ ఆఫీసు సిబ్బంది ఒక్కొక్కరే వస్తున్నారు. డాబామీద ఒకటో రెండో గదులు వున్నట్లు వున్నవి. మెట్లుకాంపౌండు లోపలనే వున్నాయి. అంటే, కింద ఆఫీసుకీ, పైన గదికీ ఏమీ సంబంధం లేనట్లుగా వుంది. రమణయ్య మెట్లమీదుగా గోవర్ధనరావునీ, మాలతినీ పైకి తీసుకువెడుతూ అన్నాడు.

'ఈ పైన వున్న గదులు ఈ కంపెనీ గెస్టు రూంలు- కాని ఇతనికి ప్రత్యేకమయిన ఏర్పాటుమీద అద్దెకిచ్చారు. మాధవరావు పనిచేసే కంపెనీ మేనేజింగు డైరెక్టరు ఈ కంపెనీ డైరెక్టర్లలో ఒకడు.'

'ఐ! సీ.' అన్నాడు గోవర్ధనరావు మెట్లు యెక్కుతూనే.

తలుపులు తీసే వున్నాయి. గదిలో ఒక పేముసోఫాసెట్టూ మధ్యన టీపాయి వున్నాయి. టీపాయ్ మీద ఆనాటి పేపరూ, కొన్ని వారపత్రికలూ వున్నవి. మాధవరావు ఆ సమయంలో యేదో స్కెచ్‌వేస్తూ వున్నాడు. అతని ముఖం గోడవేపుకు వున్నా యేదోతీవ్రంగా ఆలోచిస్తూవున్నట్లుంది. కనీసం వీళ్ళు లోపలికి ప్రవేశించిన అలికిడికూడా అతనికి వినిపించినట్లు లెదు. లేకపోతే తిరిగిచూసేవాడే.

రమణయ్య అతడ్ని పిలవప్రయత్నం చేయపోతే గోవర్ధనరావు వద్దన్నట్లు సౌంజ్ఞచేశాడు. అతని ఏకాగ్రతకు భంగం కలగకుండా నిశ్శబ్దంగా ముగ్గురూ సోఫామీద ఆసీనులయిూరు. మాలతి గోడలమీద వేలాడదీసిన రెండుమూడు ప్రకృతి దృశ్యాల పెయింటింగ్స్‌ను చూస్తూ కూర్చున్నది. బహుశా అవికూడా ఇతను చిత్రించినవేమో. యెంతో సహజంగా, రమణీయంగా వున్నాయి. పావుగంటగడిచినా మాధవరావు తిరిగి చూచే సూచన కనుపించలేదు. నిశ్శబ్దంగా కూర్చోవాలంటే వీరికీ ఇబ్బందిగానే వుంది. మరో పదినిముషాలు గడిచాక అప్రయత్నంగా వెనక్కు తిరిగిన మాధవరావు వీళ్ళను చూచి ఆశ్చర్యపోయాడు.

'హల్లో రమణయ్యగారూ! మీరా. ఎంత సేపయింది వచ్చి' అంటూ స్కెచ్ చేస్తున్న పెన్సిల్ అక్కడ పెట్టి వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

'అబ్బే మేం వచ్చి అరగంట అయింది. నిన్ను డిస్టర్బ్ చేయడం ఎందుకని' అన్నాడు రమణయ్య.

'భలే వారే. పిలవవలసింది. వీరి పరిచయం' అన్నాడు మాధవ రావు గోవర్ధనరావు వంక, మాలతి వంక చూస్తూ. రమణయ్య వారిద్దరినీ పరిచయం చేశాడు.

'నమస్కారమండి' అన్నాడు యెంతో వినయంగా.

'నమస్కారం' అన్నాడు గోవర్ధనరావు. మాలతి చేతులు జోడించింది. తనూ వొక సోఫా మీద కూర్చున్నాడు మాధవరావు.

'చెప్పండి! ఏమిటి విశేషం' అన్నాడు రమణయ్యతో మాధవరావు.

రమణయ్య విషయం వివరించాడు.

'సైటు ఏరియా యెంత వుంది?'

గోవర్ధనరావు చెప్పాడు.

'చూడు మాధవరావు! నీవు మాయింటికి యిచ్చిన ప్లాను చాలా ఎకనామికల్‌గా వుందని, నీ చేతనే తమయింటికి ప్లాన్ వేయించుకోవాలన్న వుద్దేశ్యంతో వచ్చారు. డూ యువర్ బెస్టు' అన్నాడు రమణయ్య.

మాధవరావు ఏదో సంకోచిస్తున్నట్లు ముఖం పెట్టాడు.

'ఏమిటోయ్ ఏదో ఆలోచనలలో పడ్డావ్?'

'మీకు తెలిసే వుంటుందనుకుంటాను. నేను డైరెక్టుగా అండర్ టేక్‌చేయకూడదని' అన్నాడు మాధవరావు.

'అదేమిటి?' అన్నాడు గోవర్ధనరావు కాస్త ఆశ్చర్యంగా.

'నేను పని చేస్తున్న కంపెనీలో నా సర్వీసు కండిషను అది.'

'ఐ.సీ.' అన్నాడు గోవర్ధనరావు.

'మీ బాస్ భుజంగరావుతో నేను మాట్లాడతానుగాని నువ్వు మాత్రం వీరి ఇంటి విషయంలో స్పెషల్ ఇంటరెస్టుతీసుకోవాలి.'

'పని నా చేతికి వచ్చాక అశ్రద్ధ అంటూ ఏమాత్రమూ వుండదు.'

'నిర్మాణ విషయంలో మీ టర్మ్సు, కండిషన్సు–' అడిగాడు గోవర్ధనరావు.

'ఈ పని విషయంలో నేను నిమిత్త మాత్రుణ్ణే. నిర్మాణపు బాధ్యతంతా కంపెనీవారిదే' అన్నాడు మాధవరావు.

'ఐ.సీ.' అన్నాడు మళ్ళీ గోవర్ధనరావు.

'నేనిలా అంటున్నానని మీరు మరో విధంగా భావించకండి. మా కంపెనీ రూల్సు ప్రకారం నేను నడుచుకోక తప్పదు' అన్నాడు యెంతో వినయంగా మాధవరావు.

'నీలాంటి వారు ఇంకా వున్నారా మీ కంపెనీలో?'

'చీఫ్ ఆర్కిటెక్టును నేనేననుకోండి. నాకు నలుగురు అసిస్టెంట్లు వున్నారు. నా సలహామీదే పనులు చేస్తూవుంటారు. కన్‌స్ట్రక్షన్ వర్కుకు నన్ను వేయడం అనేది మా బాస్ ఇష్టంమీద ఆధారపడివుంటుంది.'

'ఐ. సీ.' అన్నాడు గోవర్ధనరావు.

'మాబాస్ భుజంగరావుగారికీ, వీరికీ మంచి స్నేహం. రమణయ్యగారు చెబితే చాలులెండి ఆయనతో.'

'ఇంతకీ భుజంగరావు వూళ్లోవున్నాడా? నిన్న మాయింటిఫంక్షనుకు రానేలేదు...' అన్నాడు రమణయ్య.

'శుక్రవారం బాంబే వెళ్ళినట్టున్నారు.'

'ఎప్పుడు వస్తాడో మరి?'

'ఆయన ప్రోగ్రామ్ నాకు తెలియదండీ. కావాలంటే కనుక్కొని సాయంకాలం మీకు చెబుతాను.'

'అలాగే' అన్నాడు రమణయ్య.

ఇంతసేపూ మాలతి మౌనంగా వున్నది. ఆమె దృష్టి మాత్రం మాధవరావును పరిశీలనగా చూస్తూ వున్నది. నొక్కులు తిరిగిన చక్కని క్రాఫింగు, వెడల్పైన నుదురు, దానిమీద వింతగా నాట్యంచేస్తున్న ముంగురులు, విశాలంగా కాంతివంతంగావున్నకళ్లూ, ముఖానికి వన్నెతెచ్చేచక్కని ముక్కూ, పొందికగా అమరివున్న పెదిమలూ, సన్నగా మీసకట్టూ, ఆకర్షణీయమైన పసిమి ఛాయా, ఆమెను రెప్పవాల్చనీయడంలేదు.

అతనిమాటల ధోరణిబట్టియెవరో మహామాంత్రికుని మంత్రశక్తులకు కట్టుబడిపోయిన వీరుడైన రాకుమారుడిలా వున్నాడు అనుకుంది మాలతి.

గదిలో కాసేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది. మాలతికి అతన్ని మరికాసేపు చూడాలని వుందికానిసభ్యతగా వుండదనితనచూపులను ఇటుఅటు ప్రసరింప చేసింది. గోడకు వ్రేలాడుతున్న కొన్ని ప్రకృతి దృశ్యాల పెయింటింగ్స్ని ఆమె దృష్టిని ఆకర్షించాయి. ఎవరూ ఏమీమాట్లాడుకోక కూర్చోడం ఆమెకి యిబ్బందిగా తోచింది.

'మీరు మంచి ఆర్టిస్టులుకూడా కాబోలు. ఈ చిత్రాలన్నీ మీరు వేసినవేనా' అని అడిగింది అతనితో యేదోమాట్లాడాలన్న కుతూహలాన్ని ఆపుకోలేక.

'అవునండీ' అన్నాడు మాలతివంక చూచి చిన్నగానవ్వుతూ. ఆ నవ్వులోని దీప్తి ఆమె హృదయాంతరాళాన్ని స్పృశించినట్టయింది.

'చిత్రలేఖనం మీకు హాబీనా?'

'అవునండీ!' అదేచూపు అదేనవ్వు.

మాలతి మనసులో యేదో గిలిగింత! ఇంకా అతనితో మాట్లాడాలి అన్న కోరిక.

'మీకు ఏ సబ్జెక్ట్సు ఇష్టం?'

చిత్రకళమీద కూతురు చూపిస్తున్న ఆసక్తికి మురిసిపోయాడు గోవర్ధనరావు.

'చిత్రకారులను సాధారణంగా ఆకర్షించేవి ప్రకృతి దృశ్యాలే. అయినా మూడ్నిబట్టి ఏసబ్జక్టయినా తీసుకుంటుంటాను.'

గోవర్ధనరావు తన వాచీ చూసుకోడం గమనించిన మాధవరావులేచి 'ఉండండి కాఫీ తెస్తాను' అన్నాడు.

'ప్లీజ్ డోన్ట్ టేక్ ట్రబుల్–మళ్ళీ కలుస్తాంగా' అన్నాడు గోవర్ధన రావు. ముగ్గురూలేచి నిలబడ్డారు. మాధవరావు ప్రస్తుతం గీస్తున్నచిత్రాన్ని చూడాలన్న కౌతుకాన్ని ఆపుకోలేక పోయింది మాలతి. అప్రయత్నంగా అటువైపు నడిచింది. మాధవరావు ఆమెను అనుసరించాడు.

'అది ఇంకా స్కెచింగ్లోనే వున్నది' అన్నాడు.

'సబ్జెక్టు ఏమిటో?'

'దరిజేరిననావ అని. తుఫాను ఆటు పోట్లను తట్టుకొని వొకనావలో

వాక స్త్రీ, తన పిల్లలతో వొడ్డుచేరడం. మంచి ఎఫెక్ట్స్ కోసం ఆలోచిస్తున్నాను.'

'ఎప్పుడు పూర్తి అవుతుంది?' ఆసక్తిగా అడిగింది.

'వీలయినంత త్వరలో పూర్తి చేయాలని- కాని కుదరడంలేదు. పూర్తి అయ్యాక చూడాలని వుందా?'

మాలతి చిన్నగా నవ్వి అవునన్నట్టు తలవూపింది.

'పూర్తి అయ్యాక రమణయ్యగారి ద్వారా తెలియపరుస్తాను. వచ్చి చూద్దురుగాని' అన్నాడు.

'థాంక్స్' అన్నది మాలతి.

'ఇంక వెడదామా అమ్మాయ్' అన్నాడు గోవర్ధనరావు.

'అలాగేనాన్నా! వస్తామండీ' అన్నది మాలతి.

మాధవరావు గోవర్ధనరావుతో కరచాలనంచేస్తూ 'సారీ మీకు చాలా కష్టం కలిగించివుంటాను' అన్నాడు.

'నాటెటాల్. ఐలైక్ యువర్ అనెస్టి. మళ్ళీ కలుద్దాం' అన్నాడు గోవర్ధనరావు. ముగ్గురూ కిందకు దిగివచ్చారు. మాధవరావుకూడా దిగివచ్చి కారు వెళ్ళేదాకా అలాచూస్తూ నిలబడ్డాడు.

# 5

చిత్రకళ విషయంలో పెద్ద ఆరిందాలా మాధవరావును అన్ని ప్రశ్నలు వేసినందుకు మాలతి తనకు తనే ఆశ్చర్యపడింది. నిజంగా అతణ్ణి ప్రశ్నలు తను ఎందుకు పనిగట్టుకుని అడిగినట్టు? తండ్రి యేదో వ్యవహారం మాట్లాడుతుంటే మధ్య తనెందుకు కల్పించుకున్నట్టు? ఈ ప్రశ్నలకు మాలతి మనసులో సమాధానం లేదు. తనే అతన్ని అంత సేపు చూస్తూ వుందిగాని అతడు తనవంక నేరుగా చూడనైనా లేదు. అతని కళ్ళల్లో అయస్కాంతం వున్నది. అతని వర్చస్సులో ఆకర్షణ వున్నది. అతని అంగ సౌష్టవంలో ఠీవి వున్నది. అవన్నీ అప్రయత్నంగా ఆమె మనఃఫలకంపైన ముద్రపడిపోయినవి. కల్పించుకుని అతనితో మాట్లాడాలన్న కౌతుకం అప్రయత్నంగా ఆమెలో అంకురించింది. తండ్రి వచ్చిన పని అర్థాంతరంగా ఆగిపోతే ఆమె మనస్సు చివుక్కుమన్నది.

కనీసం అతనితో వొక్కమాటైనా మాట్లాడకుండా వెళ్ళడానికి ఆమెమనస్సు నిరాకరించింది. గోడకువ్రేలాడుతున్న చిత్రపటాలు ఆమెకు అతనితో మాట్లాడేఅవకాశాన్ని చక్కగాకల్పించాయి. ఆ సాకుతో అతనితో నాలుగు మాటలు మాట్లాడానన్న సంతృప్తి కలిగిందామెకు. కారు ముందుకు సాగిపోతూవుంటే వెనక్కు తిరిగి వొక్కసారి అతన్ని చూడాలన్న కౌతుకాన్ని అతిప్రయత్నంమీద నిగ్రహించుకున్నది. అతన్నిగురించిఇంకా ఏదోతెలుసుకోవాలని తెలియరాని ఆరాటం. గోవర్ధనరావు రమణయ్యతో యేదోఅంటున్నాడు.

'ఈ విషయం నీవు నాకు ముందే చెప్పివుండవలసింది. అనవసరంగా అతనికి ట్రబుల్ ఇచ్చాం'అన్నాడు.

'ఇతని సర్వీస్ కండిషన్సు నాకు మాత్రం ఏంతెలుసు? నేరుగా బాధ్యత తీసుకోగలడన్న ధైర్యంతోనే నిన్ను తీసుకువచ్చాను.'

'మరి నీకు తెలుసును ఈ సంగతి అన్నట్టు మాట్లాడాడే' అన్నాడు గోవర్ధనరావు.

'మొదలైందా నీ క్రాస్ ఎగ్జామినేషను. మెట్రొపాలిటన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ మానేజింగ్ డైరెక్టర్ భుజంగరావు మాబ్యాంక్ డైరెక్టర్లలో ఒకడు'

'అలాగా!ఆయన ఆ కిందవున్న కెమికల్ కంపెనీ డైరెక్టర్లలో కూడా వొకడు అన్నావు మరి.'

'అవును అన్నాను. అతను ఇంకా చాలా కంపెనీలకూ డైరెక్టరే. అయనకూ నాకూ చాలాపరిచయం. నేను ఇల్లుకట్టుకునే విషయంలో ఆయనను సంప్రదిస్తే ఆ బాధ్యత ఈ కుర్రవాడిమీద పెట్టాడు. ఇతడేం చేయగలడని మొదట అనుమానించానుగాని చాకులాంటివాడు. ఇది ఇట్లా వుందేం అని వేలెత్తి చూపడానికి వీలులేకుండా తన పని నిర్వహించుకుపోయాడు. నాకు వారి కంపెనీకట్టుబాట్లు తెలిసివుంటుందని అతడు అనుకుని వుంటాడుగాని, నాకా విషయాలే తెలీదన్న విషయం అతనికి తెలీక ఆమాట అనివుంటాడు.'

'ఇప్పుడు కర్తవ్యం!'

'నీకు ఇతని ద్వారానే పని జరగాలని వుంటే భుజంగరావువచ్చే

వరకూ ఆగవలసిందే. లేదంటావా, మీ పోలీసువారిముందు ఏ ఇంజనీరింగు కంపెనీ అయినా జీ హుకుం' అన్నాడు రమణయ్య.

గోవర్ధనరావు నవ్వకుండా వుండలేకపోయాడు. మాలతి తనలో తాను నవ్వుకుంది. అయినా తండ్రి యేం చెబుతాడోనని యెదురుచూడ సాగింది.

'కొంప మునిగింది యేముందీ? నాలుగు రోజులు ఆగుదాంలే. ఆ భుజంగరావుకి నీమీద గురివుందా అని' అన్నాడు గోవర్ధనరావు.

'గోవర్ధనం మనుషుల్ని మరీ ఇంతగా అనుమానించకూడదోయ్. ఇందాకే చెప్పాను గదా అతను నాకు బాగా తెలిసినవాడని. నీకెందుకూ ఈ విషయం నేను సెటిల్ చేస్తానుగా' అన్నాడు రమణయ్య.

'అలాగే.'

రమణయ్య తన ఇంటి దగ్గిరదిగిపోగా, మాలతిని కాలేజీ దగ్గర డ్రాప్ చేసి గోవర్ధనరావు తన డ్యూటీకి వెళ్ళిపోయాడు. ఆ రోజంతా మాలతి కాలేజీలో అన్యమనస్కంగానే వుండిపోయింది. ఆమె సాయంకాలం ఇంటికి వచ్చేసరికి గోవర్ధనరావు టిఫిను తీసుకుంటూ వరలక్ష్మమ్మకు వివ రాలు చెబుతున్నాడు. మాలతి కాఫీ మాత్రంతాగి యేమీ మాట్లాడకుండా అక్కడే కూర్చుంది. తరువాత గోవర్ధనరావు అర్జంటు పని వుందంటూ బయటకు వెళ్ళిపోయాడు.

'రమణయ్యగారి ఇల్లు నీకు నచ్చిందటే' అని అడిగింది వర లక్ష్మమ్మ.

'చాలా బాగుందమ్మా' అంది మాలతి.

'మనం కూడా ఆ మాత్రం కట్టుకోగలిగితే చాలు' అంది వర లక్ష్మమ్మ.

'మన సైటు ఇంకా పెద్దది. కాస్త పెద్దదే కట్టించుకుంటే బాగుం టుంది కదమ్మా.'

'బాగానే వుంటుందిగానీ అందుకు తగ్గ స్తోమతు వుండొద్దూ. అయినా ఇల్లు అనేది వొకప్రాప్తమే' అన్నది వరలక్ష్మమ్మ.

ఇదివరకు తల్లి దేనికయినా 'ప్రాప్తం' అంటే మాలతికి నవ్వు

వచ్చేది కాని మాధవరావును చూశాక ఇప్పుడామాట వింటే దానికి యేదో ప్రత్యేకమయిన అర్థం వుంటుందని ఆమెకు స్ఫురించింది.

మాలతికి యేం మాట్లాడాలో తోచక అక్కణ్ణించి లేచి తన గది లోకి వెళ్ళిపోయింది. ఇన్ని రోజులూ కాలేజీ, చదువూ, స్నేహితురాళ్ళూ, సినిమాలూ, పిక్నిక్కులూ అని గడిచిపోయిన తన జీవితం త్వరలో యేదో మలుపు తిరగబోతున్నది అన్న ఆలోచన రాగానే మాలతికి మన సంతా అస్తవ్యస్తమయినట్టు తోచింది.

తనకు వివాహం చేస్తారు. అవును. తలిదండ్రులకు అలా చేయక తప్పదు. తనకూ చేసుకోక తప్పదు. తనకు భర్తగా రాబోయే వ్యక్తి యెటువంటివాడు లభిస్తాడో? తన తండ్రి పెద్ద హోదాగల పోలీసు ఆఫీసరు...ఆ హోదాకు తగ్గ వ్యక్తే వస్తాడు. అంటే-వొక పోలీసు ఆఫీసరా? వొక డాక్టరా? వొక అడ్వొకేటా? వొక లెక్చరరా? వొక ఇంజనీరా?

ఇంజనీరు అనగానే ఆమెకు చటుక్కున మాధవరావు గుర్తుకు వచ్చాడు. అతనితో కలిగిన పరిచయం కొద్దిపాటిదే. అయినా అతణ్ణి గురించి యెందుకు తనకు ఆలోచన? తనకు తెలియకుండానే తన మనసు అతని విషయంలో యేదో ఆసక్తిని పెంచుకుంటోందా? అతణ్ణి తొలిసారి చూడగానే తన హృదయంలో యేదో మధురమయిన స్పందన. అతణ్ణి మరీ మరీ చూడాలనీ-ఎంత సేపయినా చూస్తూ కూర్చోవాలనీ అవ్యక్తకర మైన కోరిక—ఏదో నెపంతో అతనితో మాట్లాడాలన్న వుబలాటం. అతని దగ్గర సెలవు తీసుకుని బయలుదేరుతోంటే మనసు ఎందుకో మారాం మొదలుపెట్టింది. ఇంతకీ అతడి వివరాలేమీ తెలియవు.

అతడు వివాహితుడా? అయితే ఇంట్లో మరెవ్వరూ వున్న జాడ లేదే. మళ్ళీ అతణ్ణి కలుసుకునే అవకాశం పడుతుందా? అతనితో పరి చయం పెంచుకోడం తన తండ్రిగాని, తల్లిగాని అంగీకరిస్తారా? ఇంతకీ అతని ''దరిజేరిన నావ'' పూర్తికాగానే రమణయ్య ద్వారా తెలియపరుస్తా నన్నాడు. అతనలా యెందుకన్నట్టు-తనకు చూపించాలన్న ఆసక్తి అత నికీ వున్నదా?

ఏవేవో ఆలోచనలతో రాత్రి చాలా సేపు నిద్రపట్టలేదు మాలతికి. నిద్రలోకి జారుకున్నాక ఆమెకు వొక కల వచ్చింది. పెద్దనది. మధ్య నావ.

తుఫాను భీభత్సంగా వున్నది. నావ అల్లాడిపోతున్నది. అందులో వొక స్త్రీ ఇద్దరు పిల్లలతో వున్నది. వొక్క కుదుపుకు సరంగు నీట్లోపడి కొట్టుకుపోయాడు. ఆవిడ దిక్కుతోచక తన పిల్లలను దగ్గరకు తీసుకొని ఆకాశానికేసి దీనంగా చూడసాగింది. ఇంతలో వొడ్డున వున్న వొక యువకుడు నదిలోకి దూకి ఈదుకుంటూ నావదగ్గరకు వెళ్ళాడు. నావ చుక్కాని విరిగి, తెరచాప చిరిగివున్నది. అతడు లంగరు తాడును నావకొసకు బిగించి, వొక చేత్తో ఆ తాడును పట్టుకుని నీట్లోకి దూకి వొక చేత్తోనే ఈదుకుంటూ నావను వొడ్డుకు చేర్చాడు.

మాలతికి హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఇంతసేపూ తాను చూసింది స్వప్న దృశ్యమా! ఆమె మనసు మళ్ళీ ఆలోచనలో పడింది. మాధవరావు అస్పష్టంగా స్కెచ్‌చేసి పెట్టుకున్న చిత్రం తాలూకు దృశ్యమే తనకు కలగా వచ్చినందుకు ఆమెకు నవ్వు వచ్చింది. పక్షుల కిలకిలలు వినిపిస్తూ వుంటే తెల్లవారిపోయిందని గ్రహించి లేచి కూర్చుంది మాలతి.

# 6

సూర్యుడు అప్పుడే అస్తమించాడు. హుసేన్‌సాగరూ, టాంక్ బండూ-పరిసర ప్రాంతాలూ బంగారు పూత పూసినట్టు మనోహరంగా మెరిసిపోతున్నవి. కార్లూ, బస్సులూ, వొయ్యారం వొలకబోస్తూ టాంక్ బండ్‌మీద ఇటూ అటూ పరుగులు తీస్తూన్న దృశ్యం బిర్లామందిర్ నుండి చూడ్డానికి యెంతో ముచ్చటగా వుంది. చెరువుమీదుగా వస్తున్న గాలి ఆహ్లాదకరంగా వున్నది. బిర్లామందిర్ ఆవరణలో నిలబడి మాధవరావు తన్మయుడై ఆ దృశ్యాన్ని చూస్తూ వున్నాడు.

'చిత్రకారులు యేదో తన్మయత్వంలో వున్నట్టుంది' అన్న తియ్యని కంఠస్వరం విని మాధవరావు వెనక్కుతిరిగి 'మీరా...' అన్నాడు ఆశ్చర్యంతో.

'నా పేరు మీరాకాదు. మాలతి' అన్నది మాలతి అతనికి సమీపంగా వచ్చి నిలబడుతూ.

'ఆ దృశ్యాన్ని చూడండి. మీరూ నాలాగే తన్మయులౌతారు' అన్నా డతను.

మాలతి తన దృష్టిని టాంక్ బండ్ మీదకు మళ్ళించింది.

'ఈ కాంచనకాంతి కావ్యాలలో వర్ణించినట్టుగా వుంది' అంది.

'మీకు కావ్యాలంటే చాలా ఇష్టంలా వుంది.'

'చిత్రలేఖనం, శిల్పకళ అన్నీ ఇష్టమే.'

'అలాగా! వెరీగ్లాడ్! ఏమయినా చిత్రాలు వేశారా?'

'అవంటే నాకు ఇష్టం అన్నానుగాని వాటిలో ప్రవేశం వుందని చెప్పలేదే' అన్నది నవ్వుతూ.

మాధవరావూ చిన్నగా నవ్వాడు 'మీరు చక్కగా మాట్లాడుతారు.'

'థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్-మీరు కళాకారులు. ఏ మూడ్‌లో వున్నారో యేమో. మీ ఏకాంతానికి భంగం కలిగించలేదుగదా' అన్నది.

'అలాంటిదేమీలేదు. చెప్పండి-మీరు మాత్రమే వచ్చారా?'

'అవునండీ! రవీంద్ర భారతిలో వొక కల్చరల్ ప్రోగ్రామ్‌కు ఇన్విటేషన్ వస్తే వచ్చాను. ప్రోగ్రాం మొదలుపెట్టడానికి కాస్త ఆలస్యం వుందన్నారు. దేవాలయం దగ్గరే వుంటికదా దర్శనం చేసుకుని వెడదామని వచ్చాను-దైవదర్శనంతో పాటు మీ దర్శనం కూడా అయింది. మీరు తరుచూ వస్తుంటారా ఇక్కడికి?'

'మా ఆఫీసు ఈ సమీపంలోనే. ఈ రోజు పని తొందరగా పూర్తి అయితే అలా కాలక్షేపం చేద్దామని వచ్చాను-నాకూ దైవ దర్శనంతో పాటూ మీ దర్శనమూ అయింది.'

'ఇవ్వాళ కాస్త ఫ్రీగా మాట్లాడుతున్నారు. ఆ రోజు అంతగా బిగుసుకుపోయినట్లు మాట్లాడారేం?'

'ఎందుకో ఆ రోజు నేను సరయిన మూడ్‌లోలేను. నేను గీయ బోయే చిత్రం తాలూకు స్కెచింగ్ సరిగ్గా కుదరక తలంతా కల్లోలంగా వుండింది.'

'ఇప్పుడు కుదిరిందా-'

'ఆ రోజు వున్న స్థితిలోనే వుంది. మళ్ళీ టచ్ చేయలేదు.'

'అదేం! మూడ్ రాకనా?'

'మూడ్‌రాక కాదుగాని-వూహకే సరయిన రూపకల్పన రాక-'

'నాకు చిత్రలేఖనం వచ్చివుంటే ఆ చిత్రాన్ని నేనే పూర్తిచేసి వుండేదాన్ని ఈ పాటికి-ఆ చిత్రాన్ని గురించి నాకు వొక కల వచ్చింది ఆ రాత్రే.'

'ఆశ్చర్యంగా వుంది. ఆ చిత్రాన్ని గురించి మీరు అంతగా ఆలోచిస్తున్నారా?'

'అదేమో నాకు తెలియదు. కాని నాకు కల వచ్చినమాట మాత్రం నిజం!'

'ఆ కల యేదో నాకు చెప్పగలరా-'

'ఎందుకు చెప్పలేనూ! తుఫాను భీభత్సంగా వుంది. నావ చుక్కాని విరిగి, తెరచాప చిరిగి నట్టేట్లో వూగులాడిపోతున్నది. సరంగు పట్టుతప్పి ఏట్లో కొట్టుకుపోయాడు. అందులో వొక స్త్రీ ఇద్దరు పిల్లల్ని తన దగ్గరకు తీసుకుని ఆకాశానికేసి చూస్తూ వుంది దైన్యంగా. ఇంతలో వొడ్డున వున్న వొక యువకుడు నదిలోకి దూకి ఈదుకుంటూ నావను సమీపించి, లంగరు తాడును నావకొసకు కట్టి, వొక చేత్తో ఆ తాడును పట్టుకుని, మరో చేత్తో ఈదుకుంటూ వచ్చి వొడ్డుకు చేరినట్టు.'

మాలతి కథనాన్ని ఆశ్చర్యంగా వింటున్నాడు మాధవరావు.

'మీకు చాలా చాలా థాంక్స్-' అన్నాడు.

'ఎందుకూ...'

'ఇలాంటి కల కన్నందుకు. నాకు సరిగ్గా కావలసింది ఈ ఎఫెక్టే!'

'అంటే ఈ ఎఫెక్ట్ ఎలా తీసుకురాగలుగుతారు?'

'వొడ్డుకు కాస్త సమీపంలో నావ వుంటుంది అందులో మీరు చెప్పిన వ్యక్తులు వుంటారు-ఆ యువకుడు తాడు పట్టుకుని ప్రయాసతో లేస్తూ వున్నట్టు-చుట్టూ తుఫాను ఎఫెక్టు-'

మాలతి కాస్సేపు మాధవరావు ముఖాన్ని నిదానించి చూసింది.

'ఇలాంటి చిత్రమే గీయాలన్న వూహ మీకెందుకు కలిగింది? మీరెప్పుడయినా అలా వొక నావ నట్టేట్లో తల్లడిల్లడం చూశారా? ఆ యువకుడు మీరే అయితే ఆ నావను వొడ్డుకు ఈడ్చుకు రాగలిగి వుండేవారా—'

'———————'

'చెప్పండి మాధవరావుగారూ. మీరింత సాహసం చేయలేనప్పుడు మీరు గీసే చిత్రం సహజత్వానికి దూరం కాదా?'

'కళా కారుడికి ప్రతిదీ అనుభూతమే కానక్కరలేదు. కొన్ని చిత్రాలు జీవితానికి సింబాలిక్‌గా వర్తించవచ్చు. వొడుదుడుకుల్లో ఇరుక్కున్న సంసార నౌకలో వొకస్త్రీయొక్క దైన్యస్థితి.సరంగుచనిపోయాక నావను వొడ్డు చేర్చగలనాని బాధతో చిత్రీకరించాలని నా ప్రయత్నం.'

'అలాగా! అవుతే అలాచిత్రించడం చిత్రీకరణలో వొకప్రయోగమే అవుతుంది. కళలను సహజత్వానికి దగ్గరగా ప్రతిబింబింప చేయడానికి అనుభవంకూడా అవసరం అన్నది నా అభిప్రాయం.'

'అంటే ఈ చిత్రం అంతసహజంగా వుండదంటారు మీరు.'

'నా వరకూ అలాగే అనిపిస్తున్నది. మీరు పూర్తి చేయబోయేది నా స్వప్నానికి ప్రతీక. ఆ స్వప్నానుభూతి నాదికాని మీదికాదు. మీవూహ ఇంకా అస్పష్టంగానే వుందంటున్నారుగా. మీరన్నట్టు అది సింబాలిక్ రెప్రెసెంటేషనే అవుతే-'

'అవుతే!'

'సరంగు లేక నావ నట్టేట్లో అల్లాడు తోంటే ఆ నావను వొడ్డు చేర్చేవారు యెవరా అని ఎదురు చూడకుండా, పిల్లలకు ధైర్యంచెప్పి ఆస్త్రీ తనే ఆనావను నడిపేప్రయత్నం చేస్తున్నట్టు చిత్రీకరించండి.మన సమాజ వ్యవస్థలో స్త్రీలకు యిలా ధైర్యంనూరిపోసి వుత్తేజపరచవలసిన బాధ్యత ఆధునిక చిత్రకారులమీద ఎంతయినా వున్నది' అన్నది మాలతి.

మాధవరావు ఆమె వంక రెండు మూడు క్షణాలు మౌనంగా చూచాడు. తర్వాత 'మీరు చాలా అమాయకంగా కనుపించినా మీ ఆలోచనలు తీవ్రంగానేవున్నాయే' అన్నాడు.

మాలతి మందహాసం చేసింది. 'ఆలోచనలు తీవ్రంగా వున్నంత మాత్రాన ముఖంకూడా తీవ్రంగా పెట్టుకోవాలని వున్నదా? ఆ రోజు మీరునన్ను మానాన్నగారి పక్కన చూశారు. నావయసుతోపాటు నావ్యక్తిత్వమూ భావాలూ ఎదిగినా నాతలిదండ్రులకు నేను పిల్లనే. అంత కంటే

భిన్నంగా నేను ఆలోచిస్తున్నట్టు కనిపిస్తే వారు తట్టుకోలేరు. అందుకనే వాళ్ళముందు పసిపిల్లలాగే వుండిపోతాను.'

'అలాగా. ఇప్పుడు మీరేం చదువుతున్నారు?'

'బి. ఏ. ఫైనల్.'

'వివాహం చేసెయ్యాలని మా తలిదండ్రుల అభిప్రాయం. యేదో సాధిద్దామని కొంతకాలం వాయిదా వేసినా స్త్రీకి జీవితంలో వివాహంఅన్నది అనివార్యమైందే కదా.'

'అందుకని తలిదండ్రుల మాటవిని బుద్ధిగా పెళ్ళిచేసుకుంటారన్న మాట. జీవితభాగస్వామిని ఎన్నుకోడం జరిగిందా?'

'ఇంకా అంతవరకూ వెళ్ళలేదు వ్యవహారం.'

'ఈ విషయంకూడా మీ తలిదండ్రుల నిర్ణయమేనా?'

'నా నిర్ణయానికే విలువ వుంటుందనుకుంటాను.'

'గుడ్. మీరు ఇల్లు కట్టించే విషయం ఎంతవరకూ వచ్చింది? మీ నాన్నగారు మాబాస్‌తో ఇంకా మాట్లాడినట్టులేదు.'

'మా నాన్నగారు టూర్‌మీదవున్నారు. బహుశా వచ్చాక వచ్చి మాట్లాడవచ్చు.'

'అలాగా!'

'ఆ కంపెనీలో మీరు చాలా కట్టుబాట్లమీద పనిచేస్తున్నట్టున్నారు!'

'అవును.'

'మీది డిగ్రీనా? డిప్లొమోనా?'

'బి. ఇ. ఫస్టుక్లాసు.'

'మరి గవర్నమెంటులో వుద్యోగం దొరకలేదా? లేకఇక్కడే జీతం ఎక్కువగా ఇస్తున్నారా?'

'గవర్నమెంటు వుద్యోగాలు అంత సులభంగా దొరుకుతాయా?'

'అదీనిజమే లెండి! ఇప్పుడు చేస్తున్నది మీయోగ్యతకు తగింది అయితేచాలు.'

'తగిందని అనుకునే సరిపెట్టుకుంటున్నాను. మనిషి యేదో విధంగా బతకాలిగదా మరి.'

'ఇక్కడ మీరు వొక్కరే వుంటున్నారా? మీవారు యెవరూలేరా?'

'మీరేదో మంచి ప్రోగ్రాం చూడాలని వచ్చారు. మిమ్మల్ని బోర్ కొట్టించటం ఇష్టంలేదు నాకు-'

మాలతి టైం చూసుకుంది. 'అవునండోయ్! మీతో మాట్లాడుతూ ప్రోగ్రాం సంగతే మరిచిపోయాను. వస్తాను. మీరింకా కాస్సేపు కూర్చుంటారా-'

'లేదు. నేనూ కిందకు వస్తాను-కాంటీన్‌లో కాఫీ తీసుకోడానికి మీకేమయినా అభ్యంతరమా?'

'పదండి-'

ఇద్దరూ మందిరం వైపు తిరిగి నమస్కరించి కిందకు దిగారు. ఇద్దరూ మౌనంగానే వున్నారు. తన స్వంత విషయాలు చెప్పడం ఇష్టంలేక మాధవరావు ప్రోగ్రాం సంగతి యెత్తాడు అన్న భావన ఆమె మనసును తొలిచివేస్తున్నది. హోటల్లో కూర్చున్నారు. మాధవరావు కాఫీకి ఆర్డరిచ్చాడు. కాసేపటికి బేరర్ రెండు కప్పుల కాఫీ తెచ్చి వారిముందు పెట్టాడు.

'మాధవరావుగారూ! మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలనివుంది.'

'అడగండి-'

'మీరు వూహించుకుని చిత్రించదలుచుకున్న ఆ స్త్రీ యెవరు?'

మాధవరావు వులిక్కిపడ్డాడు ఆ ప్రశ్నతో.

'అది వూహా చిత్రమే...'

'అనినాకు నమ్మకం కుదరడంలేదు. ఆ స్త్రీ మీ అంతరంగానికి చాలాదగ్గర వ్యక్తిఅయి, ఏదో ఆపదలో ఇరుక్కునివుంటే మీరామెనుఆదుకోలేని స్థితిలో వుండివుంటారు. యేదో అనుభూతి కళాకారుల్ని కదిలిస్తుందన్న నా అభిప్రాయానికి అర్థంలేదనుకుంటే నేనేమీ అనలేను.'

'మాలతిగారూ మిమ్మల్ని నా అసంపూర్ణ చిత్రమే కలత పెడుతున్నదో, మీ స్వప్నమే మిమ్మల్ని కలత పెడుతున్నదో నాకు అర్థం కావడంలేదు.'

'అవేమీకాదు. మీరేదో నిజాన్ని దాచిపెట్టడానికి చేస్తున్న ప్రయత్నం నన్ను కలత పెడుతున్నది.'

'ప్రయత్నంచేసి నిజాన్ని యెవరూ ఎంతకాలమో దాచిపెట్టలేరు. అయినా మీరెందుకలా అనుకుంటున్నారు?'

'మీ విషయాలు అడగ్గానే తప్పించుకున్నారు. అందుకని.'

మాధవరావు యేమీ మాట్లాడలేదు. చిన్నగా నవ్వాడు. ఇంతలో కాఫీ తాగడం పూర్తిచేశారు ఇద్దరూ.

'సారీ, మీమనసుకు కష్టం కలిగిస్తున్నానేమో. ఏదో మీవిషయాలు తెలుసుకోవాలన్న కుతూహలంకొద్దీ అడిగాను. అంతే' అంది మాలతి.

'ప్రస్తుతానికి నేను వొంటరివాణ్ణి. ఇంతకంటే వివరాలుచెప్పి మీ మనసును కష్టపెట్టడం నాకుఇష్టంలేదు. ఇంకపదండి. మీప్రోగ్రాంకు టైం అవుతోంది!' అన్నాడు మాధవరావు.

ఇద్దరూలేచి ఇవతలికి వచ్చారు. మళ్ళీ ఇద్దరూ మౌనం.

అతణ్ణి ప్రోగ్రాంకు ఆహ్వానించాలని సన్నగా కోరిక. కాని సాహ సించలేక పోయింది.

'మీరు నడిచే రూంకు వెడతారా...' అడిగింది.

'అవును. నా మోటర్ సైకిల్ రిపేరులో వుంది.'

మాధవరావు మాలతిని రవీంద్ర భారతివరకూ అనుసరించాడు. తరువాత ఆమె దగ్గర శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. మాలతి బయవుగా అడుగులు వేసుకుంటూ హాల్లోకివెళ్ళి వొక సీటు చూసుకొని కూర్చుంది. హాలు అప్పటికే నిండిపోయివుంది. ఐదు నిముషాలతరువాత తెరతొలగి ప్రోగ్రాం మొదలైంది. కాని ఆమె మనసు మనసులో లేదు. ఇంత సేపూ తనకూ, మాధవరావుకూ మధ్యజరిగిన సంభాషణంతా రికార్డుప్లేయరులాగా రివ్వున తిరుగుతోంది మస్తిష్కంలో. ఇలా ఎవరితోవాళ్ళతో వాదన పెట్టు కోవడం ఆమెకు ఇదే మొదటిసారి.

అతనికి తనమీద ఎలాంటిఅభిప్రాయం కలిగిందో! తనుకనబడేటంత అమాయకురాలు కాదని అంచనా వేసుకున్నాడేమో! అతని యెదురు వున్నంతసేపూ అతని ముఖాన్ని పరిశీలనగా చూడాలని ఆమె మనసు తహతహ లాడుతూనేవుంది. కాని యేదో శాలీనత తన ముఖాన్ని కిందకు దించుతూనేవుంది. అతన్ని గురించిన వివరాలన్నీ తెలుసుకోవాలన్న ఆరా టం! తన విషయాలే అడిగి తెలుసుకున్నాడుగాని అతడు బయపడలేదే! 'ప్రస్తుతానికి వొంటరివాణ్ణి' అనడంలో అతని వుద్దేశంయేమిటి? కలత భారిన మనసుతో ఆమె కార్యక్రమాన్ని సరిగ్గా చూడనే లేదు.

# 7

మాధవరావుకెందుకో సరాసరి తన గదికి వెళ్ళబుద్ధి కాలేదు. అప్రయత్నంగా అతని నడక పబ్లిక్ గార్డెన్ వైపు సాగింది. లోపలికి వెళ్ళి వొక మూలగా యెవరూ లేనిచోటు చూసుకుని గడ్డిలో కూర్చున్నాడు. పిల్లలు ఇంకా గోలగా ఆడుకుంటున్నారు. పల్చటి వెన్నెల ట్యూబ్‌లైట్ల కాంతిలో కయ్యం పెట్టుకుంటున్నది. రెండు నిముషాలు కరెంటుపోతే వెన్నెల ఫక్కున నవ్వింది. మళ్ళీ లైట్లు వెలిగినై. ఈసారి తెల్లటి మబ్బుతునక వొకటి చంద్రుణ్ణి కప్పేస్తే వెన్నెల మాయమై ట్యూబ్‌లైట్ల కాంతి వీర విహారం చేసినట్టు మెరిసింది కాస్సేపు.

మాధవరావు తలనిండా జోరీగల్లా ఆలోచనలు. ఈ రోజు మాలతిని కలుసుకోడం దైవికమే. ఆమె ఆలోచనలు ఎంత తీవ్రంగా వున్నవి! తన చిత్రలేఖనాన్ని ఎంత నిశితంగా చూచి విమర్శించగలిగింది! తన వూహలోనే అస్పష్టంగా వున్న చిత్రం ఆమెకు స్వప్నంలో గోచరించడం చిత్రమే. నట్టేట్లో నావలో వున్న ఆ స్త్రీ యెవరూ అని నిలవేసినట్టుగా అడిగితే తాను నిరుత్తరుడే అయిపోయాడు. మాధవరావుకు ఎందుకో దుఃఖం పొంగి వచ్చింది. ఎవరూ గమనించకుండా కన్నీళ్ళు వొత్తుకున్నాడు. తన విషయాలు తెలుసుకోవాలని మాలతికి ఆరాటంగా వున్నది కాబోలు. కాని ఆమె చెప్పుకున్నంత నిస్సంకోచంగా తన విషయాలు ఆమెతో చెప్పుకోగలడా తను?

వొంటరిగాణ్ణి, వొంటరిగాణ్ణి. మనసులో పదేపదే అనుకున్నాడు. ఈ వొంటరి తనం జీవితాంతం తనను వెంటాడుతుందా? మళ్ళీ దుఃఖం రాబోతే తమాయించుకున్నాడు. ఇంక అక్కడ కూర్చోబుద్ధిగాక తన రూంకు బయలుదేరాడు. మెల్లగా నడుచుకుంటూ అతడు తన రూం చేరేసరికి తొమ్మిది గంటలయింది. తలుపు తీసుకుని లోపలికి వెళ్ళి లైటు వెలిగించాడు. గది అంతా ఎందుకో బావురుమంటున్నట్టు తోచింది. ఇంట్లో యెవరూ లేరు. తను వొంటరిగాడు అన్న భావన అతనిలో మరింత ఉధృతమై అతణ్ణి కలచేసింది. మంచంమీద వాలిపోయి, తలగడకు ముఖం ఆన్చి వెక్కి వెక్కి యేడ్చాడు. కాస్సేపు అలా యేడ్చాక అతని గుండె

తేలికపడినట్టయింది. లేచి బట్టలు మార్చుకుని బాత్‌రూంకు వెళ్ళి స్నానం చేసి వచ్చాక వొళ్ళంతా హాయిగా వున్నట్టు తోచింది.

అతని దృష్టి స్టాండుకు బిగించిన కాన్‌వాస్‌మీద పడింది. ఆ చిత్రానికి మరో రూపం ఇవ్వాలి అనుకున్నాడు-ఆలోచనలు అస్తవ్యస్తంగా వున్నవి.

'ఆ స్త్రీ మూర్తి యెవ్వరు?' మాలతి తన ఎదురుగా నిలబడి ప్రశ్నిస్తున్నట్టు వులిక్కిపడ్డాడు. ఇంతలో 'సార్' అన్న పిలుపు వినిపించి వాకిలివంక చూశాడు. తన బాస్ భుజంగరావుగారి డ్రైవరు గంగులు.

'ఏమిటి గంగులూ...'

'అయ్యగారు మిమ్మల్ని అర్జంటుగా క్లబ్బుకి తీసుకురమ్మన్నారండీ.'

'ఎందుకూ?'

'ఎందుకంటే నాకేం తెలుసుద్దిబాబూ. తీసుకురమ్మన్నారు వచ్చాను. అంతే.'

'ఉండు బట్టలు మార్చుకు వస్తాను.'

'బాగా ట్రిమ్‌గా తయారయి రమ్మన్నారండీ.'

'ఎందుకూ?'

'ఎందుకంటే నాకేం తెలుసుద్దీ బాబూ-అలా చెప్పమన్నారు చెప్పాను. అంతే.'

'సరేలే కాస్త ఆగు.'

'మీ వెంట ఫిడేలు పెట్టికూడా తెచ్చుకోమన్నారండీ!'

'ఎందుకూ?'

'ఎందుకంటే నాకేం తెలుసుద్దీబాబూ-చెప్పమన్నారు చెప్పాను. అంతే.'

'అలాగేలే.'

'అలాగే మీరు రాసుకునే కలం కూడా తెచ్చుకోమన్నారండీ!'

'ఎందుకూ?'

'ఎందుకంటే నాకేం తెలుసుద్దీ బాబూ. చెప్పమన్నారు చెప్పాను. అంతే.'

అప్పను. గంగులుకేం తెలుసు భుజంగరావుగారి వుద్దేశాలు? ఆయన చెప్పమన్నది చెప్పాడు. అంతే. అతణ్ణి అన్ని ప్రశ్నలు వేయడం తనదే బుద్ధి తక్కువ. ట్రిమ్‌గా డ్రెస్ అయి రమ్మనడంలో తన యజమాని అభిప్రాయం మాధవరావుకు అర్థమైంది. క్లబ్బులో తను వయోలిన్ సోలో వాయించి సభ్యులను ఆనందపరచాలి. భాగ్యనగరంలో సఫైర్ నైట్ క్లబ్ సుప్రసిద్ధమైంది. అక్కడ అన్ని రకాల జూదాలూ, పానగోష్ఠులూ, నృత్య గీత కేళీ విలాసాలూ ముమ్మరంగా సాగుతుంటాయి. కాని ఇవేవీ బయటకు కనిపించవు. కేవలం సంగీత వాద్యగోష్ఠికి మాత్రమే కేటాయించబడిన పెద్ద హాలు వుంది. అందులో కేవలం సంగీత రసికులు మాత్రమే వచ్చి, ప్రతి రాత్రి అక్కడ జరిగే సంగీత కచ్చేరులను విని ఆనందిస్తుంటారు. కర్ణాటక, హిందూస్తానీ, పాశ్చాత్య సంగీత వాద్యగోష్ఠులు అనుదినమూ అక్కడ జరుగుతూ వుంటాయి.

మాధవరావు కర్ణాటక, పాశ్చాత్య బాణీలలో ఇంపుగా వయోలిన్ వాయించగలడన్న సంగతి తెలిసి భుజంగరావు ఆ క్లబ్బులో పర్‌ఫార్మెన్స్ ఇచ్చే అవకాశాన్ని కలిగించాడు. నెలలో కనీసం రెండుసార్లయినా అతని ప్రోగ్రాం వుంటుంది. భుజంగరావుకు యెవరయినా కొత్త వ్యక్తులతో పరిచయం అయితే వారికి మాధవరావు కచ్చేరి వినిపించి ఇతణ్ణి గురించి గర్వంగా చెప్పుకుంటాడు. ఈ రాత్రి యెవరయినా కొత్త వ్యక్తులు వచ్చారేమో! అలా అయితే తనని వయోలిన్ తెమ్మనడంలో అర్థం వుందిగాని-పెన్ను తెమ్మనడం యెందుకో! క్లబ్బు ఆనవాయితీకి అనుగుణంగా అతడు సూటు ధరించి ట్రిమ్‌గా తయారవడానికి అరగంట పట్టింది. అద్దంలో వొకసారి తన ముఖం చూచుకున్నాడు. కళ్ళల్లో దుఃఖపు ఛాయలు స్పష్టంగా గోచరిస్తున్నవి.

అది గమనించి మళ్ళీ అతని మనసులో కల్లోలం బయలుదేరింది. మరి కాస్సేపు ముఖాన్ని చూచుకుంటే నిజంగానే యేడ్పు వచ్చేస్తుందన్న భావన కలిగి అద్దం ముందు నించి ఇవతలికి వచ్చేశాడు. పెన్నూ, వయోలిన్ పెట్టె తీసుకుని, రూంకు తాళంపెట్టి కిందకు వచ్చేసరికి గంగులు కారునానుకుని నిలబడి సిగరెట్టు దమ్ములు కొడుతున్నాడు. షెరూన్

కలర్‌లో పొంటియాక్ కారు అది. గంగులు సిగరెట్ పీలుస్తూనే తలుపు తీసి స్టీరింగ్ దగ్గిర కూర్చున్నాడు.

మాధవరావు ఇటు వైపు వచ్చి గంగులు పక్కన కూర్చుని, వయోలిన్ పెట్టె పెట్టుకున్నాడు. కారు కదిలింది. తారు రోడ్డుమీద, మెత్తగా పూలనావలా తరలిపోతూ క్రమంగా వేగాన్ని పుంజుకుంది.

కారు సఫైర్ నైట్‌క్లబ్ ఆవరణలోకి వచ్చింది. మంద్రస్థాయిలో పాశ్చాత్య సంగీతం వినిపిస్తున్నది. మాధవరావు కారు దిగి వొక్కసారి క్లబ్బు భవంతికేసి చూశాడు. లైట్ల అలంకరణతో యెంతో ఆహ్లాదకరంగా వున్నా అతని మనసెందుకో భయవిహ్వలమయింది. ఇతని రాకకోసమే యెదురు చూస్తున్నట్టు నిలబడ్డ క్లబ్బు సెక్రటరీ ఇతణ్ణి సమీపించి సాదరంగా లోపలికి తీసుకువెళ్ళాడు. అక్కడ హాల్లో వేసి వున్న టేబుల్స్ దగ్గర ఆడా మగా చాలామంది కూర్చుని వున్నారు, తమకు కావలసిన డ్రింక్స్ తీసుకుంటూ. భుజంగరావు ముగ్గురు కొత్తవ్యక్తులతో మాట్లాడుతూ వొక టేబుల్‌దగ్గర కూర్చుని వున్నాడు. ఆ సెక్రటరీ మాధవరావును భుజంగరావుదగ్గరకు తీసుకువచ్చి వదలి అవతలికి వెళ్ళిపోయాడు. ఎందుకు పిలిచారు అన్నట్టు చూస్తూ మాధవరావు భుజంగరావుకు నమస్కారం చేశాడు. భుజంగరావుది ఆజానుబాహు విగ్రహం. శ్రీమంతత్వం అతని ముఖంలో ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. అతనితో మాట్లాడుతున్న వ్యక్తులు పెద్ద వ్యాపారస్థుల్లా వున్నారు. ఖరీదయిన దుస్తుల్లో యెంతో హుందాగా వున్నారు కాని ఈ రాష్ట్రం తాలూకు వ్యక్తులు మాత్రం కాదని గ్రహించాడు మాధవరావు.

'రావోయ్ రా-వీరు నా బిజినెస్ కొలీగ్స్. బొంబేనించి వచ్చారు. నీ వయోలిన్ వినిపిద్దామని పిలిపించాను. సంగీతం, ముఖ్యంగా వెస్టర్న్ మ్యూజిక్, అంటే ప్రాణం అన్నారు. అందుకే వీళ్ళకిక్కడ డిన్నర్ యేర్పాటుచేసి నిన్ను పిలిపించాను' అన్నాడు భుజంగరావు యెంతో స్నేహపూర్వకంగా.

'అలాగేనండీ' అన్నాడు మాధవరావు యెంతో వినయంగా.

'ఏదో రెండు మూడు ట్యూన్స్ వాయించు చాలు. తరువాత డిన్నర్ తీసుకుని ఇంటికి వెళ్ళిపోదాం.'

'అలాగేనండీ-'

ఎంత తేలికగా చెబుతున్నాడు. ఇక్కడ డిన్నరంటే కనీసం రెండు గంటలయినా పడుతుంది. ఏమయినా తను చేయగలిగింది ఏముంది గనుక. మాధవరావు తన వయోలిన్‌తో ఠీవిగా ఆర్కెస్ట్రా వైపు నడిచాడు. ఇతను సమీపించగానే మ్యూజిక్ డైరెక్టర్ ఆర్కెస్ట్రా ఆపించి అక్కడ వున్న సభికులను వుద్దేశించి గంభీరంగా-

'లేడీస్ ఆండ్ జెంటిల్‌మన్! నౌ వుయ్ ప్రెసెంట్ మిస్టర్ మాధవరావ్ వన్ ఆఫ్ ది మోస్టు మెలోడియస్ వయోలిన్ ప్లేయర్' అని అన్నాడు.

అందరూ కరతాళ ధ్వనులు చేశారు. మాధవరావు నమ్రతగా వారి ముందు వంగి వయోలిన్ తీసుకున్నాడు. అందులో చాలా మంది మాధవరావు సంగీతాభిమానులే. కనుక ఆసక్తిగా కూచున్నారు. మాధవరావుకు మనసు ఎంత కల్లోలంగావున్నా సంగీతం దగ్గరకు వచ్చేసరికి అతనికి ఎనలేని వుత్సాహం వచ్చేస్తుంది. వయోలిన్ తంత్రులమీద అతని వ్రేళ్ళు సున్నితంగా కమానునాజూకుగా లాస్యవిన్యాసం చేయసాగినై. ఆహాలంతా విచిత్ర మధురనాదంతోనిండి శ్రోతలను మంత్ర ముగ్ధుల్ని చేసినట్టుకూర్చో పెట్టింది. భుజంగరావు చెప్పినట్టు అతడుమూడేట్యూన్స్‌వాయించివయోలిన్ ఆపుచేసి అందరికీ నమస్కరించి వయోలిన్ అక్కడ పెట్టేశాడు. శ్రోతల కరతాళ ధ్వనులు ఆగడానికి కాస్సేపు పట్టింది.

భుజంగరావు అతిథులకు డిన్నర్ స్పెషల్‌రూంలో యేర్పాటు చేశారు. తనపని ఇంతటితో అయిపోతే వెళ్ళిపోవాలని మాధవరావుకు. కాని భుజంగరావు అతణ్ణి తనవెంట తీసుకువెళ్ళాడు. 'నిన్ను మరో ముఖ్యమైన వ్యవహారంమీదకూడా పిలిపించాను' అన్నాడు భుజంగరావు అతడ్ని ఏకాంతంగా మరో గదిలోకి తీసుకువెళ్ళి.

'చెప్పండి' అన్నాడు మాధవరావు నమ్రతతో.

భుజంగరావు తన వాలెట్ తెరిచి అందులోంచి రెండు మూడు కవర్లు పైకితీశాడు. 'ఈ బాంబే మిత్రులతో పెద్ద కంట్రాక్టుకు వొప్పందం చేసుకున్నాం. అన్నట్టు పెన్ను తీసుకొచ్చావా? ఇది మినిస్టర్ సంతకంతో వున్న జీ వో.'

మాధవరావు వాటిని పరిశీలనగా చూచాడు. భుజంగరావు యొక్క

అభిప్రాయం అర్థమైంది. అతనిచేతులు సన్నగా వణకసాగినై. ఆ కాగితాలను అక్కడే టేబుల్‌మీదపెట్టి మౌనంగా నిలబడిపోయాడు.

'మాధవరావ్!'

'నన్ను క్షమించండి.'

'ఈసంగతికాదులే. సాయంత్రం నీవు బిర్లా మందిర్‌కు వెళ్ళావు గదూ?'

మాధవరావు వులిక్కి పడ్డాడు. కొన్నిక్షణాలు ఆశ్చర్యపడ్డాడు. కానీ తరువాత గుర్తుకు వచ్చిందతనికి తనూ, మాలతీ కిందిమెట్టు దగ్గర వున్నప్పుడు భుజంగరావు కారు రయ్యమని ఎడమవైపు దూసుకువెళ్ళడం. అతడు గమనించి వుండడనుకున్నాడు. భుజంగరావు కళ్ళు తనమనస్సును ఎక్స్‌రే తీస్తున్నట్టుగా చూస్తూవున్నవి. తను లేదు-కాదు అని వాదన పెట్టుకోవడం దండుగ అనిపించింది.

'అవునండీ.'

'నీతో వున్న అమ్మాయి యెవరూ?'

'ఆమె గోవర్ధనరావు ఐ.పి.యస్.గారి అమ్మాయి.'

'ఆమెతో అంత చనువుగా కబుర్లు చెబుతూ వచ్చేంత స్నేహం ఎప్పటినుండి ఏర్పడింది?'

మాధవరావు నీళ్లు నములుతూనే విషయమంతా చెప్పాడు.

'ఓహో రమణయ్య చెప్పిన క్లయింటా?'

'అవునండీ!'

'ఆయన మరి ఈ విషయం మనతో సంప్రదించడానికి రాలేదే ఇంకా?'

'ఆయన టూర్ మీద వున్నారట.'

'వివరాలు కనుక్కున్నావన్నమాట. ఈ ఆర్డరు మనదాకావస్తే తీసుకుందామంటావా?'

'అది మీ ఇష్టం.'

'చూడు మాధవరావ్! ఆపిల్ల మీదఏదయినాఆశలు పెంచుకున్నావా?'

'.........'

'నీ క్షేమంకోరి చెబుతున్నాను. గోవర్ధనరావు పోలీసాఫీసరు. నీ

విషయం నీకు తెలుసు. నీవల్ల మనకంపెనీ రెప్యుటేషన్‌కు ఏ మాత్రం భంగంరాకూడదు. వొకవంక ఆయన రమణయ్యకు చాలా కావలసిన వాడట. అతనికి నేను మాటఇచ్చాను.'

'.........'

'మాట్లాడవేం?'

'మీరు చెప్పేది వింటున్నాను.'

'ఈ కాగితాలవిషయం అయిదు నిముషాల్లో చూచి డిన్నరుకు రా!' అంటూ భుజంగరావు అవతలికి వెళ్ళిపోయాడు. మాధవరావు కొన్ని నిముషాలు శిలాప్రతిమలా నిలబడి పోయాడు.

# 8

'మీ పేరు వినడమేగాని ఇదే మిమ్మల్ని మొదటిసారి కలుసు కోవడం. ఐ యామ్ వెరీహేపీ' అన్నాడు భుజంగరావు గోవర్ధనరావుతో కరచాలనంచేసి సాదరంగా తన యెదుటవున్న కుర్చీలో ఆసీనుడ్ని చేస్తూ. భుజంగరావు ఆఫీసుగది హుందాతనం వుట్టిపడుతూ ఆయన పెద్దమనిషి తరహాను వేయినోళ్ళచాటి చెబుతోంది. అది ఎయిర్ కండీషన్డ్‌గది అని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. భుజంగరావువయసు యాభైఅయిదేళ్ళకు పైనేవున్నా అంతవయసు వున్నట్టు కనుపించదు. వొడ్డు పొడుగూవున్న విగ్రహం. చామనఛాయ, విశాలమైన కళ్ళు గోల్డుఫ్రేం అద్దాలు అతని ముఖాన్ని మరింత కాంతి వంతం చేస్తున్నాయి. ఖరీదయిన సూట్‌లో ఎదుటివాళ్ళను ఇట్టే ఆకట్టుకునేట్టు వుంటాడు మనిషి.

'ఏవో గొడవలువుంటే తప్ప మాపోటి పోలీసు ఆఫీసర్లతో సాధార ణంగా పరిచయం కలగదుగా మరి' అన్నాడు గోవర్ధనరావు.

'అఫ్‌కోర్స్' అంటూ పెద్దగా నవ్వాడు భుజంగరావు.

'రమణయ్యగారు మీకు వివరాలు చెప్పేఉంటారనుకుంటా!'

'చెప్పారండీ - ఆయనా మీతో వస్తానన్నారే?'

'అతను నాతో రాకపోవడంవల్ల మీకేమయినా ఇబ్బందా?'

'అదేమిటి అలాఅడుగుతున్నారు? బలేవారే!అతనూవుంటే సరదాగా వుంటుందని.'

'ఇన్ని రోజులు నాకోసం పనిపెట్టుకుని వున్నవాడు ఈ రోజు చాలా బిజీగావున్నాట్ట! ఇక మా డ్యూటీలసంగతి తెలిసేవుంటుంది. ఏవేళ ఏస్పాట్‌లో ఉంటామో మాకే తెలియదు. ఇవ్వాళ ఏదో తెరిపి చేసుకుని రాగలిగాను. మీరు మా సైట్‌చూసే ఏర్పాటు చేస్తే తక్కిన వివరాలు తరువాత చెబుతాను.'

'అలాగే. కాని మా మాధవరావే ఈ వర్క్ అండర్‌టేక్ చేయాలని వుందా!'

ఈ ప్రశ్న ఇతడు ఎందుకు వేస్తున్నట్టూ అని కాసేపు ఆలోచనలో పడ్డాడు గోవర్ధనరావు.

'అతడే అవుతే మీకేమయినాఅబ్జెక్షనా?'

'ఎంతయినా మీరు పోలీసువారు. ప్రశ్నకు ప్రశ్నే జవాబుగా ఇస్తున్నారు. మరేంలేదు. మేమో పెద్ద ప్రాజెక్టు అండర్‌టేక్ చేయబోతున్నాం. అతడాపనిలో ఎంగేజ్ కావలసి వుంటుంది' అన్నాడుభుజంగరావు.

గోవర్ధనరావు మళ్ళీ రెండు నిముషాలు ఆలోచించాడు.

'ఐ.సీ. నాకూ మరే అభ్యంతరమూలేదుగాని, రమణయ్య గృహ నిర్మాణంలో అతనిపనితనంచూసే నేనిప్పుడు ఇల్లుకట్టుకోడానికి వుత్సాహ పడుతున్నది. లేకపోతే ఈ ప్రయత్నం ఇప్పట్లో వుండేదికాదు. వొక విధంగా సెంటిమెంటల్ ఫీలింగ్ అనుకోండి. అతడేఅవుతే మాకు తృప్తిగా వుంటుంది.'

'అలాగా...' అన్నాడు భుజంగరావు కాస్త ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టి.

'మీరు అతణ్ణి రిలీవ్ చేయడం కష్టం అనుకుంటే వోపని చేయండి. పానువేసి ఎస్టిమేట్ ఇచ్చేస్తే నిర్మాణం కొంతకాలం ఆగినా ఫరవాలేదు. ఇంచుమించు రమణయ్య ఇంటిడిసైనే. బహుశా వొకగదీ, గారేజీ, అధికం కావొచ్చు.'

భుజంగరావు మళ్ళీ కాస్సేపు ఆలోచించి. 'ఓ.కే. వెళ్ళి సైట్ చూసి వద్దాం. దాని బ్లూ ప్రింట్ తెచ్చారనుకుంటా!'

'రెడీ...'

భుజంగరావు ఇంటర్‌కం నొక్కాడు. 'మాధవరావు పద. గోవర్ధన రావుగారు వచ్చారు. ఆయనతో వెళ్ళి వాళ్ళ సైట్ చూసివద్దాం.

'అలాగేసార్.'

మరో అయిదు నిముషాలకు మాధవరావు వచ్చాడు. తెల్లటి టెరి కాటన్ పాంట్‌మీద తెల్లటి ఫుల్‌హాండ్ షర్టుటక్ చేసుకుని ఎంతో ఆకర్ష ణీయంగా వున్నాడు మాధవరావు. గోవర్ధనరావు అతణ్ణి మెచ్చుకోలుగా చూస్తూ వుండడాన్ని భుజంగరావు శ్రద్ధగా గమనిస్తున్నాడు.

'గుడ్ మార్నింగ్ సర్' అన్నాడు గోవర్ధనరావునిచూసి.

'వెరీగుడ్ మార్నింగ్ టు యూ' అన్నాడు గోవర్ధనరావు.

వెళ్ళడానికి వుద్యుక్తుడై భుజంగరావు లేచేసరికి గోవర్ధనరావూ లేచాడు. వారు ముగ్గురూ మౌనంగానే ఆఫీసు విడిచి ఆవరణలోకి వచ్చారు. గోవర్ధనరావును చూడగానే అతని కారు డ్రైవరు లేచి నిలబడ్డాడు.

'శాంతినగర్ ఇక్కడికి దగ్గరేగా! మా కార్లోనే వెడదాం. మీది ఇక్కడే వుంచండి' అన్నాడు భుజంగరావు.

'అలాగే' అని తన డ్రైవరుతో ఆ సంగతి చెప్పాడు గోవర్ధన రావు. భుజంగరావును చూచి గంగులు కారు తీసుకుని వచ్చాడు వాళ్ళ దగ్గరకు. మాధవరావు గంగులు పక్కన కూర్చున్నాడు. భుజంగరావు, గోవర్ధనరావు వెనక సీట్లో కూర్చున్నారు.

'శాంతినగర్' అన్నాడు గోవర్ధనరావు.

గంగులు కారు స్టార్ట్‌చేసి శాంతినగర్ వైపు పోనిచ్చాడు.

శాంతినగర్ వచ్చింది. తమ సైట్ దగ్గరకు ఎలా వెళ్ళాలో చెప్పాడు గోవర్ధనరావు. రెండు మూడు మలుపులు తిరిగాక వాళ్ళ ప్లాటుని సమీపించారు. ముగ్గురూ కారు దిగి సైట్ దగ్గరకు వచ్చారు. గోవర్ధనరావు తన వాలెట్‌లోంచి సైట్ బ్లూ ప్రింట్ తీసి భుజంగరావు చేతికి అందించాడు. అతడు దాన్ని పరిశీలిస్తున్నట్టు చూసి, మాధవరావుకు ఇచ్చాడు. అతడు దాన్నీ సైటునూ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

'ఐ వాంట్ ఎ కన్వీనియంట్ అండ్ కాంపాక్ట్ హౌస్, విత్ ఎ

గరాజ్. ఇదిగో వంట ఇల్లు, స్టోరు, పూజగది విషయంలో మా ఆవిడ ఇచ్చిన లిస్టు' అన్నాడు గోవర్ధనరావు.

'అలాగేనండీ' అన్నాడు మాధవరావు.

'ప్లానూ, ఎస్టిమేటు ఎప్పుడు ఇవ్వగలరు?' అన్నాడు గోవర్ధనరావు.

'కనీసం వారమయినా పడుతుందండి' అన్నాడు మాధవరావు.

'ఇంతలో అయితే నేనే మీకు ఫోన్ చేసి చెబుతానులెండి' అన్నాడు భుజంగరావు.

'అలాగే! లెటస్ హోప్ ఫర్ది బెస్ట్' అన్నాడు గోవర్ధనరావు.

ముగ్గురూ వచ్చి కార్లో కూర్చున్నారు. గంగులు కారు స్టార్ట్ చేశాడు.

'నిర్మాణానికి మీ టర్మ్స్, కండిషన్స్ చెప్పగలరా?' అడిగాడు గోవర్ధనరావు.

'అవన్నీ ఎస్టిమేట్స్‌లోనే వుంటాయి లెండి!'

'ఐ సీ...'

కొన్ని నిముషాల తరువాత కారు భుజంగరావు ఆఫీసు ఆవరణలోకి వచ్చి ఆగింది. గోవర్ధనరావు తన డ్రైయివరుకు సౌంజ్ఞచేస్తే అతడు కారు తీసుకుని వచ్చాడు. 'మళ్ళీ వీలయినంత త్వరలో కలుసుకుందాం. వస్తాను' అంటూ గోవర్ధనరావు భుజంగరావుతో కరచాలనం చేసి తన కారులో కూర్చున్నాడు.

గోవర్ధనరావు యొక్క కారు వెళ్ళిపోయేదాకా చూసి భుజంగరావు ఆఫీసులో ప్రవేశించాడు. మాధవరావు అతణ్ణి అనుసరించే వున్నాడు.

'ఆర్డరు చేతికి వచ్చింది. ఇప్పుడు నీకు సంతోషమేనా' అన్నాడు భుజంగరావు తన సీట్లో కూచుంటూ మాధవరావుతో.

'ఇందులో నాకు కలిగే సంతోషం యేమీలేదు. నేనీపని చేయబోవడంలేదు.'

'ఒకసారి అవుననడం—వొకసారి కాదనడం అంతా నీ యిష్టమేనా? ఈ మాట అతని ముందే చెప్పవలసింది.'

'ఆయన ముందు చెప్పడం బాగుండదని వూరుకున్నాను. ఈ పర్క్ మరెవరికయినా ఎంట్రస్ట్ చేయండి.'

భుజంగరావు అతణ్ణి తీవ్రంగా చూశాడు.

'నీ నిర్ణయం మార్చుకోవడానికి కారణం?'

'ఈ విషయంలో నేను ఏ నిర్ణయమూ తీసుకోలేదు. మీరే యేదో వూహించుకుంటున్నారు. మీ అనుమానం మరీ దూరంగా వెళ్ళడం నాకు ఇష్టంలేదు.'

'నీ చిత్తశుద్ధికి నా జోహార్లు. పని మొదలుపెట్టి రెండు మూడు రోజుల్లో ఎస్టిమేట్స్ తయారు చెయ్యి.'

'వారికి రమణయ్య ఎస్టిమేట్స్‌కి దగ్గరగా కావాలట!'

'నువ్వు ముందు పని ప్రారంభించు. తరువాత చూద్దాం ఆ విషయం.'

'నాకు కొన్నాళ్ళు శెలవు కావాలి.'

'ఎందుకూ?'

'వూరికి వెళ్లాలి.'

'మీ వాళ్ళను వెదకడానికా? మీ వాళ్ళు ఇంకా ఆ వూళ్ళోనే వుంటే ప్రతిసారీ వెళ్ళి వెదకడం ఎందుకూ? నీ ప్రయత్నమేమిటో నాకు తెలుసు. ఈ సాకుతో శెలవుపెట్టి వెళ్ళడం, వేరే చోట్ల వుద్యోగ ప్రయత్నం చేయడం, అది దొరక్క నీలోనే నీవు కుములడం. మాధవరావ్! ఎందుకొచ్చిన తిప్పలు చెప్పు. ఇక్కడ నీకేం తక్కువ జరుగుతున్నదనీ? నువ్వంటే నాకెంతో అభిమానం. అందుకనే నువ్వు ఎన్ని తిక్క పనులు చేసినా తిక్కగా మాట్లాడినా సహించుకుపోతున్నాను. నీ చేతిలో బోల్డు విద్యలున్నాయి. ఇప్పుడు చేస్తున్న ఈ ఆర్కిటెక్ట్ పని ఇష్టం లేకపోతే చెప్పు. నీకు సంగీతం వొచ్చు, చిత్రలేఖనం వొచ్చు. వొక మ్యూజిక్ స్కూలో, ఆర్ట్ స్కూలో నీ కోసం యేర్పాటు చేస్తాను.'

'మీ ఔదార్యానికి చాలా కృతజ్ఞుణ్ణి. కాని నేను మా వాళ్ళ కోసమే వెళుతున్నాను.'

'అందుకోసం పనికట్టుకు వెళ్ళాలటోయ్. పేపర్‌లో వేయించు. నేను ఫలానావాణ్ణి ఫలానాచోట వున్నాను అని. మీ వాళ్ళు రెక్కలు కట్టుకువచ్చి వాల్తారు.'

'ఆ పని చేయగలిగితే యేనాడో చేసేవాణ్ణి.'

'త్యాగయ్య యేమన్నాడో తెలుసా-చక్కని రాజమార్గముండగా సందుల దూరనేలనే వో మనసా...'

'మీ సలహాకు చాలా సంతోషం. నాకు సెలవు మంజూరు చేయించండి.'

'ముందు తమరిపని పూర్తిచేయండి-మీ వాళ్ళకోసం ఇన్నాళ్ళూ లేని తొందర ఇప్పుడు వచ్చిందా?'

మాధవరావు నిరుత్తరుడై నిలబడిపోయాడు. టెలిఫోన్ మోగింది. భుజంగరావు రిసీవర్ అందుకున్నాడు. అవతలనుండి రమణయ్య మాట్లాడుతున్నాడు.

'హల్లో రమణయ్యా! చాలా హడావుడిగా వున్నావా యేమిటి? గోవర్ధనరావు వచ్చి వెళ్ళాడు. ఇందాకే సైటు చూసి వచ్చాం. ఆఁ ఆయన డ్యూటీకి వెళ్ళిపోయాడు. ఆఁ అతణ్ణి వెంట తీసుకెళ్ళాం. మరేం కంగారు పడకు. వారంలో ఎస్టిమేట్స్ పంపుతాను. ఓ...కే... వుంటా.' భుజంగరావు టెలిఫోన్ పెట్టేశాడు. మాధవరావు అక్కడే నిలబడి వున్నాడు.

'చూడు మాధవరావ్-పెద్దవాణ్ణి చెబుతున్నాను. నీమీద పగ, ద్వేషం యేవీ లేవునాకు. ఇది పోలీసువాళ్ళతో వ్యవహారం. అందుకని నిన్ను జాగ్రత్తగా మసలుకోమని హెచ్చరిస్తున్నాను. అంతే. మరీ ప్రతి దానికీఅంతగా ఆవేశపడకు. వెళ్ళి ప్రశాంతంగా పని చూసుకో!' అన్నాడు.

మాధవరావుకు కోపం, ఉక్రోషం పొంగిరాగా దాన్ని అణచుకుంటూ తన సీటు దగ్గరకు వచ్చాడు.

# 9

హృదయరాగం జీవనరాగమై వయొలిన్ తంత్రులమీద అపూర్వ గతులతో సాగుతున్నది. అంగుళీవిన్యాసం అప్సరో లాస్య విన్యాసంలా ఆశ్చర్యం కొలుపుతున్నది. మాధవరావు దాదాపు మైమరచిన స్థితిలోనే వయొలిన్ సాధన చేస్తున్నాడు. ఆ పాట మధురంగా సాగుతున్న సింధుభైరవి రాగం తారాస్థాయికి వెళ్ళి క్రమంగా అవరోహణనందుకొంటున్నది. ఉత్సాహంతో మెట్లు దిగివస్తున్న కన్నెపిల్ల యెవరినో చూసి సిగ్గుపడి

ఆగిపోయినట్టు చటుక్కున ఆగిపోయింది, మాధవరావు తన యెదుట నిలబడి వున్న మాలతిని చూచిన క్షణంలో.

'హియర్, హియర్' అంటూ చప్పట్లు కొట్టింది మాలతి.

మాధవరావు సిగ్గుతో తలవంచుకున్నాడు.

'రాగం పూర్తి అయిందా లేక నన్నుచూసి ఆగిందా?' అని అడిగింది మాలతి.

'ఇంచుమించు వొక్కసారే రెండూ జరిగినట్టు' అన్నాడు మాధవరావు నవ్వుతూ.

'ఇంకో రాగం వాయించండి. ప్లీజ్!'

ఆమె కన్నులలో సంగీతంపట్ల ఆరాధనా, తనపట్ల అభ్యర్థనా గోచరించాయి మాధవరావుకు. కాదనలేకపోయాడు. 'ఏం రాగం వాయించమంటారు?'

'మీరు ఏరాగమైనా చక్కగానే వాయించగలరు. మీకు తోచింది వాయించండి.'

'నిలబడేవున్నారు. అలా కూర్చోండి.'

మాలతి సోఫామీద కూర్చుంది. మాధవరావు రాగం అందుకోలేదు. కాస్త ఆలోచిస్తున్నట్టు ముఖంపెట్టి 'మీకుసంగీతం బాగావచ్చుననుకుంటా' అన్నాడు.

'సంగీతం అంటూ పెద్ద పేరు అనకండి. హైస్కూల్ రోజుల్లో కొన్ని కీర్తనలు నేర్చుకున్నాను. స్వరజ్ఞానం కొద్దిగా వున్నది అంతే.'

'పోనీ మీరేదయినా పాడండి. నేను వాయిస్తాను.'

'నో!నో! ప్లీజ్. మీరే వాయించండి. నాకు వినాలని చాలాఆసక్తిగా వుంది.'

'నాకూ మీ పాట వినాలని ఆసక్తిగా వుంది.'

'ప్లీజ్ మాధవరావుగారూ. నన్ను మాత్రం బలవంత పెట్టకండి. ఇది మీ గది. నేను పాడుతే దాని పర్యవసానం మరొక విధంగా వుండవచ్చు. నేను మీ శ్రోతగానే ఉంటాను.'

ఈ మాటతో మాధవరావు వులిక్కిపడ్డాడు. మాలతి చెప్పిన మాట నిజమే. అతని ముఖం జేవురించింది.

తనున్న ఇరకాటమైన పరిస్థితి అప్పుడుగాని గుర్తుకు రాలేదతనికి. నొసట చిరు చెమటకూడా ప్రారంభమైంది. గుండె లయతప్పి కొట్టుకొం టోంది. మాలతికి అతని ఆందోళన అర్థంకాలేదు.

'మాధవరావుగారూ ప్లీజ్ మోహనరాగం నాకు చాలా ఇష్టం. వాయించండి. నను పాలింప నడిచివచ్చితివా నాప్రాణ నాథా' అంటూ సన్నగా పల్లవిని అందించింది. మాధవరావులేని ధైర్యమూ, వుత్సాహమూ తెచ్చుకున్నాడు. వయొలిన్ మోహనరాగం అందుకుంది. అత్యంత మనో హరంగా ఆలాపన సాగించిన తర్వాత, కీర్తన మొదలుపెట్టాడు. మాలతి అతని ముఖాన్ని నిర్నిమేషంగా చూస్తూవుంది. ఎంతటి పారవశ్యం!

ద్వారం, చౌడయ్య మొదలయిన వయొలిన్ విద్వాంసుల రికార్డులు తాను యెన్నోసార్లు విన్నది. ఆవాదనలో వారిఅపురూపశిల్పం ఇతనిలోనూ గోచరించిందామెకు. ఇతని రాగకౌశలంతో తన గళం శృతికలపగలదా? మాధవరావు ఆ కీర్తన పూర్తిచేశాడుగాని వయొలిన్ వాయించడంమాత్రం ఆపలేదు. ఈ సారి వొక పాశ్చాత్య బాణీఅందుకుని శిలలు కరిగిపోయేంత ఇంపుగా వాయించాడు. కాలగమనమే స్తంభించినట్టయింది. వయొలిన్ వాదన ఆగింది. దాంతో మధురాతిమధురమూ అయిన శబ్దమూ ఆగింది. గదిఅంతా వింత అయిన నిశ్శబ్దం ఆవరించింది.

మాలతి మనసు ఇంకా నీలిమేఘాలమీద తేలిపోతున్నది. కాని ఆమె ఆభావనాలోకంనించి హఠాత్తుగా మేలుకుంది. చకితురాలూ అయింది. మాధవరావు వొక సోఫామీద కూర్చుని రెండు చేతులనూ ముఖానికి కప్పుకుని పసిపిల్లవానిలా వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. మాలతికి యేమీ అర్థం కాలేదు. ఆమె మనసు ఆర్ద్రమైపోయింది. అతని తల నిమిరి అను నయించాలన్న ఆలొచనవచ్చి లేచి అతణ్ణి సమీపించింది.కానిఇంతలో మరో ఆలోచన. అతని హృదయంలో యెంతటి విషాదం గూడుకట్టుకొని వున్నదో! దాన్ని వెళ్ళబోసి చెప్పుకోడానికి ఆత్మీయులయిన వారు ఎవరూ లేకే అది మనసులో నిలచిపోయి వుంటుంది. తనను చూడగానే అతని మనసులో దుఃఖం కట్టతెంచుకుని వుంటుంది. అతడు కాసేపు అలా ఏడవ

డమే మంచిదేమో! అతని మనసు తేలికపడవచ్చు. కొన్ని నిముషాల తర్వాత అతని ఏడుపు సన్నబడింది.

మాలతి తన నునుపైన వేళ్ళను అతని క్రాఫింగులోకి పోనిచ్చి మెల్లగా నిమురసాగింది. మాధవరావు ముఖంమీదనుండి చేతులు తీయకుండానే, 'మాలతీ నా గదికి యెందుకువచ్చావు' అన్నాడు.

"నీగదిలోకేకాదు మాధవరావూ. నీజీవితంలోకే రావాలని నామనసు తపనపడిపోతున్నది" అని చెప్పాలనుకున్నది మాలతి. కాని సాహసించలేక పోయింది. 'మాధవరావుగారూ అతిథిని అనవలసినమాటేనాఇది' అన్నది.

'మీకు ఆతిథ్యం ఇచ్చే అర్హత నాకు లేదు.'

'మీకున్న అర్హతలేమిటో నాకు తెలుసు. ఇటు చూడండి.'

అతడు ముఖంమీద చేతులుతీసి మాలతివంక చూశాడు. అతని కళ్ళు రక్త పద్మదళాల్లా వున్నవి. అప్రయత్నంగా మాలతి తన పమిట కొంగుతో అతని కన్నీళ్ళు వొత్తింది. మాధవరావు ఆమెకేసి వింతగా చూశాడు.

'మీరు ఇంత దుఃఖాన్ని ప్రదర్శించడం నేను వచ్చినందుకేనా?'

మాధవరావు కాస్త సిగ్గుపడ్డట్టు తల వంచుకున్నాడు. 'క్షమించండి మాలతిగారూ. మీముందు అసభ్యంగా ప్రవర్తించాను. కాని కాని-'

'చెప్పండి.'

'ఎందుకో నాకలా దుఃఖం వచ్చేసింది.'

'దుఃఖం అనేది ఎందుకోరాదు మాధవరావుగారూ. మిమ్మల్ని మొదటిరోజు చూసిననాడే నాకనిపించింది-'

'ఏమని?'

'ఏమంత్రగాడి దుష్టశక్తులకో వశమై నిస్సహాయస్థితిలోవున్న వొక పరాక్రమవంతుడైన రాజకుమారునిలా వున్నారని.'

'———'

'అవునా?'

'నేనేమీ చెప్పలేను. మీ వూహాను నన్ను సర్దిపై చెయ్యమంటారా?'

మాలతి అందంగా నవ్వింది. 'పోనివ్వండి. ఎదుటి మనిషిలో యేదో

ఆత్మీయత గోచరిస్తేగాని మనసులో దుఃఖం యిలాపొంగిరాదు. ఇదయినా అంగీకరిస్తారా?'

ఈసారి మాధవరావు చిన్నగా నవ్వాడు. మాలతి అదిచూచి తనూ నవ్వింది. 'మీ నవ్వు నాప్రశ్నకు సమాధానమా' అంది. మాధవరావు తల అడ్డంగా తిప్పాడు.

'మరి?'

'ఈసారీ మీరు పొరబడ్డారు. నిలదొక్కుకోలేని ఆవేశంతో రాగాలు వాయించాక నాకిలా దుఃఖం పొంగి వస్తుంటుంది.'

మాలతి కిలకిలమని నవ్వింది.

'మీరెందుకు నవ్వుతున్నారు?'

'కొబ్బరిచెట్టు ఎందుకెక్కావంటే దూడ గడ్డికోసం అన్నాట్టఎవడో! మీరు కప్పదాట్లు వెయ్యకండి. మీమనసులోవున్న బాధ యేమిటో నాతో చెప్పకోకూడదా?'

'నా విషయంలో మీరేదో అనవసరంగా వూహించుకుంటున్నారు. ఉండండి కాఫీ ఇస్తాను' అని లేవబోయాడు మాధవరావు.

'మీ మాటవినే అర్హత లేనప్పుడు మీ ఆతిథ్యం స్వీకరించే అర్హత కూడా నాకు లేదనుకుంటాను' అన్నది మాలతి.

దెబ్బ తిన్నట్టు ఆమె వంక చూశాడు మాధవరావు. 'నామీద కోపం వచ్చిందా? చెప్పానుగా. మీరు అనవసరంగా వూహించుకొని యేదో బాధ పడుతున్నారని!'

'పోనీ ఈ వొక్క విషయం చెప్పండి. ప్రస్తుతం మీరువొంటరివాణ్ణి అన్నారు. దీనికి భావమేమిటి? అవతల మరొక స్త్రీ వున్నదా? లేక మీరు భగ్న ప్రేమికులా?'

మాధవరావు కాస్త పెద్దగానే నవ్వాడు. 'మాలతిగారూ! మీరు చాలా చాలా వూహించుకుంటున్నారు. మీరు కాలేజీకి వెడుతూ ఇక్కడికి వచ్చారనుకుంటాను.'

మాలతి చిన్న బుచ్చుకుంది అతని ధోరణికి. 'అవును. కాని నాదంతా వూహేనంటారా? అవుతే ఈ సంగతన్నా చెప్పండి. ఆ నావలో స్త్రీ యెవరు? అది నిజంగా వూహాచిత్రమేనా?'

ఈ మాటతో మాధవరావు వదనం గంభీరంగా మారిపోయింది. 'ఈ చిత్రం ఇప్పట్లో పూర్తికాదు' అన్నాడు.

మాలతికి మనస్సు చివుక్కుమంది. 'సరే ఇంక మీ విషయాలు అడగనులెండి' అన్నది. ఇలా అంటున్నప్పుడు మాలతికంఠంలో సన్నజీర వినిపించింది మాధవరావుకు. ఆమె కళ్ళలోకి చూడలేనట్టు తనరెప్పలను వాల్చుకున్నాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచినై. మాధవరావు మనసును కాస్త కుదుట పర్చుకోగలిగాడు ప్రయత్నం మీద.

'చెప్పండి మీరు వచ్చిన పని మీయింటి ప్లాను విషయంగానేనా?'

మాధవరావును రెప్పవాల్చకుండా కొన్ని నిముషాలు చూచింది. సోయగాల్ని వొలక బోస్తున్న రెప్పల మాటున దీప్తిమంతంగా వున్న నయనాలు అయస్కాంతంలా ఆమె హృదయాన్ని లాగుతున్నవి. తన మనసు పూర్తిగా అతనికి వశమైపోయివున్నదని ఆమె తెలుసుకున్నది. దాన్ని అతనికి వెల్లడి చేయడానికి ఆమె నిశ్చయించుకున్నది. తనప్రేమ ఫలించేది లేనిదీ తల్లి చెప్పిన 'ప్రాప్తం' అన్న దైవిక శక్తికే వదిలిపెట్ట దలచింది.

'మాధవరావుగారూ! మీ మనసులో మాట చెప్పకపోయినా, నా మనసును మీ ముందుంచుతున్నాను. మీ యిల్లు అనడం కంటే మీరు మన యిల్లు అని అనండి. ఆ భావనతో మన ఇంటికి రూపురేఖలు దిద్దండి. అది అర్థించడానికే వచ్చాను మీ దగ్గరకు' అన్నది గంభీరంగా.

మాధవరావు చకితుడై ఆమె వంక చూడసాగాడు.

'ఆశ్చర్యపడకండిమాధవరావుగారూ! మీరువయోలిన్‌మీద మాత్రమే కాదు. నా హృదయవీణమీద కూడా మోహన రాగాన్ని పలికించారు.'

ఆమె మాటలతో మాధవరావుకు తనువంతా పులకించినా తన పరిధి గుర్తుకు వచ్చి వణుకు ప్రారంభమయింది.మాలతిని మందలించక తప్పదను కున్నాడు.

'మాలతిగారూ! మనిద్దరిక్షేమం కోరి చెబుతున్నాను. మీరు—మీరు' అంతకంటే చెప్పడానికి అతని నోట మాట పెగలలేదు.

'ఏమిటి మీ రనబోతున్నది?'

'మీరు మా కంపెనీ కష్టమర్సు. నేను— నేను అందులోపనివాణ్ణి' అని అనబోయాడు గాని అనలేకపోయాడు.

'అందుకనే ఆ ప్లాను విషయం చెప్పడానికి వచ్చాను. నేను చెప్పినట్టు మీరు వూహించి ఇల్లు కట్టించండి. ఇంక వస్తాను. నాకు కాలేజీకిటైం అయింది.'

ఆమె దృఢ సంకల్పాన్ని సడలించలేననిపించి మాధవరావు మిన్నకుండిపోయాడు కొన్ని క్షణాలు.

'వుండండి. నాకూ ఆఫీసుకు వెళ్ళే టైమ్ అయింది. అయిదు నిముషాల్లో తయారయి వస్తాను' అని లోపలకు వెళ్ళిపోయాడు.

మాలతి సోఫామీదే కూర్చుంది. ఆమె మనసంతా అస్తవ్యస్తంగా వున్నది. వొక వంక అతని విషయాలు తెలుసుకోవాలన్న ఆరాటం. మరొక వంక అతని మనసు నొప్పిస్తున్నానన్న ఆవేదన. మాధవరావు మాత్రం ఏ విధంగానూ బయడపడలేదు గానీ తన మనసును బయటపెట్టకుండా వుండలేకపోయింది. అతనిపట్ల తన ఆరాధన యథార్థమే అయితే ఆ దేవతలే తథాస్తు అని దీవించాలి అనుకుంది.

ఇంతలో మాధవరావు తయారై వచ్చాడు.

'ఏదో మాటల్లో పెట్టి మీకు కాఫీ అయినా యివ్వలేదు' అన్నాడు నొచ్చుకుంటూ.

మాలతి లేచి నిలబడి చిరునవ్వు నవ్వింది. 'సంగీతామృతం తాగించారు. అంతకంటేనా!'

ఇద్దరూ బయటకు నడిచే వుద్దేశంతో రెండడుగులు ముందుకు వేశారో లేదో ఎవరో లోపలికి వస్తున్నట్లు ధ్వని విని ఆగారు. కొన్ని క్షణాలలో లోపలికి ప్రవేశించిన ఆ ఇద్దరు వ్యక్తులను చూచి మాధవరావు కొయ్యబారిపోయాడు. భుజంగరావు- అతని వెనుక గంగులు. మాలతికి వారెవరో తెలియక మౌనంగా చూస్తూ నిలబడింది. వారి కంగారును గమనించిన భుజంగరావు అన్నాడు, 'ఏమోయ్ మాధవరావ్ ఆఫీసుకేనా—'

'అవునండీ!'

'ఈ అమ్మాయ్' అని ఆగాడు భుజంగరావు.

మాధవరావు కాస్త ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

'ఈమె మాలతి. గోవర్ధనరావుగారి అమ్మాయి. ఈయన మా బాస్ భుజంగరావుగారు' అని ఇద్దరికీ పరిచయం చేశాడు.

'నమస్కారమండీ!' అన్నది మాలతి వినయంగా.

'నమస్కారమమ్మా! నిన్ననే మీ నాన్నగారు సైటు చూపించి ప్లాను విషయం చెప్పారు.'

'అవునండి! నేను ఆ ప్లాను విషయంలో కొన్ని వివరాలు చెప్పి పోదామని వచ్చాను.'

భుజంగరావు ఆమెను పరిశీలనగా చూచాడు. మాలతి ముఖంలో ఎలాంటి తొట్రుబాటూ లేదు. కాని మాధవరావే...

'అలాగా, ఆ వివరాలేవో చెప్పావా అమ్మా?'

'చెప్పానండీ.'

'మా మాధవరావు విషయంలో మీరు నిశ్చింతగా వుండొచ్చు. అయినా ఈవిషయం మీ నాన్నగారు నాకు ఫోన్ చేసిచెప్పి వుండచ్చుగా!'

అది విన్న మాలతికి మనసు చివుక్కు మన్నది. అతనికి జవాబు ఏం చెప్పాలో తోచడం లేదు. తను మొదటిసారి ఇక్కడికి వచ్చినప్పుడు మాధవరావు సంకోచపడుతూ చెప్పిన కంపెనీ నిబంధనలు గుర్తుకు వచ్చినవి. నేరుగా యెవరూ అతనితో యే విషయమూ సంప్రదించడానికి వీలు లేదు. కాని, కాని, తను వచ్చిన పనివేరు. భుజంగరావుకు యేదో చెప్పాలని ధైర్యం తెచ్చుకుని-

'నేను నేరుగా వచ్చి చెప్పడం తప్పయితే క్షమించండి. ఈ సారి యేదయినా చెప్పవలసి వుంటే మా నాన్నగారే స్వయంగానో, ఫోనులోనో మీతోనే చెబుతారు' అంది.

చురక తగిలినట్టయింది భుజంగరావుకు ఆ జవాబు. 'అబ్బే అదేం కాదమ్మా. నీవు అనవసరంగా శ్రమతీసుకోవడమెందుకని అలా అన్నాను. ఇంతకీ నేను రమణయ్యగారితో పనుండి వాళ్ళింటికి వెళ్ళుతున్నాను. దారేకదా మాధవరావుని పికప్ చేసుకు వెడదామని ఇక్కడికి వచ్చాను. మాధవ్‌రావ్ నీవు రెడియేనా?'

'రెడీయేనండీ.'

'పద! నీవు కాలేజీకా అమ్మాయ్! అయితే పద. నిన్నూ కాలేజీ దగ్గర డ్రాప్ చేస్తాను' అన్నాడు భుజంగరావు.

'అక్కరలేదండి. నేను-'

'మరేం ఫరవాలేదమ్మా. పద-'

అంతా కిందకు వచ్చి కార్లో కూర్చున్నారు.

'ముందు ఈమెను కాలేజీ దగ్గర డ్రాప్‌చేసి మనం ఆఫీసుకు వెడదాం!' అన్నాడు భుజంగరావు గంగులుతో. కారు భుజంగరావు యొక్క ఆదేశానుసారం వెడుతున్నది. మాధవరావు మనసుమాత్రం సుడిగుండంలో చిక్కుకుపోయినట్లు విలవిలలాడుతున్నది.

# 10

'మీరు నా గదికి రావలసిన అవసరం ఏం వచ్చింది?' కాస్త తీవ్ర స్థాయిలోనే అడిగాడు మాధవరావు.

అంతకు రెట్టించిన స్వరంతో గర్జించాడు భుజంగరావు. 'నువ్వు వెధవపని చేస్తూ నన్ను సంజాయిషీ అడుగుతున్నావా' అంటూ.

'మీ అభిప్రాయం నిజం కాదు. అనుమానం మాత్రమే.'

'ఓహో! ఆ అమ్మాయి నీ గదికి రావడం నీవు నీ వయొలిన్‌ప్రావీణ్యాన్ని ప్రదర్శించటం ఆమె తన్మయత్వంతో అంతసేపు నీ గదిలోనే వుండటం- అన్నీ కూడా అనుమానమేనంటావా?'

అంతా చాటు నుండి గమనించాడా? స్కౌండ్రల్, రాస్కెల్ అనుకున్నాడు మాధవరావు. అతని గుండె భగభగమనిమండుతున్నది. భుజంగరావుమీద కురికి అతని పీక నొక్కి పారెయ్యాలన్నంత ఆవేశం వస్తున్నది. కాని,

'మీరు, మీరు' అంతకంటే యేమీ అనలేక నీరు నములుతున్నాడు.

'అలా కంగారు పడకు. నేనేమీ నేరుగా చూడలేదులే. నేనసలు రమణయ్యతో పనుండే వచ్చాను. తిరిగి వెడుతూ వుంటే ఆ అమ్మాయి నీ గదిలోకి వెడుతూ కనిపించింది. మొదట ఆమె యెవరో నాకు తెలియక పోయినా అంత చొరవగా నీగదిలోకి వెడుతూ వుంటే బహుశాగోవర్ధనరావు కూతురే అయి వుంటుందని కారు ఆపు చేశాను. అప్పుడే పైకి వద్దామనుకున్నానుగానీ ఇంతలో నీ వయొలిన్ వినిపించింది. సరేలే మీతన్మయత్వా

నికి భంగం కలిగించడం యెందుకని కార్లోనే చాలా సేపు కూర్చొని తరువాత పైకి వచ్చాను. ఇంకా బుకాయిస్తావా నన్ను?'

'నాకు బుకాయించవలసిన అవసరం లేదు. జరిగింది మాత్రం మీరు వూహించుకున్నది కాదు.'

'మరేమిటి లేకపోతే?'

'ఈ రాత్రి క్లబ్బులో నా ప్రోగ్రాం వుంది. అందుకు ప్రాక్టీసు చేసుకుంటున్నాను. ఇంతలో ఆ అమ్మాయి వచ్చింది నేను వాయించటం ఆపుచేయబోతే ఆమె నన్ను వారించి మరో కీర్తన కూడా వాయించమని కోరింది. వాయించాను. తరువాత యింటి విషయం చెప్పింది.'

'ఓహో! ఇంతకు మించి యేమీ జరగలేదన్నమాట!'

'మీరు నమ్మకపోతే నేనేం చేయను?'

'ఆ అమ్మాయి నీ రంగూ హంగూ చూసి ఆకర్షితురాలయి వుండవచ్చు, కాని నీ అంతరంగం రంగు బయటపడితే ఏమౌతుందో తెలుసా?'

'ఏమౌతుంది?' నిర్లక్ష్యంగా అన్నాడు మాధవరావు.

'ఆవిషయమూ నీకుతెలుసు. గోవర్ధనరావు ఎటువంటి పోలీసు ఆఫీసరో ఆ విషయం నీవు గ్రహించడం మంచిది.'

'ఆయన విషయంలో నాకంటే మీకేఎక్కువ భయంవున్నట్టువుంది.'

'నోర్మూయ్. నాతో పరిహాసాలాడుతున్నావా? గోవర్ధనరావుకుగాని ఆయన తాతకుగాని భయపడ వలసిన ఖర్మ నాకేం పట్టలేదు. నా ఆందోళనంత మనకంపెనీ ప్రెస్టేజ్ గురించి. మీ వ్యవహారం ఆయన కంటబడితే మన కంపెనీ రెప్యుటేషన్ గంగలో కలుస్తుందంటావా లేదా?' ఉగ్రుడైపోయాడు భుజంగరావు.

'అపుతే నన్నేం చేయమంటారు? ఈపని మరెవరి చేతనైనాచేయించుకోండి అని ఆనాడే చెప్పాను.'

'చెప్పావు. కాని గోవర్ధనరావు నీమీద ఏదో సెంటిసెంటు వొలకబోస్తే, నిన్ను పట్టుకుపాకులాడవలసివచ్చింది. నీవది అలుసుగా తీసుకొని నీ ఇష్టం వచ్చినట్టు చిందులేస్తున్నావు.'

'ఇప్పటికయినా మించి పోయిందిలేదు. ప్లాను పని ఇంకా ప్రారం

భంకాలేదుగదా. మీఇష్టంవచ్చిన వాళ్ళచేత వేయించండి. నాకే అభ్యంత రమూలేదు.'

'ఆ పనేచేస్తాను. కాని ప్లాను మాత్రం నీపేరు మీదే వుంటుంది.'

'నేనక్కరలేనప్పుడు ఈ పితలాటం మాత్రం ఎందుకు?'

'నీతెలివితక్కువ గొడవ గోవర్ధనరావుకి తెలియకుండా వుండగలందుకు. మంచి కస్టమర్సును పోగొట్టుకునేంత తెలివితక్కువవాణ్ని కానునేను.'

'కాని నిజం పసిగట్టగల శక్తి పోలీసు వారికుంది.'

'ఆ సంగతి నేను చూసుకుంటాను. నువ్వు చేయవలసిందల్లా' అని వొక్కక్షణం ఆగాడు భుజంగరావు.

'ఏమిటి?'

'నువ్వా అమ్మాయికి దూరంగా మసలు కోడం.'

'ఆమె వెంటబడే వుద్దేశం నాకు లేదనిచెప్పాను.'

'ఆమెకు నీమీదవున్న భ్రమనుకూడా మొగ్గల్లోనే తుంచివేయడం మంచిది.'

'అందుకు నేనేం చేయాలి?'

'నీమీద ఆశ పెంచుకోవద్దని ఆమెకు స్పష్టంగా చెప్పాలి. నేరుగా చెప్పలేకపోతే ఉత్తరం రాయాలి?'

మాధవరావు మాట్లాడలేదు.

'మాట్లాడవేం?' భుజంగరావు గర్జించినట్టుగాఅన్నాడు.

'ఆ ఉత్తరం పొరపాటున గోవర్ధనరావు చేతిలోపడితే దాని పర్యవసానం ఆలోచించారా?'

'పడదు. ఆ ఉత్తరం నేరుగా మాలతి చేతికే అందివ్వబడుతుంది.'

'గంగులు ద్వారానేనా...'

'అవును—'

'మీకు ముందుగానే స్పష్టంగా చెబుతున్నాను. నన్ను ఇరకాటంలో పెట్టే వుద్దేశంతో ఆ అమ్మాయికి ఏ విధమైన హానిజరిగినా తరువాత నేను మనిషిని కాను.'

'అంటే నీ వుద్దేశం?'

'గంగులు చేత బ్లాక్ మెయిల్ చేయించడం వగయిరా.'

'ఏమిటి? గంగులు బ్లాక్ మెయిల్ చేస్తాడా? నాకా విషయం తెలీదే? వుండు కనుక్కుంటాను.'

'అక్కర్లేదు. వాడి విషయం నాకు తెలుసు. ఆ అమ్మాయి విషయంలో వాణ్ణి హెచ్చరించండిచాలు. నేనిప్పుడే ఉత్తరం రాసి ఇస్తాను.'

'ఇదిగో కాగితం. ఇక్కడే కూర్చుని రాయి.'

మాధవరావు పెన్ను తీసుకుని ఉత్తరం రాయడానికి వుపక్రమించాడు. అతని మనసుతోపాటు చెయ్యికూడా సన్నగా వణకనారంభించింది. మాధవరావుకు తెలుసు తాను అద్దంమీదకు గురిచూసిరాయిని విసురుతున్నాడని. కాని ఆ పని చేయడంతప్పదు. తన మనసును ఆమె ఎంత బలంగా ఆకర్షించినా తానున్న పరిస్థితిలో ఆమె తనమీద ఆశలు పెంచుకోవడం యేమాత్రమూ తగదు. కాని ఆమె మనసును శాసించే అధికారం తనకున్నదా?

'ఇది మన ఇల్లు అనుకో మాధవరావు.'

'మీరు వయోలిన్‌మీద మాత్రమే కాదు. నాహృదయవీణ మీదకూడా మోహనరాగాన్ని పలికించారు.'

మాలతి మాటలు గుర్తుకువచ్చి అతని మనసు కల్లోల సాగరమౌతున్నది. కన్నుల్లోకి రాబోయిన అశ్రువులను బలవంతంగా అణుచుకుంటున్నాడు. కాని అతని అంతరాత్మ అంటూనేవున్నది. నీవామెకుతగవు, తగవు. ఈనాడు కాకపోయినా కొన్నాళ్ళకైనా ఆమెహృదయ దర్పణాన్ని యదార్థమనే రాయితో బద్దలు కొట్టక తప్పదు అని. నిజమే ఇక జరగబోయే అన్నివిషయాల్లోనూ తను నిర్లిప్తత పెంచుకోడమే మంచిది. యాంత్రికంగా పనులు చేసుకుపోవాలి అంతే. మాధవరావు ఆలోచిస్తూనే ఉత్తరం రాయడానికి మొదలు పెట్టాడు.

మాలతిగారూ,

ఈ ఉత్తరం మీకు ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు. కాని దీన్ని మీకు రాయడం తప్పడంలేదు నాకు. మీ మనస్సు ఎంత నిర్మలమైందయినా కావొచ్చు. కాని మీరు వొంటరిగా వొకవొంటరిగాని గదికి రావడం తగదు అని చెప్పడానికి చింతిస్తున్నాను. నన్ను క్షమించండి. నా వయోలిన్ వాదనంమీదా, నాచిత్రలేఖనంమీదా మీకు అడ్మిరేషన్ వుందన్న విషయం

చుట్టూవున్న లోకానికి అనవసరం.అదిగమనించేవల్లా మీరునాగదిలోకివొంట రిగారావడమే. మీరిలా చేయడంవల్ల మున్ముందు నిష్కళంకమైన మీ శీలానికేగాక భాగ్యనగరంలో యెంతోపలుకుబడి సంపాదిచుకున్న మా కంపెనీ ప్రెస్టేజీకికూడా మాయని మచ్చ తేవచ్చు. అది నామూలంగా జరగడం నాకిష్టంలేదు. మీ ఇంటి ప్లాను ఎస్టిమేట్సు వీలయినంత త్వరలో మీనాన్న గారికి అందజేయబడుతాయి. ఈ వ్యవహారం మీనాన్నగారికీ, కంపెనీకి మధ్యనే వుండగలదని ఆశిస్తున్నాను. ఈ ఉత్తరం మీ శ్రేయస్సుకోరే వ్రాయబడింది.

ఇట్లు
మీకు యేమీ కాని
మాధవరావు

మాధవరావు ఉత్తరం రాస్తున్నంతసేపూ అతన్నే తదేకంగా గమనిస్తూ కూర్చున్నాడు భుజంగరావు.మాధవరావుకు చివర తనసంతకంకింద మరొక్కపదం 'శ్లేష్మంలోపడ్డఈగ' అని రాయాలనిపించింది. ఈఉత్తరం భుజంగరావు చూడకవుండడు. అతనామాటచూస్తే ఇంకేమన్నావుందా... కాని ఆముక్క యెలాగయినారాయాలని అతనికి ఆతురత యెక్కువైంది. 'ఎలా ఎలా' అతడు ఆలోచిస్తున్నాడు.

'అయిందా రాయడం?'అడిగాడు భుజంగరావు.

'ఆ...'

ఉత్తరాన్ని భుజంగరావు చేతికి అందించాడు. అతడు దాన్ని నిదానంగా చదువుతూవుంటే అతని ముఖ కవళికలను గమనిస్తూ కూర్చున్నాడు మాధవరావు.

'చాలా?' అన్నాడు మాధవరావు.

'భేష్-కాని నువ్వు ఈ మాటమీదనేవుండు' అంటూ ఆ ఉత్తరాన్ని మాధవరావు చేతికిఇచ్చి తన టేబుల్ డ్రాయరుతీసి అందులోంచి వొక కవరుతీసి మాధవరావు ముందు పెట్టి,

'ఆ ఉత్తరాన్ని ఇందులోపెట్టిపైనఅమ్మాయిపేరు రాయి'అన్నాడు.

మాధవరావు కవరుమీద మాలతిపేరు మాత్రం రాశాడు. అతనికి తక్కిన వివరాలు తెలియవు. ఉత్తరాన్ని మడతపెట్టబోతూ మరొక్కసారి,

చదవసాగాడు. ఇంతలో టెలిఫోన్ మోగింది. భుజంగరావు రిసీవర్ ఎత్తాడు. అదేదో ట్రంక్ కాల్ లాగుంది. గదిఅదిరేట్టు అరుస్తున్నాడు భుజంగరావు. అవతలికంఠం అస్పష్టంగా వున్నదేమో కళ్ళుకూడా మూసుకుని వినే ప్రయత్నంలో వున్నాడు. మాధవరావు ఆలోచన చెయ్యికూడా మెరుపులా పని చేసినై. తనపెన్నుతో సన్నగా, తను అనుకున్న పదం రాసేశాడు. మళ్ళీ భుజంగరావు కళ్ళుతెరిచేలోగా మాధవరావు కవరుమూసి అతికించే ప్రయత్నంలో వున్నాడు. భుజంగరావు ట్రంక్ మాట్లాడ్డం పూర్తి అయ్యాక కవరు అతనిచేతికి అందించాడు మాధవరావు.

'ఈ ఉత్తరం అందీయడంకూడా ఆమె గౌరవానికి యేమాత్రం భంగం వాటిల్లకుండా జరగాలి' అన్నాడు

'అలాగే!'

'ఇప్పుడు నేను చేయవలసిన పని?'

'ఈవాల్టికి రొటీన్ పనే.'

'అవుతే ఈ రోజుకు నాకు సెలవు ఇప్పించండి.'

'ఎందుకూ?'

మాధవరావుకు వొళ్ళు మండింది. 'నాగదికి వెళ్ళి తీరికగాకూర్చుని యేడవడానికి.'

భుజంగరావు అదోలా నవ్వాడు. 'నిన్ను చూస్తే నాకు జాలిగా వుంది మాధవరావు. ఈ విషయంలో నేను కఠినంగా ఎందుకు వుంటున్నానో నీవు అర్థం చేసుకోవు. నీవు అనాలోచితంగా తప్పులు చేసి చిక్కుల్లో ఇరుక్కుంటావు. ఉద్రేకం ఎక్కువ. ఏమయినా అంటే చిర్రున కోపం మాత్రం వస్తుంది. నీ చేతిలో వున్న కళలను సద్వినియోగం చేసుకో! అంతేగాని చేతికీ మూతికీ మసిపూసుకునే ప్రయత్నం చేయకు!' అన్నాడు తాపీగా.

మాధవరావు కాస్సేపు యేమీ మాట్లాడలేదు. తరువాత అన్నాడు. 'మీకు నిజంగా నా మీద జాలి అనేది వుంటే ఆ వుత్తరం మాలతికి పంపకండి ప్లీజ్' అన్నాడు. ఆ వుత్తరం చదువుకుంటే మాలతి ఏ పరిస్థితిలో వుంటుందో వూహించుకుని అతని మనసు విలవిలలాడిపోయి అలా అన్నాడు.

కాని భుజంగరావు ముఖం మాత్రం తీక్షణంగానే వున్నది. 'నీ మీద నిజంగా జాలిపడుతున్నాను గనకనే ఈ వుత్తరం పంపదలచాను. మరీ పసిపిల్లవాడిలా మాట్లాడకు. ఎంత విడమరిచి చెప్పినా నీ పరిస్థితి నీవు అర్థం చేసుకోవేమిటి? నీవు చెప్పినట్టే ఈ వుత్తరం ఆ అమ్మాయికి ఇవ్వడం మానేస్తాననుకో. ఆమె నీమీద ఆశలు పెంచుకుంటూ పోవచ్చు. తన వాళ్ళను వొప్పించి నిన్ను పెళ్ళాడనూవచ్చు. నూరు అబద్ధాలు ఆడి అయినా వొక పెళ్ళి జరిపించమని పెద్దలు చెబుతారు గనుక ఈ పెళ్ళికి నేనూ సహకరించవచ్చు. కాని ఎన్నడో వొకనాడు నీ విషయం కుండ బద్దలు కాకమానదు. తరువాత మీ దాంపత్య జీవితం నరకం కాకా మానదు. అంటే నిన్ను పెళ్ళీ పెటాకులు లేకుండా ఈలాగే జీవితం గడపమని నా వుద్దేశ్యం కాదు. నీ కర్మకాలి ఈ అమ్మాయి గోవర్ధనరావు కూతురు కావడం-ఆయన పోలీసు ఆఫీసరు కావడం, అందులోనూ అన్యాయాల్ని, అక్రమాల్ని యేమాత్రం సహించుకోలేని నిప్పులాంటి అధికారి కావడం-అదీ సంగతి. అందుకనే నిన్ను ఇంతగా హెచ్చరించవలసి వస్తున్నది.'

మాధవరావు మళ్ళీ మౌనం వహించాడు కాస్సేపు. భుజంగరావు చెప్పింది యథార్థమే. కానీ దీని వెనుక వున్న యథార్థం అర్థమై మాధవరావుకు నవ్వు వచ్చింది. 'నా విషయంలో మరో అమ్మాయికి అన్యాయం జరిగితే ఫరవాలేదా...' అన్నాడు.

'ఇదే హాయింపే-కాని నీ జీవితాన్ని వ్యర్థం చేసుకోనక్కరలేదు. గంతకు తగ్గ బొంత అని, మన నైతిక విలువలకు తగ్గ వ్యక్తులు మనకు దొరుకుతారు. ఇప్పుడు నువ్వు ఆశిస్తున్నది ఫణి మీది మణిని. అదే నీకు చెప్పదలచింది. ఇంక వెళ్ళు. అంతగా నీకు ఈ రోజు పనిచేసే మూడ్ లేకపోతే మన గెస్ట్ రూంలో రెస్టు తీసుకో-అన్నట్టు రాత్రి క్లబ్బులో నీ ప్రోగ్రాం వుంది కదూ?'

'అవును.'

'నీ క్లబ్బు కచ్చేరీ సంగతి ఆ అమ్మాయికి తెలుసా?'

'తెలీదు.'

'గుడ్-చూడు మాధవ్‌రావ్! కాలగతిలోనే వ్యక్తులకు వెనుకటి

మాలిన్యం క్షాళనం అవుతుంది. అంతవరకూ నీవు బుద్ధిగా వుండే ప్రయత్నం చేయి.'

మాధవరావు భుజంగరావువంక కొరకొర చూశాడు. కానీ 'అలాగేనండీ' అన్నాడు వినయంగా.

'నీ మంచి కోరని వాడనయితే ఇంతసేపూ నా విలువయిన బిజినెస్ టైం నీకోసం వృథా చేస్తానా! ఇది గమనించి అయినా నీవు సర్దుకోకపోతే యెలా చెప్పు' అన్నాడు.

భుజంగరావుతో వాదన అప్పడాల పిండిలా సాగుతుందే తప్ప దానికి కడ అంటూ వుండదు. అతని మాటలు వినకుండా వెళ్ళినా అపరాధమే. తాను యజమానినన్న అహంకారాన్ని అణువణువునా ప్రదర్శిస్తాడు తన సిబ్బంది ముందు. భుజంగరావుమీదకు తిరగబడి అతణ్ణి యేదో చెయ్యాలన్న వుద్రేకాన్ని బలవంతంగా అణుచుకుంటాడు మాధవరావు. ఆవేశంలో యెంత పనయినా చేయవచ్చుగాని ఆ చర్యల పర్యవసానం అతడు అనుభవపూర్వకంగా తెలుసుకున్నవాడు గనుక-సర్కస్‌లో సింహంలా మొదట గుర్ర్‌మని తరువాత తోక ముడుచుకుంటున్నాడు.

'ఆ వుత్తరాన్ని ఎప్పుడు పంపిస్తారు?' అన్నాడు.

'నీ డ్యూటీ అయిపోయింది ఆ విషయంలో. తక్కింది నేను చూసుకుంటాను.'

'దాన్ని మాలతికి అందజేసే విషయంలో నేను చెప్పిన మాటలు గుర్తు వున్నాయా?'

'నాకు చెప్పాలటోయ్! ఆ అమ్మాయి పోలీసాఫీసర్ కూతురనీ, వుత్తరం ఇచ్చినవాడు వెకిలి వేషాలు వేస్తే దవడపళ్ళు రాలడమేగాక, కటకటాల వెనక్కు వెడతాడనీ నాకు తెలీదూ!'

ఇంతలో ఇంటర్‌కం మోగింది. భుజంగరావు రిసీవర్ ఎత్తాడు. ఎవరో కొత్త కస్టమర్స్ అని సెక్రటరీ చెప్పగానే లోపలికి పంపించమన్నాడు. మాధవరావు ఇవతలికి వచ్చేశాడు. ఆకలిగా వున్నా మెస్సువైపు వెళ్ళబుద్ధికాలేదు. అతని మనసు నిండా మాలతి నిండి వుంది. మస్తిష్కం నిండా-ఆలోచనలు మధుపాల్లా ఝుం అంటున్నాయి. భుజంగ

రావు చెప్పినట్టుగానే అతడు బరువుగా అడుగులు వేసుకుంటూ గెస్ట్‌రూం వైపుకు నడిచాడు.

# 11

ఇదిగో మూడు నాలుగు రోజుల్లో వచ్చేస్తానని బొంబాయి వెళ్ళిన గోవర్ధనరావు పది పన్నెండు రోజుల తరువాత గాని తిరిగిరాలేదు. అతను చాలా హడావుడిగా, ఆందోళనగా వున్నాడు. ఆ మధ్య బాంబే ప్రాంతంలో అర్ధరాత్రిపూట కొన్ని రైలు దోపిడీలు, ఘాట్ సెక్షన్సులో బస్సుల నిలువు దోపిడీలు జరిగి బాంబే పోలీసు శాఖను తికమక పెడుతూ వచ్చింది. వారి దర్యాప్తులో తేలిన విషయాలను బట్టి ఆ దొంగల ముఠా ఆంధ్ర ప్రాంతం నించి వచ్చిందట! ఈ దొంగల ముఠా సంగతి వొక్కటేకాదు, బాంబేలో వందరూపాయలు, అయిదు రూపాయలు, రెండు రూపాయలు దొంగ నోట్లు విరివిగా చెలామణి అవుతున్నవి. ఈ రాకెట్టు ఆంధ్రప్రాంతంలో వున్నదేమో పరిశోధన చేయవలసిందని మహారాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రభుత్వానికి రహస్యంగా విజ్ఞప్తి చేసుకున్నది. వాటి వివరాలు స్వయంగా కనుక్కొని వచ్చేందుకు గోవర్ధరావును నియమించి బాంబే పంపించారు.

నోట్ల తయారీ చాలా నైపుణ్యంతో చేయబడింది. ఎంతటి నిపుణులూ పసికట్టలేనంత నేర్పుగా తీర్చిదిద్దారు వాటి రూపాన్ని. మామూలు మనుషులమధ్య సులభంగా చెలామణి అయిపోవడంలో ఆశ్చర్యం యేమీ లేదు. ఈ ముఠాను పట్టుకోవడానికి బాంబే చుట్టుపట్ల అంతా గాలించడం జరిగింది. వారి పరిశోధననుబట్టి ఈ నోట్లు దాదాపు సంవత్సరం నుండీ చెలామణిలో వున్నట్లు తేలింది. కొన్ని లక్షలు సర్క్యులేషన్‌లో వున్నవిట. మహారాష్ట్ర ప్రభుత్వం చాలా ఆందోళన పడుతున్నది. వాటి సీరియల్ నంబర్స్ ఆంధ్ర ప్రాంతానికి సంబంధించి వున్నట్టు రిజర్వుబ్యాంకు ద్వారా తెలిసింది. గోవర్ధనరావు బాంబేలో పోలీసు అధికారులనేకాక, బ్యాంకు అధికారులనూ కలుసుకుని భోగట్టా అంతా సేకరించాడు.

దోపిడీలు జరిగిన స్థావరాలకు వెళ్ళి చూశాడు. దోపిడీకి గురి అయిన

వ్యక్తులనూ కలుసుకుని వివరాలు సేకరించాడు. వాళ్ళు చెప్పినదాన్ని బట్టి తమను దోచిన దొంగలు వాళ్ళలో వాళ్ళు తెలుగు మాట్లాడుకోవడం విన్నారుట. గోవర్ధనరావు మహారాష్ట్ర ప్రభుత్వానికీ, పోలీసు శాఖవారికీ కూడా హామీ ఇచ్చి వచ్చాడు ఎలాగయినా ఈ ముఠాను బయటకు లాగి తగిన చర్య తీసుకుంటామని. నమూనాకు దొంగనోట్లు కూడా వెంట తీసుకు వచ్చాడు.

ఇంటికి రావడమే ఆలస్యంగా మళ్ళీ హడావుడిగా ఆఫీసుకి బయలు దేరాడు. భార్యతోగాని, కూతురుతోగాని తీరికగా కనీసం రెండు నిముషాలయినా మాట్లాడే వ్యవధి కూడా వుండలేదతనికి. ఈ దర్యాప్తు వ్యవహారమంతా అతిరహస్యంగా జరగాలి. అతను మామూలు కేసు విషయాలే ఇంట్లో చెప్పడు. ఇటువంటివి చెబుతాడా! వరలక్ష్మమ్మ భర్త హడావుడిని చూస్తూ వూరుకుండడంతప్ప మరేమీ చేయలేకపోయింది. భర్త సంగతి అటుంచి, మాలతి యేదో పోగొట్టుకున్నదానిలా ఇంట్లో మసులుతుండటం ఆమెకు అంతు పట్టని విషయంగా తయారైంది.

'ఏమిటే అలావున్నావు' అని నిలవేసి అడుగుతే 'యేమీలేదమ్మా! పరీక్షలు దగ్గరపడుతున్నాయిగదా. పాఠాలగురించి ఆలోచిస్తున్నాను' అని దాటేస్తున్నది.

కాని ఆమె కన్నులలో విన్నబాటు,పరాకు, పాలుమాలిక చదువుకు సంబంధించింది కాదని వరలక్ష్మమ్మ గ్రహించకపోలేదు. కాని ఎంతకని ఈడొచ్చిన పిల్లను నిలవదీయగలదు!

మాలతి మనసు నిజంగానే చాలా మధనపడుతూవున్నది. మాధవరావు ఉత్తరం ఆమెకు వెన్నుపోటులా వుంటున్నది. తను మనస్సు ఇవ్వడంలో తొందరపడింది. ఆ విషయం అతనికి బహిర్గతం చేయడంలోనూ తొందరేపడింది. ఇప్పుడు తనుచేసినపని నిగ్రహం చెడిన స్త్రీ ప్రవర్తనలా లజ్జాకరంగా పరిణమించి తన అభిమానంమీద దెబ్బతీసింది. తొలిచూపులోనే అతడు తన ప్రాణేశ్వరుడిగా తన మనసుమీద ముద్రవేసుకున్నాడు. తన మనసువిప్పి చెప్పుకున్నట్టుగా అతడు తనఅంతరంగాన్ని తనముందు

పరుస్తాడని ఆశించింది. అతని రూపం మాత్రమే కాదు. అతని చిత్ర లేఖనం అతని సంగీత ప్రావీణ్యం అన్నీ తనను ఆకట్టుకునే విషయాలే.

తండ్రి కట్టించబోయే ఇల్లు యేనాటికైనాతనదేనని ఆమెకుతెలుసు. అందుకనే ధైర్యంగా అది మన ఇల్లు అనుకుని రూపుదిద్దమని మాధవ రావును కోరింది. ఆభావనతోనైతే అతడా ఇంటిని అపురూపకళా విన్యాసంతో తను ప్రేమమందిరంగా అతడు రూపొందించగలడని భావించింది. ఆ అభ్యర్థనకు ప్రతిఫలమా ఈ ఉత్తరం? అతనికి నిజంగా తనమీద ఎలాంటి అభిప్రాయమూలేదా? అతని జీవితంలో మరొక స్త్రీ వున్నదా? ఈ సంశయం ఆమె మనస్సును కుదిపివేస్తూవుంటుంది. అయినా ఆ విషయం తను అడగనే అడిగింది. అతను నిర్భయంగావున్నసంగతి చెప్పవచ్చు గదా. అప్పుడు స్త్రీగా తన వాదుగులో తానుండి పోయేది. అతడా విషయం దాటించడమెందుకు?

మాధవరావు వేయబోయే చిత్రం విషయంలోనూ తానెంతటి ఆసక్తి పెంచుకున్నది. దానివిషయంలో యథార్థాన్ని దాచడమెందుకు? అతడు పసి పిల్లవాడిలా ఏడుస్తూవుంటే తనహృదయం జాలితో ద్రవించిపోయింది. తను అంతగా లాలించి అడిగినందుకయినా తన దుఃఖకారణాన్ని చెప్పుకో వచ్చుగదా? అతికీ అతకని సమాధాన మివ్వడమెందుకు! ఏమిటీతని వింతప్రవర్తన. తనుముందుగా చొరవచూపించడాన్ని అతడు అలుసుగా తీసుకున్నాడా? మళ్ళీ మనసులో యేదో ఆశ. తన ప్రేమని పరీక్షించ డానికి ఈ ఉత్తరం రాశాడా? అసలింతకీ ఆఉత్తరం తనంతటతనే రాశాడా లేక...లేక... మాలతికి భుజంగరావు గుర్తుకు వచ్చాడు. తను మాధవ రావు గదిలో వుండటాన్ని భుజంగరావు అపార్థం చేసుకుని వుంటాడు. అందుకని ఆయనే ఈవిషయంలో యేదయినా ఆంక్షవిధించాడా? ఈవూహ రాగానే ఆమెవొళ్ళు అసహ్యంతో వణికింది. సిబ్బంది యొక్కవ్యక్తిగత విషయాల్లో కూడా కల్పించుకునే కంపెనీ అదేం కంపెనీ అనుకుంది. మాధవరావు తన ఉత్తరంలో రాసినట్టు అతణ్ణి మరచిపోవాలని యెంత ప్రయత్నించినా ఆమె అతని మనోహర రూపాన్నిమరచిపోలేకపోతున్నది.

రెండు రోజుల క్రితమే ఇంటియొక్క ప్లానూ ఎస్టిమేట్స్ తయారై వచ్చింది. మాలతికి దాన్ని చూడాలన్న ఆసక్తి యే మాత్రమూలేదు. కాని

తల్లియొక్క ఆతురతను చూడలేక దాన్ని విప్పిచూసి తల్లికి విషయం చెప్పింది.

ఆ ప్లాను వరలక్ష్మమ్మకు తికమకగా కనుపించింది. షైగా ఎస్టిమేట్సు లక్షా ఇరవయి వేలువుంది. 'అబ్బో! రమణయ్య ఇంటికి యెనభై వేలే అయిందిగదా' అంది వరలక్ష్మమ్మ.

'మనం అదనంగా రెండుగదులూ, గారేజీ, వంటింటినిండా సిమెంటు పట్టెలూ కావాలంటే అంత ఖరీదు కాదాయేమిటి' అన్నది మాలతి కాస్త చిరాకుగా.

'అంత మనం భరించగలమా అని!'

'ఇంతది కాకపోతే మన తాహతుకొద్దీ కట్టుకుందాం' అంది మాలతి.

'ఏమో మీ నాన్నగారు రానీ...'

'అవునమ్మా. అంతవరకూ నీవు కంగారుపడి బి.పి. పెంచుకోకు.'

'ఆ అబ్బాయి యెవరో చాలా మంచి వాడన్నావు మరి?'

'బాగుంది. అబ్బాయి మంచివాడు కావడానికి ఇంటి ఖరీదు పెరగడానికీ లంకెయేమిటి?'

'అదిగాదే. ఇదే ప్లాను కాస్త పొదుపుగా వేసివుండవచ్చుగదా అని.'

'ఏమోలేవే. నాన్నగారువచ్చాక అన్నీ వివరంగా కనుక్కుంటారు.'

'అంతేలే' అంది వరలక్ష్మమ్మ.

కాని ఆమె మనసు భర్త టూరునుంచి తిరిగి వచ్చేవరకూ నిలకడ లేకుండానే వుండింది. తీరా అతను వచ్చాక అతని హడావుడి చూసి ఆమె నిజంగానే హడలిపోయింది. ఆ సమయంలో ఈ ప్రసక్తితెస్తే ఇల్లుకట్టించే మాట అట్లావుంచి, వున్న ఇల్లు కూల్చిపోతాడు ఆ తొందరలో అనిపించి మిన్న కుండిపోయింది. ఉదయం తొమ్మిది గంటలకువెళ్ళిన గోవర్ధనరావు రాత్రి తొమ్మిది దాటాక వచ్చాడు. అతని ముఖంలో అలసటా, హైరాన. వేన్నీళ్ళు పెట్టమని స్నానంచేసి వేడిగా వొక కప్పు కాఫీతాగి హాల్లో వాలు కుర్చీలో కూర్చున్నాడు. మళ్ళీ యేదో ఆలోచన. ఎంతకీ తెమిలేట్టులేదు.

'భోజనం చేయరా' అంది వరలక్ష్మమ్మ భయం భయంగానే.

'తినాలని లేదు వరం.'

'మీకు అలాగే వుంటుంది. ఏదో కాస్త ఎంగిలిపడండి.'

'నీవు తిన్నావా?'

'మీకోసమే కూర్చున్నాను.'

'అమ్మాయి...'

'అదియేదో తిన్న పేరుచేసి తనగదిలోకి వెళ్ళిపోయింది.'

గోవర్ధనరావు లేచివచ్చి భోజనానికి కూర్చున్నాడు. అతడు తనకు తినాలని లేదన్నా ఎప్పుడూ తినడం మాత్రం మామూలుగానే తింటాడు. కాని ఈపూట నిజంగా అతనికి భోజనంమీద ధ్యాసవున్నట్టులేదు. చారూ, మజ్జిగతో సరిపుచ్చుకుంటున్నాడు. అతని మనసేదో తీవ్రంగా ఆలోచిస్తూ వుంటే తప్ప యిలా చేయడనుకుంది వరలక్ష్మమ్మ. భర్త ఇంటి ప్లాను ప్రసక్తి యెత్తుతాడేమోనని ఆమె ఇంతసేపూ ఎదురుచూసిందిగాని అతడి నోటినుండి ఆమాటే రాలేదు. ఇప్పుడు తానా సంగతి చెప్పకపోతే మళ్ళీ ఎప్పుడు వీలు పడుతుందో అదీ చెప్పలేం.

'ఇంటి ప్లాను పంపించారు' అన్నది నెమ్మదిగా.

'ఆహాఁ'

'లక్షా ఇరవై వేలు ఎస్టిమేటు వేశారు.'

'అలాగా!'

గోవర్ధనరావు యేదో తీవ్రంగా ఆలోచిస్తూనే పొడిపొడిగా సమాధానాలు చెప్పి లేచి చేతులు కడుక్కొని వచ్చి హాల్లో కూర్చున్నాడు. వరలక్ష్మమ్మ ప్లాను తెచ్చి అతని చేతికిచ్చి అక్కడే నిలబడ్డది. అతడు కళ్ళజోడు సరిచేసుకుని దాన్ని పరిశీలనగా చూశాడు కాసేపు.

'బాగానే వున్నట్టుంది.'

'ఎస్టిమేటు బాగాలేదు' అంది వరలక్ష్మమ్మ.

'ఇది మనకు శాశ్వతంగా వుండే ఆస్తి.'

'కావచ్చుకాని లక్షలోపల వుంటే మంచిదని నాఅభిప్రాయం. అమ్మాయి పెళ్ళి విషయం మరిచి పోతేయెలా? మీ హోదాకు తగ్గట్టు అదీ జరపించాలిగదా–'

'అవునవును. నేనా సంగతే మరిచిపోయాను.'

'ఏదో సర్దుబాటుచేసి ఖర్చు లక్షకు లోపలకు దించమని చెప్పండి.'

'అలాగే. కంపెనీ వాళ్ళతో మాట్లాడుతాను. దాన్ని తగ్గించడానికి వీలులేకపోతే మరొకటి తయారు చేయమంటాను.'

'మీ హడావుడి చూస్తే ఇప్పట్లో ఈ విషయం పట్టించుకునేట్టులేరు.'

'హడావుడిగా వున్న మాట నిజమేకాని కొన్నాళ్ళవరకూ టూరు వెళ్ళడం అంటూ వుండదు. రేపు ఎలాగయినా తీరికచేసుకుని ఈ విషయం తేల్చుకుంటాను. ఇంతకీ ప్లాను అమ్మాయికి నచ్చిందా?'

'నచ్చిందో లేదో నాకు తెలియదు.'

'అదేమిటి అలా అంటున్నావు?'

'అది యేదో పిచ్చివాలకంతో వుంటోంది. ఏమిటీ అంటే సరిగా చెప్పదు. మీరయినా కాస్త కనుక్కోండి.'

'అలాగా కనుక్కుంటాలే! నీవు వెళ్ళి భోజనం చేసిరా.'

వరలక్ష్మమ్మ లోపలికి వెళ్ళిపోయింది. గోవర్ధనరావు అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. సుభద్ర వరలక్ష్మమ్మకు వడ్డిస్తూ వుంటే ఆమె సణుగుతూ వున్నట్టుగా 'ప్లానులో ఎంత బాగుంటే మాత్రం లక్షదాటిపోతే ఎలా భరించగలమన్న ఆలోచన అక్కరలేదా?' అంది.

సుభద్రకు వరలక్ష్మమ్మ ఆందోళన అర్థమయింది.

'ప్లానులో వున్నట్టు వొక్కసారే కట్టుకోవాలని ఏముంది? ప్రస్తుతానికి మీకు వీలుపడినంత వేసుకోండి. తక్కిన భాగం నింపాదిగా పూర్తి చేసుకోవచ్చు' అంది. సుభద్రమాటలు సమంజసంగానే తోచింది వరలక్ష్మమ్మకు. ఈ పాటి ఆలోచన తనకు రానందుకు బాధ కూడా కలిగింది

'నీవనేదీ నిజమేలే' అన్నది సుభద్రవంక చూస్తూ.

పొదుపు అన్న పదానికి సరయిన అర్థం సుభద్రకు తెలిసినట్టుగా మరే ఆర్థికశాస్త్రవేత్తకూ తెలిసి వుండదనిపిస్తుంది వరలక్ష్మమ్మకు. తను ఇరవై రోజులలో ఖర్చుచేసే ఇంటివెచ్చాలను నెలకుపయిగానే సర్దుతుంది. తనువాడితే గాసు ఇరవైరోజులన్నారాదు. ఇప్పుడున్న సిలెండరు సుభద్ర రావడానికి పదిరోజులముందు తెప్పించింది. ఇంకా నడుస్తూనే వుంది. ఈ తిరకాసేమిటో తనకు అర్థం కాదు అనుకుంటుంది.

ఇటు ఇంటివాళ్ళకూ, అటు పనివాళ్ళకూ కూడా తృప్తిగానే అన్నీ అమర్చుకుంటూ వస్తున్నది. ఇది ఏనాటిఋణానుబంధమో!

వరలక్ష్మమ్మ తన భోజనం ముగించి లేస్తూ 'ఇంక నువ్వు తిను సుభద్రా. ఇప్పటికే చాలా పొద్దుపోయింది' అంటూ హాల్లోకి వచ్చింది.

గోవర్ధనరావు ఇంకా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

వరలక్ష్మమ్మ తనూ అక్కడే సోఫామీద కూర్చున్నది, భర్తతో యెన్నో విషయాలు మాట్లాడాలని. కాని భర్తముఖంలో గాంభీర్యంచూస్తే భయంగా వుంది. పదినిముషాలు గడిచినా గోవర్ధనరావు ఇంకా మౌనంగానే ఆలోచిస్తున్నాడు.

వరలక్ష్మమ్మ ధైర్యం చేసి సుభద్ర చెప్పిన సలహా చెప్పింది.

'మంచి ఆలోచనే. రేపు వాళ్ళను కనుక్కుంటానుగా. మరీ వీలు పడకపోతే ఆమె సలహా ప్రకారమే చేద్దాం' అన్నాడు.

వరలక్ష్మమ్మకు మనసు కుదుటపడింది. దానితో ఆలోచనలూ కుదుట పడి నిద్ర రాసాగింది. చాలారోజుల తరువాత ఆమె ఆలోచించడం గమనించిన గోవర్ధనరావు 'నీకు నిద్రవస్తే పడుకో వరం. నేను బొంబే నుండి ట్రంకాల్ కోసం ఎదురు చూస్తున్నాను. అఫీసునుండి ఫోనురావాలి. నేను పడుకోవడం ఆలస్యం అవుతుంది. పొద్దున్నే పెందలాడే వెళ్లాలి' అన్నాడు.

ఆమె యేమీ మాట్లాడకుండా పడకగదిలోకి వెళ్ళిపోయింది. మరో పది నిముషాలకు వంటింటివేపు లైట్లు ఆరిపోయాయి. ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించింది. అప్పుడు వరలక్ష్మమ్మ పెడుతున్న సన్నటి గురక స్పష్టంగా వినిపిస్తూ వుంటే గోవర్ధనరావు తనలో తాను నవ్వుకున్నాడు. అతడు మళ్ళీ ఆలోచనలోపడి అప్రయత్నంగా తలపైకెత్తి మాలతిగదిలో లైటు వెలుగుతూండడం గమనించాడు. ఉదయం వున్న హడావుడిలో మాలతితో మాట్లాడలేదు. ఇప్పుడు తాను వచ్చి ఇంతసేపయినా ఆమె కిందకు దిగి రాలేదు. బొంబేనుండి ఆమెకు ఏమో తెస్తానని చెప్పి వెళ్లాడుగాని అక్కడ బజారువేపు వెళ్ళేందుకువీలుపడక వుట్టి చేతులతో తిరిగి వచ్చాడు. మాలతి విషయంలో ఇందాక భార్యచెప్పిన మాటలు గుర్తుకు వచ్చినవి. ట్రంక్ కాల్ ఎప్పుడు వస్తుందో, ఆఫీసునుండి యెదురుచూస్తున్న ఫోనుఎప్పుడువస్తుందో అని అతడు ఎదురు చూస్తున్నాడు. ఇంతలో కాసేపు మాలతితో మాట్లాడి వద్దామన్న ఆలోచన వచ్చి అతడు నిశ్శబ్దంగా పైకి వెళ్ళాడు.

ఆమె గదిలోకి అడుగు పెట్టగానే అక్కడి దృశ్యం చూచి గోవర్ధనరావు నివ్వెరపోయాడు. అతని మనసు చలించిపోయింది. మాలతి టేబుల్ మీదకు వంగి చేతుల్లో ముఖం దాచుకుని సన్నగా వెక్కుతూ ఏడుస్తున్నది. పక్కనున్న టేబుల్ లాంప్ కింద వొక వుత్తరం వున్నది. గోవర్ధనరావు అలికిడి కాకుండా ఆమెను సమీపించాడు.

ఆయన మాలతిని ఈ స్థితిలో ఎన్నడూ చూడలేదు. ఆమెయొక్క ఇంతటి దుఃఖానికి కారణమేమిటి? ఆయన కళ్ళు అక్కడ వున్న ఉత్తరం మీదపడినయ్. దానిమీద తారీకు చూశాడు. కింద సంతకం చూశాడు. ఇంక దాన్ని చదవకుండా వుండలేకపోయాడు. దాన్ని చదివాక అతనికి చాలా కథ అర్థమయిపోయింది. ఈ వుత్తరం పదే పదే చదివి మాలతి తనలో తాను కుమిలిపోతున్నది. ఈ అనతి కాలంలో ఇంత గ్రంథం జరిగిందా? యవ్వనం యెంత అద్భుతంగా ఇంద్రజాలం చేస్తుంది! ఆ విధంగా వుత్తరం రాసిన మాధవరావు ఎంతో ఉదాత్తుడుగా గోచరించాడు ఆయనకి. మరొకడై వుంటే తన కూతురు సర్వస్వాన్ని దోచుకుని నవ్వులపాలు చేసి వుండేవాడు. ఏమైనా ఇప్పుడు మాలతి హృదయం బాగాదెబ్బతిని వున్నది. ఆమెను అనునయించడం తన కర్తవ్యం అనుకున్నాడు.

'మాలతీ' అన్నాడు మెల్లగా ఆమె తల నిమురుతూ.

మాలతి ఉలిక్కిపడి తలయెత్తింది. ఆమె కళ్ళు యేడ్చి యేడ్చి యెర్రబారివుండటమేగాక బాగా వుబ్బికూడా వున్నాయి. ఆమె తండ్రి చేతిలో వుత్తరం వున్నది చూచి కంగారుపడిపోయింది.

'నాకంతా అర్థమైందమ్మా' అన్నాడు వాత్సల్యంతో.

మాలతికి మళ్ళీ దుఃఖం ముంచుకువచ్చి 'నాన్నా' అంటూ తండ్రి వక్షానికి తల ఆన్చి వెక్కి వెక్కి యేడవసాగింది.

'నేనేం తప్పుచేయలేదు నాన్నా. నన్ను అపార్థం చేసుకోకు' అంది వెక్కుతూనే.

'నీమీద నాకు విశ్వాసం వుందమ్మా. ఇంతకూ యేం జరిగింది?' అన్నాడు. ఆమె మంచంమీద కూర్చుంటూ ఆమెనూ తన పక్కన కూర్చోపెట్టుకున్నాడు. మాలతీ కన్నీళ్ళను పమిట కొంగుతో తుడుచుకుని సర్దుకుని కూచుని, తమ మధ్య జరిగిన విషయమంతా వివరంగా చెప్పింది.

గోవర్ధనరావు అంతా శ్రద్ధగా విని నిట్టూర్పువిడిచాడు. తన కూతురిమనసు మాధవరావు మీద యెంత గాఢంగా లగ్నమై వున్నదో అతడు గ్రహించ గలిగాడు. మాధవరావును గురించి వొక్కక్షణం ఆలోచించాడు. నిజమే అతనికేం లోటు? రూపం, విద్యా, సంపాదనా అన్నీవున్నవి. అన్నివిధాలా మాలతికి తగినవాడే. కాని అతడెందుకిలా ప్రవర్తిస్తున్నట్లు?

'ఈ విషయం అమ్మతో చెప్పలేదా మాలతీ?'

'లేదు నాన్నా. అమ్మ నన్ను మరో విధంగా అర్థం చేసుకుంటుం దేమోనని భయం వేసింది.'

'నేను మాధవరావుతో మాట్లాడతానమ్మా. నేను పెద్ద పోలీసుఆఫీ సర్ను అన్న విషయం అతణ్ణి ఇబ్బంది పెట్టి వుంటుంది. నీవు ఇట్లావుంటే నేను చూడలేనమ్మా. మామూలుగా వుండడానికి ప్రయత్నించు. అన్నీ చక్కబడుతాయి' అన్నాడు.

'అలాగే నాన్నా' అంది మాలతి. ఆమె పెదిమల మీద చిరునవ్వు మెరిసింది. గోవర్ధనరావు ఆ వుత్తరాన్ని మళ్ళీ వొకసారి చదివాడు.

'నాకో సందేహం నాన్నా!'

'ఏమిటమ్మా అది?'

'ఇది అతడు స్వంతంగా రాశాడో, లేక ఆ భుజంగరావు బలవం తంగా రాయించాడో?'

'ఎందుకట్లా అనుమానిస్తున్నావు?'

'ఎందుకో అలా అనిపిస్తోంది నాన్నా. అనేక విషయాలలో అతనికి వ్యక్తిగత స్వాతంత్ర్యం లేనట్టు అతని మాటలవల్ల స్పష్టమౌతోంది. బహుశా మాధవరావు నీలాంటి పోలీసాఫీసరుకు అల్లుడౌతే తన పిడికిట్లో వుండడన్న భయం కావచ్చు.'

'అదీ పాయింటే!' గోవర్ధనరావు ఆ వుత్తరాన్ని పంక్తులమధ్య చదవ డానికి ప్రయత్నించాడు. పైనుండి క్రింది వరకూ రెండు మూడుసార్లు చది వాడు. నాలుగోసారి గమనించాడు మాధవరావు సంతకం కింద సన్నటి గీతలా కనుపిస్తున్న అక్షరాలు. జేబులు లైటు దగ్గరగా పెట్టి మరీ చూశాడు. 'శ్లేష్మంలో పడ్డ ఈగ.'

మాలతి ఈ విషయం గమనించి వుండదు. పరీక్షగా చూస్తేగాని

ఇది కనిపించదు. గోవర్ధనరావు ఆ విషయాన్ని మాలతికి చెప్పలేదు. 'ఈ వుత్తరం నా దగ్గర వుండనీ అమ్మా-నీవింక నిశ్చింతంగా నిద్రపో' అన్నాడు. ఇంతలో కింద టెలిఫోన్ మోగడంతో గోవర్ధనరావు గబగబ కిందకు దిగివచ్చాడు.

# 12

ఆ వుత్తరం రాయవలసి వచ్చినందుకు మాధవరావు మనసుకూడా చాలా కృంగిపోతున్నది. పనిలో పాలుమాలిక, రాత్రిళ్ళు నిద్రలేకపోవ డం, తనమీదే తనకు జుగుప్స. ఆ వుత్తరం చదివి మాలతి ఎంత బాధపడు తున్నదో అన్న భావన అతణ్ణి మరింత బాధపడుతున్నది. మాలతి, మాలతి...తన మనసులోని ప్రేమను ఎంత మధురంగా వ్యక్తం చేయగలి గింది.

'మన ఇల్లు.'

ఈ జన్మలో తనకా యోగ్యత కలుగుతుందా? తన యెదుటకు వచ్చి నిలచిన భాగ్యదేవతను మెడపట్టి బయటకు గెంటవలసిన పరిస్థితిలో ఇరు క్కుని వున్నాడు తను. భుజంగరావు కలగజేసుకున్నందుకు తనకు వుక్రో షం వచ్చిందిగాని తనకు తనై మాత్రం ఆ అమృతకలశాన్ని అందుకునే అర్హత కలిగి వున్నాడా! అది తన మనసులో ఆరాటమేగాని, తనుయెక్క డికీ కదలలేని స్థితిలో వున్నాడని అతని అంతరంగానికి బాగా తెలుసు. భుజంగరావు కాలభుజంగం. తనను చుట్టేసుకుని వున్నాడు. అతణ్ణి విడి పించుకు పారిపోవడం అంటూ జరగదు. తనకున్న కలలనూ, ప్రతిభనూ అతడు నేర్పుగా వుపయోగించుకుంటూ తన పీకను వొడిసిపట్టుకుని వున్నాడు. ఈ విషయం తనకూ, భుజంగరావుకీ, గంగులుకీ మాత్రమే తెలుసు. తక్కినవారికి ఆ కంపెనీలో తాను ఛీఫ్ ఆర్కిటెక్ట్, మెలొడి కింగ్ ఆఫ్ వయోలిన్, ఇంకా గొప్ప చిత్రకారుడు—

తన జీతం పదహారు వందలు ప్లస్ పెర్క్స్. తనకొక మోటార్ సైకిల్ కూడా వుంది. రోడ్డుమీద తాను ఎంత జాగ్రత్తగా వెడితేనేం! ఎదుటివాడు వచ్చి మీదపడితే అతనితోపాటు ఆ ప్రమాదాన్ని తానూ

అనుభవించాలి. ఆ గండం మోటార్ సైకిల్‌తో పోయింది. దాన్ని మూలలో పెట్టాడు. నడిచివెళ్ళి రావడమే ప్రాణాలకు హాయిగా వుంది. ప్రశాంతత కోసం బిర్లామందిర్, టాంక్‌బండ్ మొదలయిన ప్రదేశాల్లో తిరిగితేమాత్రం ప్రయోజనమేమిటి? క్లబ్బులో తన వయోలిన్ విషాద స్వరాలు పలుకుతున్నదిప్పుడు. చిత్రలేఖనం మనస్సుకు శాంతినిస్తుందేమోననిపించింది.

ఆ వుదయం 'దరిజేరిననావ' పాత స్కెచ్ స్క్రాచ్ చేశాడు. ఫ్రేమ్‌కు మరొక కాన్‌వాస్ బిగించాడు. ఆలోచనలను కూడ దీసుకుని స్కెచ్ వేయడానికి పూనుకున్నాడు. మాలతి ఎదురుగా నిలబడి నవ్వినట్టయింది.

'మీరంత సాహసం చేయగలరా?' ప్రశ్నిస్తోంది.

'ఆ నావలో చిక్కుకుపోయిన ఆ స్త్రీ మూర్తి ఎవరూ?' మరో ప్రశ్న.

'ఈనాటి సమాజంలో స్త్రీకి ధైర్యం చెప్పి ముందుకు నడిపించే చిత్రాలు గీయాలి.' సున్నితమయిన వ్యాఖ్య.

ఆలోచనలు అస్తవ్యస్తంగా కొట్టుమిట్టాడి కొంతసేపటికి కుదుటపడ్డాయి. మనసులో స్కెచ్‌కు వొక రూపం వచ్చినట్టయింది. పెన్సిల్‌తో స్కెచ్ చేయడం మొదలుపెట్టాడు. ఈ చిత్రం మాలతికి తప్పకుండా నచ్చితీరుతుంది. కాని...కాని...ఇంక మాలతిని చూడటం-దీన్ని పూర్తి చేసినా ఏ ముఖం పెట్టుకుని ఆమెకు చూపించగలడు తను. పోనీ రమణయ్యగారి ద్వారా పంపితే? భుజంగరావుకి ఈ విషయం తప్పక తెలుస్తుంది. అప్పుడు మళ్ళీ గొడవ. ఛీ ఛీ తన బతుకు నిజంగా శ్లేష్మంలో పడ్డ ఈగలాంటిదే. మళ్ళ అతని ఆలోచనలు ఎటో పోయాయి. తన సంతకం కింద సూక్ష్మమయిన అక్షరాలతో రాసిన ఈ మాటను గుర్తించి వుంటుందా? తన బతుకు సుడిగుండలో వుందన్న విషయం ఆమె గ్రహించకుండా వుంటుందా? అతడు ఆలోచిస్తూనే స్కెచ్ చేస్తున్నాడు.

'సార్...' ఎవరో పిలిచారు.

మాధవరావు వెనక్కు తిరిగి చూశాడు. గోవర్ధనరావుగారి డ్రైవరు. ఇతడెందుకు వచ్చినట్టు? మాధవరావు గుండె దడదడలాడింది.

'ఏమిటి...' అడిగాడు.

'అయ్యగారు మిమ్మల్ని అర్జంటుగా రమ్మంటున్నారు.'

'ఎందుకూ...'

'నాకు తెలీదండి. వెంటనే తీసుకురమ్మన్నారు.'

'వాళ్ళ ఇంటికేనా...' అడిగాడు మళ్ళీ. అక్కడికి తాను వెళ్ళడమా? మాలతి యెదుట పడటమా? బహుశా ఆ వుత్తరం రాసినందుకు కోర్ట్ మార్షల్ జరిపిస్తాడేమో? మరెవరయినా అయితే రాను పొమ్మనేవాడే. కాని పిలుస్తున్నది పోలీసాఫీసర్.

'ఇంటికి కాదండి, ఆఫీసుకు.'

'ఎక్కడుంది ఆయన ఆఫీసు?'

'ఆయన ఈ రోజు ఫోరెన్సిక్ లాబ్‌లో వున్నారు. అక్కడికే మిమ్మల్ని తీసుకురమ్మన్నారండీ. వొక్క పదినిముషాల్లో మాట్లాడి పంపించేస్తానన్నారు.'

అంత ఆఫీసరు ఇంత తగ్గు స్థాయిలో సందేశమా? ఇందులో యేదో రహస్యమే వుండి వుంటుంది. తనను నేరుగా ఏ విషయమూ సంప్రదించకూడదు అని తెలిసికూడా తనను ఎందుకు పిలిపిస్తూ వున్నట్టు? ఈ సమయంలో భుజంగరావు వస్తే! అతడి ఆలోచనలు స్తబ్దమయినవి కొన్ని క్షణాలు. పర్యవసానం ఎలా వున్నా తను వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు.

'వుండు ఇప్పుడే వస్తాను' అని లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చాడు. తల దువ్వుకునే నిమిత్తం వొకసారి అద్దంలో తన ముఖాన్ని చూసుకున్నాడు. గెడ్డం గీసుకుని రెండు మూడు రోజులు కావడంచేత బాగా మాసిపోయి వున్నది. కళ్ళు కూడా లోపలికి దించుకుపోయి వున్నవి. తన వాలకం చూసి తనకే నవ్వు వచ్చింది. గబగబ తల దువ్వుకుని ఇవతలికి వచ్చాడు. గదికి తాళం వేయబోతూ వొకసారి రిస్టువాచి చూసుకున్నాడు అప్పుడే యెనిమిదింబావు అయింది. తను ఆఫీసుకి వెళ్ళడానికి ఇంకా బోల్డుం టైం వుంది.

ఈ రోజు ఆఫీసుకి వెళ్ళేదీ లేనిదీ గోవర్ధనరావుతో మాట్లాడేదాన్ని బట్టి వుంటుంది అనుకుంటూ గదికి తాళంపెట్టాడు. అతడు డ్రైవర్‌ని అనుసరించి వెళ్ళి కారులో కూర్చున్నాడు. కారు కదలి వెడుతుంటే మళ్ళీ మనసులో యేదో ఆందోళన బయలుదేరింది. గోవర్ధనరావు వేయబోయే

ప్రశ్నలూ-తాను అందివ్వబోయే సమాధానాల గురించి పిచ్చిగా ఆలోచనలు వస్తున్నవి. వాటిని అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నిస్తూ మౌనంగా కూర్చున్నాడు.

పావుగంటలో కారుఫోరన్సిక్ లాబ్ చేరింది. మాధవరావు గుండె నిబ్బరం చేసుకుని డ్రైవరు వెనకాలే నడిచాడు. పొడుగాటి కారిడార్‌లో అయిదారు గదులుదాటి వెళ్ళిన తరువాత వొక గదిలోకి తీసుకువెళ్లాడు డ్రైవరు. అక్కడ గోవర్ధనరావు వొక్కడే టేబుల్ దగ్గర కూర్చొనిఏవో కాగితాలు పరిశీలిస్తున్నాడు.

మాధవరావును అక్కడ వదలి అవతలికి వెళ్ళిపోయాడు డ్రైవరు.

'నమస్కారమండి' అన్నాడు మాధవరావు వినయంగా.

'నమస్కారం. రా...రా! అలా కూర్చో' అన్నాడు గోవర్ధనరావు నవ్వుతూ.

మాధవరావు జంకుతూనే కుర్చీలో కూర్చున్నాడు. అతని మనసు ఏదేదో వూహించుకుంటున్నది. గోవర్ధనరావు మాధవరావు ముఖాన్ని పరిశీలనగా చూస్తూ వున్నాడు. మాలతి ముఖంలో గోచరించే లక్షణాలే ఇతనిలోనూ గోచరిస్తున్నాయి. ఇదంతా భగ్న ప్రేమ తాలూకు వింతచేష్ట కాబోలు అనుకున్నాడు.

'అదోలా వున్నావు ఏమిటి వంట్లో బాగోలేదా?' అడిగాడు గోవర్ధనరావు. తుఫానుకు ముందు ప్రశాంతత కాబోలు అనుకున్నాడుమాధవరావు.

'బాగానే వున్నానండి! రాత్రి నిద్రపోవడం ఆలస్యమై వుదయం లేచేసరికి పొద్దుపోయింది. ఇంతలో మీ డ్రైవరు వస్తే షేవ్ చేసుకోకుండా అలాగే వచ్చేశాను' అన్నాడు.

'ఫరవాలేదులే.'

'మా ప్లాను మీకు అంది వుండాలి. నచ్చిందా?' అన్నాడు ఏ విధంగానూ తడుముకోకుండా వుండటానికి ప్రయత్నిస్తూ.

గోవర్ధనరావు అతనివంక సూటిగా చూస్తూ అతని కళ్ళల్లో ముఖ కవళికలలో యేదో చదవడానికి ప్రయత్నిస్తున్నాడు.

'ప్లాను సంగతి నీతో డైరెక్టుగా మాట్లాడకూడదుకదా- ఆ సంగతి మీ బాస్‌తోనేమాట్లాడుతాను.'

'మరి—'

'నిన్ను మరో విషయంగా పిలిపించాను. పర్సనల్.'

మాధవరావు గుండెమీద రాయిపడ్డట్లు అయింది. గోవర్ధనరావు అడగబోయే దేమిటో ఇప్పుడు స్పష్టంగా తెలిసిపోయింది.

ఇంత సౌమ్యంగా కనుపిస్తున్న ఇతడు ఇంక కొద్దిక్షణాల్లో ప్రళయ కాల రుద్రుడిలా తాండవం చేయకతప్పదు. సింహంఎదుటికి వచ్చిన కుందేలులా వుంది అతని పరిస్థితి. 'చెప్పండి' అన్నాడు వినమ్రంగా.

గోవర్ధనరావు తన వాలెట్ తెరచి అందులోనుంచి వుత్తరాన్ని బయటకు తీసి మాధవరావు ముందుపెట్టాడు. 'ఏమిటిది?' అన్నాడు.

మాధవరావు తలదించుకున్నాడు.

'ఏమిటి నీ వుద్దేశ్యం?' ఆయన స్వరం హెచ్చించాడు.

'మరేం లేదండి- మాలతిగారు నా విషయంలో చూపిస్తున్న ఇంటరెస్టు లోకం అపార్థం చేసుకోకూడదని.'

'ఆ పాయింటు నాకు అర్థమవుతూనే వుంది. ఇది నీవు స్వయంగా రాశావా? యెవరయినా బలవంతంపెట్టి రాయించారా?'

'నేనే రాశానండి.'

'నేను నమ్మను.'

'——'

'మాట్లాడవేం! అయితే ఈ మాటకు అర్థం ఏమిటి' అంటూ ఆయన "శ్లేష్మంలో పడ్డ ఈగ" అన్న వాక్యంచుట్టూ పెన్నుతో చుట్టారు. మాధవరావుకు యేం చెప్పాలో తోచలేదు. 'మాధవరావ్! నానించి దాచడానికి ప్రయత్నించకు. ఐయామ్ కన్‌సర్న్డ్ అబౌట్ యు.'

'మీరు మా కంపెనీ కష్టమర్సు. ఆ కంపెనీ సిబ్బందిగా నాకు ఎక్కువ స్వాతంత్ర్యంలేదని తెలియబరచటానికే అలారాశాను.'

గోవర్ధనరావు కొంచెం పెద్దగా నవ్వాడు. 'ఈ అర్థం నీవు రాసిన మాటకు సరిగా అతకదు. నీ నిజమయిన పరిస్థితివేరు. అదేమిటో నేను వూహించగలను. అసలు విషయమేమిటో నీవు ధైర్యం చేసిచెప్పు. ఫరవాలేదు. నీ వెనుక నేను వొక్కడ్నేకాదు పోలీసు డిపార్టుమెంటు అంతా వుంటుందని తెలుసుకో. ఆ వూబిలోంచి నిన్ను బయటకు లాగుతాను.'

ఈ మాటలు మాధవరావుకు ధైర్యాన్ని ఇవ్వలేదు. ఎటొచ్చి ఎటు పోతుందోనన్న భయం వొకటి కొత్తగాపట్టుకుంది.

'దయచేసి ఈ వుత్తరం సంగతి మరచిపొండి. నన్ను యిలా వది లెయ్యండి ప్లీజ్' అన్నాడు బలిమాలుతున్న ధోరణిలో మాధవరావు.

'నిన్ను విడిచిపెట్టేదిలేదు. నీవు నిజం చెప్పకతప్పదు' అన్నాడు గోవర్ధనరావు. ఈసారి అతని కంఠంలో అధికారం స్పష్టంగా ధ్వనించింది. మాధవరావుకు ముచ్చెమటలుపోస్తున్నాయి. గుండెవేగంగాకొట్టుకోసాగింది. వుత్తరంలో తనా మాటరాయకుండా వుండినా సరిపోయేది. తనస్థితిని మాల తికి చాలా తెలివిగా తెలియపరచాలనుకున్నాడు గాని ఇప్పుడు పరిస్థితి తారుమారయింది. అయినా ఈ వుత్తరాన్ని మాలతి తండ్రికి యెందుకు చూపించినట్టు? మళ్ళీ ఇంతలోనే ధైర్యం. ఇంత పెద్ద పోలీసాఫీసరు తన వెనక వుంటానని హామీ ఇస్తున్నాడు. తన విషయం పూర్తిగా చెప్పేస్తేనేం! ఎన్నాళ్ళిట్లా ముసుగులో గుద్దులాట! ఎంతకాలమని ఈ ప్రచ్ఛన్న జీవితం! కొన్నిక్షణాలు ఆలోచించి తన విషయం పూర్తిగా చెప్పడానికేనిశ్చయించు కున్నాడు. ఇంతలో ఇద్దరు లాబ్ అసిస్టెంట్సు వొక ఆఫీసరు అక్కడికి వచ్చారు. వారిచేతిలో కొన్ని వందరూపాయల, కొన్ని అయిదురూపాయల, కొన్ని రెండురూపాయల నోట్లు వున్నవి. వాటిని గోవర్ధనరావు ముందు పెట్టి ఆ ఆఫీసరు ఎదుటి కుర్చీలో కూర్చున్నాడు. తక్కిన ఇద్దరూ వినయంగా నిలబడ్డారు.

'వెరీ క్లియర్ మానుపులేషన్. వుయ్‌మస్ట్ రివార్డ్ ది ఆర్‌టిస్టు హు హేస్ సో ప్రిసైసెలీ కాపీడ్ ది వొరిజినల్స్' అన్నాడు ఆ ఆఫీసరు.

'వీటి తయారీ కూడా ఇక్కడేనని మీరు సర్టిఫై చేస్తున్నారా!'

'నోడౌట్. ఈ సీరియల్ నంబర్సు అన్నీ మనరాష్ట్రింలోవే.'

'ఐ. సీ. అయితే ఇవి ఇక్కడకూడా సర్క్యులేషన్లో వున్నాయో యేమో' అన్నాడు గోవర్ధనరావు.

'నో సర్‌ప్రైస్.'

'ఎందుకయినా మంచిది. దీన్ని టెస్టు చేయండి' అంటూ గోవర్ధన రావు తన పర్సులోంచి వందరూపాయలనోటు తీసి ఇచ్చాడు. ఆ అసి స్టెంటు దాన్ని అందుకుని చేత్తోనే పరీక్షించి–

'ఇది అసలుదేనండి' అన్నాడు.

'మాధవరావ్ నీ దగ్గర వందనోటుగానీ! అయిదు నోటుగాని వుంటే ఇవ్వు' అని అడిగాడు గోవర్ధనరావు. అక్కడ జరుగుతున్నది మాధవ రావు కేమీ అర్థంకావడం లేదు. గోవర్ధనరావు అడిగినందుకు తన పర్సు బయటకు తీసి అందులోవున్న వందనోట్లు రెండు అతనిచేతికిచ్చాడు.

'వీటినీ టెస్టుచేయండి' అంటూ గోవర్ధనరావు వాటిని అసిస్టెంట్స్‌కు అందించాడు. వారు వాటిని మొదట చేతితోనే పరీక్షించి, తరువాత లాబ్ లోకి వెళ్ళి పది నిముషాల తర్వాత బయటకు వచ్చారు.

'సార్! ఇవి...ఇవి...' అంటూ నసిగారు.

'కౌంటర్ ఫీటేనా?'

'అవునండీ.'

గోవర్ధనరావు తక్కిన ముగ్గురూ కూడా మాధవరావు వంక విచిత్రంగా చూడసాగారు. గోవర్ధనరావు మాధవరావును పరిచయంచేసి తరువాత అడిగారు.

'మాధవరావ్! ఈ నోట్లు నీకు యెక్కడివి' అన్నాడు.

'ఇవి నా జీతంతాలూకు వండీ!'

'నీ జీతం ఎంత?'

మాధవరావు చెప్పాడు.

'అందులో ఇవేనా మిగిలినవి?'

'అయిదువందలు నా ఖర్చులకి వుంచుకుని తక్కినవి సేవింగ్సులో వేసుకుంటాను.'

'ఏ బ్యాంకు?'

'అదే ధనలక్ష్మి సిండికేట్ బ్యాంకు... మన—'

'ఐసీ.'

'ఇవి కౌంటర్‌ఫీటా అండి' అన్నాడు కంగారుగా మాధవరావు.

'అవునండి' అన్నాడు వొక అసిస్టెంటు.

'బహుశా ఇటీవలే ఇవి ఇక్కడ ప్రచారంలోకి వచ్చి వుంటాయి. మనం వాచ్ చేయాలి' అన్నాడు గోవర్ధనరావు ఆ ఆఫీసరుతో.

మాధవరావు ఆ నోట్లను పరిశీలనగా చూడసాగాడు. మొదట

వందనోటు. తరువాత అయిదునోటు. దాని తరువాత రెండురూపాయల నోటు.

'అసలువాటిలాగే వీటిని ఎలా తయారు చేస్తారండి' అన్నాడు మాధవరావ్.

'ఎందుకూ? నీకు తయారు చేయాలని వుందా?'

'చెప్పండి ప్లీజ్' అన్నాడు అభ్యర్థనగా మాధవరావు.

అతని ప్రశ్నలో అమాయికత్వాన్ని గుర్తించాడు గోవర్ధనరావు.

'అసలు నోటు ఎలావుందో అలాగే పెద్ద సైజులో డ్రాయింగ్ వేసుకొని ఈ సైజు బ్లాకు తయారు చేసుకుంటారు. రెండు వైపులకూ విడి విడిగా బ్లాకులు చేస్తారు. రహస్యంగా వొక ప్రెస్సు వొకటి ఏర్పాటు చేసుకుని, వీలయినంతవరకూ ఈలాంటి కాగితాన్నే సంపాదించి అచ్చు వేస్తారు. పదివేలు అసలు కరెన్సీ ఇచ్చిన వారికి ఇవి ఇరవై వేలు ఇచ్చి తమ ఏజంట్లద్వారా ప్రచారంలోకి తెస్తారు' అని వివరించాడు.

'ఇది ప్రజలకూ, దేశానికీ కూడా ద్రోహం చేయడంకాదా' అన్నాడు మాధవరావు ఉద్రేకంతో.

'ఆమాట మెల్లగా అంటున్నావా! దీన్ని అరికట్టకపోతే దేశం అధో గతిపాలౌతుంది' అన్నాడు గోవర్ధనరావు.

మాధవరావు యొక్క పిడికిళ్ళు బిగుసుకుపోవడం గమనించాడు గోవర్ధనరావు. 'రోగ్స్, క్రిమినల్స్' అంటున్నాడు వున్మాదునిలా మాధవ రావు పళ్ళు కొరుకుతూ.

'మాధవరావ్, మాధవరావ్' అన్నాడు గోవర్ధనరావు నిద్రావస్థలో వున్నవాణ్ణి లేపుతున్నట్టు.

'వీళ్ళ ఆట కట్టాలి. కట్టి తీరుతాను' అంటున్నాడు పూనకంవచ్చిన వాడిలా.

'మాధవరావ్!' మళ్ళీ పిలిచాడు గోవర్ధనరావు.

'ఇంక నేను సహించను. నాకు ఎంత ద్రోహం జరిగినా భరిస్తాను గాని, దేశానికి ద్రోహంజరుగనివ్వను.'

'మాధవరావు ఇటుచూడు. ఎందుకలా ఆవేశపడి పోతున్నావు?'

మాధవరావు తెప్పరిల్లినట్టు అక్కడున్నవారిని పరికించాడు. తర్వాత 'సర్ మీతో రహస్యంగా మాట్లాడాలి' అన్నాడు.

'ఆల్ రైట్' అంటూ తక్కిన వారివంక చూశాడు గోవర్ధనరావు. అదిగమనించి వారు ముగ్గురూ గది బయటకు వెళ్ళి తలుపు చేరవేశారు. వారు వెళ్ళిపోయాక మాధవరావు కొన్ని నిముషాలు మౌనంగా వుండి తర్వాత గొంతు సవరించుకున్నాడు.

'నన్ను మీరు ఈ వూబిలోంచి బయటకు లాగుతానన్నారు. అవుతే మీకు ఈవిషయంలో నేను సహాయపడగలను. వూడలుదిగి వేళ్ళు బాగా పాతుకుపోయిన వొక విషవృక్షాన్ని మనం సమూలంగా ఖండించాలి.'

'తప్పకుండా! ఈ విషయంలో నాకు నువ్వు యేవిధంగా సహాయ పడగలవు?'

'అసలు వీటిని డ్రాయింగులు తయారు చేసిందినేను' అన్నాడు మాధవరావు. పిడుగుపాటు తిన్నట్టు చూశాడు గోవర్ధనరావు.

'కాని వాటిని తయారు చేస్తున్నప్పుడు అది ఈలాంటి ఘోరమైన కార్యానికి వుపయోగపడుతుందని తెలియదు.'

'వాళ్ళెవరో చెప్పు. ఇప్పుడే...' ఈసారి గోవర్ధనరావు ఆవేశం తెచ్చుకుంటే మాధవరావు ప్రశాంతత వహించవలసివచ్చింది. 'ఈ సంఘ విద్రోహుల్నిపట్టే ప్రయత్న మేదో అతిరహస్యంగా జరగాలండీ. వారికి యేమాత్రం ఆచూకీ తెలిసినా అంతా అండర్ గ్రౌండులోకి వెళ్ళిపోయే ప్రమాదంవుంది' అన్నాతు.

'నిజమే' అన్నాడు గోవర్ధనరావు తగ్గుస్థాయిలో.

'ఈ నాటకంలో నేను పాత్రవహిస్తున్నట్టు ఎవరికీతెలియకూడదు.'

'మరి నీవువెంటలేకపోతే యెలా సాధ్యమౌతుంది?'

'చెబుతాను- రేపురాత్రి షఫైర్ నైట్ క్లబ్బులో నా వయోలిన్ ప్రోగ్రాంవుంది. ఆక్కడికి చాలా మంది ఘరానావ్యక్తులు వస్తారు. నేను వయోలిన్ వాయిస్తూ యెవరి దగ్గర నిలబడతానో వారిని గుర్తుపెట్టుకొని వాచ్ చేయండి.'

'రేపు యెన్నింటికి రమ్మంటావు?'

మాధవరావు నవ్వాడు. 'మీరు స్వయంగావస్తే ఆట గల్లంతు అవుతుంది. కొంతమంది ఆఫీసర్స్‌ని బిజినెస్ పీపుల్‌గా మఫ్టీలో పంపండి.'

'అలాగే యేర్పాటు చేస్తాను.'

'నేను వాళ్ళను యెలా గుర్తుపట్టగలను!'

'నీవు పట్టక పోయినా ఫరవాలేదు. వారు నిన్ను గుర్తు పట్టగలరు. నీప్రోగ్రాం టైం ఎప్పుడు?'

'పది నుండి పన్నెండు వరకు.'

'ఆ ముఠా వాళ్ళు అందరూ అక్కడే వుంటారని నమ్మకంవుందా?'

'తప్పక వుంటారు. వాళ్ళ మీటింగ్ ప్లేస్ అది. కాని వొక విషయం! అందులో మీకు చాలా ఆప్తులైన వారు వుంటారేమో!'

'వుండనీ. చట్టాన్ని కాపాడ వలసిన ఆఫీసర్ని నేను.'

'ఈపని పూర్తి అయ్యాక నా విషయం చెబుతాను.'

'అలాగే.'

'ఇంక వస్తానండి. ఆఫీసుకు టైం అయింది. మీతో ఏదయినా కాంటాక్టు పెట్టుకుంటానేమోనని మాబాస్ భయం.'

'అలాగా! మీ బాస్ ఈపాటికి ఆఫీసుకు వచ్చివుంటాడా?'

'ఆఁ.'

'అవుతేవుండు' అంటూ ఫోన్ కలిపాడు. అవతలినుంచి భుజంగరావు కంఠం. 'గుడ్ మార్నింగ్ మిస్టర్ భుజంగరావ్!నేనుగోవర్ధనరావ్‌ని!'

'హలో! మీరు కులాసా?'

'ఏదో మీలాంటి వాళ్ళ దయవల్ల.'

'మీరు బలే జోక్ వేస్తున్నారు.'

'జోకేమిటండోయ్! ఇల్లు కట్టుకోడానికి మీదయలేకపోతే ఎట్లా?'

'ప్లాను పంపించి చాలా రోజులయింది. ఇంకా మీ అప్రూవల్ తెలియకపోతే నచ్చలేదేమోననుకున్నాను.'

'బలేవారండి-నేను టూర్‌లోవుండి నిన్న రాత్రే వచ్చాను.'

'అలాగా. అయితే నా అభిప్రాయం మార్చుకుంటాను. ప్లాను నచ్చిందా?'

'మీ ప్లాను నచ్చకపోవడం కూడానా! అంత ఇల్లు కట్టుకుంటే కుళ్ళి చస్తారు.'

'అదిగో మళ్ళీ ఏదో జోకు.'

'మరేంలేదు. ఎస్టిమేట్సు హైసైడ్‌లో వున్నవి. పోలీసు ఆఫీసరుగా అంత ఖరీదైన ఇల్లు కట్టుకుంటే-'

ఈసారి భుజంగరావు నవ్వాడు. 'మిమ్మల్ని అనుమానిస్తారని భయమా?'

'భయం అంటే మీరు వూహించుకునే భయంకాదు. అంత ఖర్చు నేను భరించగలనా అన్న భయం. మీ ఎస్టిమేట్సుని వొకటికి లోపలేకుదిస్తే బాగుంటుంది.'

'పైన ఇరవై వేలేగా!'

'అది మీ లాంటి వాళ్ళకు తేలికకావచ్చు. నేను చెప్పిన మేరకు కట్టుకోడమే బ్రహ్మాండంనాకు. కాస్త రివైజ్ చేయండి.'

'చాలా మార్పులు చేయాలి. అప్పుడు కుదించడానికి వీలు పడుతుందేమో!'

'ట్రై చేయండి ప్లీజ్.'

'ఆమార్పు లేవిటో మీరే చెప్పాలి.'

'అలాగా! ఈప్లాను వేసింది మాధవరావేగదా-వున్నాడా?'

'ఇంకా ఆఫీసుకు వచ్చినట్టులేదు. ఎందుకూ?'

'ఆ మార్పులేవో చెబుదామని. అతణ్ణి నాదగ్గరకు పంపిస్తే-'

'అంటే మీ ఆఫీసుకా?'

'అవును- పంపడానికి ఏదయినా అబ్జెక్షనా?'

'అలాంటిదేమీలేదు. తీరుబడితే మీరే రావచ్చుగా. ఇక్కడ అన్ని విషయాలు ప్రశాంతంగా మాట్లాడుకోవచ్చు.'

'అలాగే. కాని ఇవ్వాళ నాకు కుదరదే.'

'మీకు తీరుబడి ఉన్నప్పుడేరండి. ఎనీటైం యూ ఆర్ వెల్‌కం.

'థ్యాంక్యూ. వుంటాను.'

గోవర్ధనరావు ఫోన్ పెట్టేసి నవ్వాడు.

'ఇంక నీవు వెళ్లొచ్చు. కారు మీ ఆఫీసు సమీపంలో డ్రాప్ చేస్తుంది.'

'వద్దండీ. నేను ఆటోలో వెళ్ళిపోతాను.'

'థ్యాంక్యూ వెరిమచ్. బి బ్రేవ్. ఐ యామ్ ఆల్‌వేస్ బిహైండ్యూ' అంటూ మాధవరావుతో కరచాలనం చేశాడు గోవర్ధనరావు. మాధవరావు గుండెలమీద నుండి పెద్ద బరువు దిగిపోయినట్టయింది. మరి కాస్సేపట్లో వేకువ కాబోతున్న ఆకాశాన్ని చూస్తున్న అనుభూతితో అతడు ఇవతలికి వచ్చాడు.

# 13

పదిరోజులు గడిచిపోయినాయి. ఆనాడు వేకువజామున పనిమనిషి రాలేదని రమణయ్య భార్య కాంతమ్మ ఇంటి ముందు కసువూడ్చి కళాపు జల్లి ముగ్గు పెడుతున్నది. కాకులు ఇంకా గోలగా అరుస్తున్నవి. పాల కుర్రవాడు రెండు పాలప్యాకెట్లు అక్కడ వరండాలో పెట్టివెళ్ళాడు. కాంతమ్మ చుక్కలు కుదరక తుడిచి తుడిచి యెలాగో ముగ్గు వేశాననిపించి ఇంట్లోకి వెళ్ళబోతుండగా ఇంటి ముందు జీపు వచ్చి ఆగింది. ఎవరై వుంటా రబ్బా అనుకుంటూ వెళ్ళి గేటుతీసింది. జీపులోంచి గోవర్ధనరావు దిగాడు. ఆ వేళప్పుడు అతను రావడం చూచి ఆమె క్షణకాలం ఆశ్చర్యపోయి తేరుకుంది.

'రండి అన్నయ్యగారు ఇంత పెందరాడే వచ్చారు. ఏమిటి విశేషం' అంది లోపలికిదారితీస్తూ.

'రమణయ్యతో అర్జంటు పనివుండి వచ్చానమ్మా. ఇంకా లేవలేదా' అన్నాడు కాంతమ్మను అనుసరించి హాల్లోకి వస్తూ.

'అప్పుడేనా! ఏడున్నర దాటాలి ఆయన లేవాలంటే! అలా కూర్చో అన్నయ్యా లేపుతాను.'

'లేపమ్మా చాలా అర్జంటు పని.'

కాంతమ్మ లోపలికి వెళ్ళింది. గోవర్ధనరావు సోఫామీద అసహనంగా

కూర్చున్నాడు. కాస్సేపటికి కాంతమ్మ ఇవతలికి వచ్చింది. 'లేపాను అన్నయ్యా ఇప్పుడే వస్తారు. ఇంతలో కాఫీ చేసుకు వస్తాను.'

'అక్కర్లేదమ్మా! నేను మర్యాదలు చేయించుకోడానికి రాలేదు. మీ ఆయనతో పనుండి వచ్చాను' అన్నాడు.

అదేం పనో అర్థంగాక ఆమె అక్కడే నిలబడి చూడసాగింది. రమణయ్య షర్టుకు గుండీలు పెట్టుకుంటూ ఇవతలకి వచ్చాడు. 'హల్లో నువ్వా గోవర్ధనం! అన్నయ్య వచ్చాడని కాంతం చెబితే ఎవరా ఆ అన్నయ్య అనుకుంటూ వస్తున్నాను. ఏమిటి విశేషం?'

'చాలా పెద్ద విశేషమేలే' అంటూ గోవర్ధనరావు తన జేబులోంచి రెండు వారెంట్లు తీసి రమణయ్య చేతికిచ్చాడు. వాటిని చూసి రమణయ్య ముఖం వెలవెలాపోయింది. 'ఇవేమిటి' అన్నాడు జీరబోయిన కంఠంతో.

'కనపడ్డంలేదా? వొకటి సెర్చి వారెంటు, వొకటి అరెస్టు వారెంటు' అన్నాడు గోవర్ధనరావు.

'ఏమిటిది? నాకేమీ బోధపడడం లేదు' అన్నాడు రమణయ్య వణుకుతూ.

'బోధ పడేట్లు చేస్తాను.'

కాంతమ్మ కంగారు పడిపోతున్నది. 'నువ్వు ఇందుకోసం వచ్చావా అన్నయ్యా' అంది రుద్ధకంఠంతో.

'అవునమ్మా బంధువు, స్నేహితుడు అని స్వయంగా వచ్చాను. ఈ విధంగా రావలసి వస్తుందని నేను ఎన్నడూవూహించలేదు' అన్నాడు గోవర్ధనరావు.

'గోవర్ధనం నాకు నిజంగా ఏమీతెలియదు. నీమాటలేవీ నాకు అర్థం కావడం లేదు' అంటున్నాడు రమణయ్య. గోవర్ధనరావు చప్పట్లు కొట్టాడు. అదివిన్న నలుగురు కానిస్టేబుల్స్ వొక ఇన్స్పెక్టరూ లోపలికి వచ్చారు. 'సర్చ్ ది హౌస్' అన్నాడు గోవర్ధనరావు.

అంతే వాళ్ళు వేటకుక్కల్లా ఇంట్లోకి జొరబడ్డారు. అరగంటసేపు అక్కడ భయంకరమైన నిశ్శబ్దం. 'సార్' అని లోపలి నుండి పిలుపు వినిపించింది. గోవర్ధనరావు రమణయ్యను వెంట తీసుకొని లోపలికి వెళ్ళాడు. అత్యంత ఆధునిక పద్ధతిలో వున్న రమణయ్య బెడ్‌రూం!

అందులో వాళ్కస్టీల్అల్మైరా వెనుక వున్న గోడఅలమార! అందులో నోట్ల కట్టలు దొంతర పెట్టి వున్నది. స్టీలు అల్మైరా కూడ మారు తాళాలతో తెరిచారు. అందులో బట్టలు మాత్రమే వున్నవి. రమణయ్య గజగజ వణికి పోతున్నాడు. కాంతమ్మ శోకం లంకించుకుంది.

'ఇన్స్పెక్టర్ అరెస్ట్ హిం' అన్నాడు గోవర్ధనరావు అధికార పూర్వకమైన కంఠస్వరంతో. కాంతమ్మ గోవర్ధనరావు కాళ్ళను గట్టిగా వాటేసుకుంది. 'అన్నయ్యా, అన్నయ్యా నాకోసమైనా ఆయన్ను మన్నించి విడిచి పెట్టు అన్నయ్యా' అంటూ ఏడుస్తున్నది.

'నాకు మన్నించే అధికారం లేదమ్మా. రమణయ్యా! ఇప్పుడూ నాకు ఏమీ తెలీదనే అంటావా?' రమణయ్య మౌనంగా తలదించుకున్నాడు. ఇన్స్పెక్టరు అతని చేతులందుకొని వాటికి బేడీలు తగిలిస్తున్నాడు.

'నిజంగానే ఆయనకు ఏమీ తెలీదు అన్నయ్యా! బాంకు వాళ్ళు దాయ మని ఇచ్చారుట ఆ నోట్లు' అంది కాంతమ్మ వెక్కుతూనే.

'అందరూ తమ డబ్బును బాంకులో దాచుకుంటారుగాని బాంకు వాళ్ళు ఇంట్లో దాచమని ఇవ్వడమేమిటమ్మా? ఎవరయినా వింటే నవ్వు తారు' అన్నాడు గోవర్ధనరావు.

కాంతమ్మ నెత్తీ నోరూ మొత్తుకుంది.

'ఇప్పుడు ఎంత ఏడ్చినా లాభం లేదమ్మా-పద రమణయ్యా.'

'అన్నయ్యా! నామీదా, నా బిడ్డలమీదయినా కనికరం చూపించు.'

'చెప్పానుకదమ్మా నా అధికారం అరెస్టు చేసేవరకే. విడిపించ డానికి కోర్టునించి ఆర్డర్సు రావాలి.'

'నీవు తలచుకుంటే అవుతుందన్నయ్యా! ఎంత డబ్బు ఖర్చయినా ఫరవాలేదు.'

'మొత్తానికి రమణయ్య భార్యను అనిపించుకుంటున్నావు. ఈడబ్బు ఖర్చుకు పనికిరాదమ్మా! ఇవన్నీ దొంగనోట్లు!' ఆ సంగతి అప్పుడే తెలిసి నట్టు కాంతమ్మ నివ్వెరపోయింది. ఆ నోట్ల దొంతర్లను కానిస్టేబుల్సు జాగ్రత్తగా జీపులోకి చేర్చారు.

ఇన్స్పెక్టరు రమణయ్యను తీసుకువెళ్ళి జీపు యెక్కాడు. కాంతమ్మ భోరున యేడుస్తూ వుంటే-'ధైర్యం తెచ్చుకో కాంతమ్మా! ఇంక మన

చేతిలో యేమీలేదు' అంటూ గోవర్ధనరావు వెళ్ళి జీపులో కూర్చున్నాడు. జీపు పెద్దగా శబ్దం చేస్తూ వెళ్ళిపోయింది.

# 14

దొంగ నోట్ల కేసు విచారణ పూర్తి అయి తీర్పు కూడా ఇవ్వబడింది. దరిమిలా ధనలక్ష్మి సిండికేట్ బాంకు, మెట్రోపాలిటన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ, షఫైర్ నైట్ క్లబ్బు, కెమికల్స్ కంపెనీ కోర్టు అధీనంలోకి తీసుకోబడ్డాయి. భుజంగరావూ, రమణయ్యా, గంగులూ, మొదలయిన వాళ్ళంతా కటకటాల వెనక్కి వెళ్ళక తప్పలేదు.

మాధవరావు తను భుజంగరావు గుప్పిట్లోకి యెలా రావలసి వచ్చిందీ సంగ్రహంగా చెప్పి అతడు తనను వొక విధంగా బెదిరిస్తూ బ్లాక్ మెయిల్ చేస్తూ యెలా వుపయోగించుకున్నదీ వివరించి చెప్పాడు. భుజంగరావు ఆ విషయం అంగీకరించడంతో మాధవరావుకు విముక్తి లభించింది. ఆ తరువాత చోరీలు చేసిన వ్యక్తుల ఆచూకీ కూడా సులభంగానే బయటపడిపోయింది. ఏమయితేనేం ఈ ముఠా అంతా కటకటాల వెనక్కు వెళ్ళగా గోవర్ధనరావుకు అశ్వమేధయాగం పరిసమాప్తి చేసినట్లుగా తోచింది. అతడు హాయిగా వూపిరి పీల్చుకుని మాధవరావుకు తన కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

'నీవు గనుక మాతో సహకరించి వుండకపోతే ఈ కేసు యెప్పటికి తెమిలేదో' అన్నాడు.

'నేనే మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆ వూబిలోంచి నన్ను బయటకు లాగారు' అన్నాడు ఎంతో వినయంతో.

'ఇప్పుడు నీ ప్రోగ్రాం' అన్నాడు గోవర్ధనరావు.

'ఈ కేసు మూలంగా నా విషయాలు మీకు కొన్ని తెలిసేవుంటాయి' అని ఆగాడు మాధవరావు.

'అవును-తెలిసింది. నీ అసలు పేరు మాధవరావు కాదని కూడా'

'నిజమే—కొన్ని కారణాలవల్ల మా వాళ్ళకు దూరంగా వెళ్ళిపోవలసి వచ్చింది. తరువాత వాళ్ళు యేమయ్యారో కూడా నాకు తెలియదు.

వాళ్ళ ఆచూకీ తెలుసుకోడానికి ముందు మా ప్రాంతాలకు వెళ్ళాలి. ఇది నా మొదటి ప్రోగ్రాం—'

'తరువాత—'

'మీరు కట్టుకోబోయే ఇంటికి చక్కటి ప్లాను ఇవ్వడం...'

'ఇచ్చావుగదా!'

'అది నేను వేసిన ప్లానుకాదు. భుజంగరావు వేరొకరిచేత వేయించింది. నేను మీకెక్కడ దగ్గరయిపోయి అతని వ్యవహారాలన్నీ బయట పెట్టేస్తానో అన్న భయం పట్టుకుంది అతణ్ణి.'

'ఐ.సీ—తరువాత ఉద్యోగం సంగతి!'

'నాకెలాగూ గవర్నమెంటు ఉద్యోగం దొరకదు. ఈ విధంగా వాళ్ళ చేతులలో ఇరుక్కోవడం కంటే చేతిలో ఆర్టు వుంది. స్వంతంగా అడ్వర్‌టైజ్‌మెంటు కంపెనీ పెట్టుకోవడం మంచిదనిపిస్తోంది. అలాగే చేస్తాను.'

'ఐసీ! అయితే వూరికి ఎప్పుడు వెడుతున్నావు?'

'ఈ రాత్రే!'

'ఐసీ. సాయంకాలం కాస్త వీలుచేసుకుని మా ఇంటికిరా!'

'నేనా అండి. మీ ఇంటికా అండి' అంటూ మాధవరావుతడబడ్డాడు.

'ఎందుకలా కంగారు పడతావు మాధవరావ్! ఈరోజు మా మాలతి పుట్టిన రోజు. అందుకని పార్టీకి ఆహ్వానిస్తున్నాను.'

'కాని...కాని—'

మాధవరావు మాట్లాడలేక తలదించుకున్నాడు. గోవర్ధనరావు చిన్నగా నవ్వాడు. 'నీసంకోచం యేమిటో నాకు తెలుసు మాధవరావ్! ఈ రోజు నీవు మా యింటికి తప్పక వస్తున్నావు.'

'సర్!'

'ఐ లైక్ యూ మాధవరావ్! నీ విషయాలు నేను చెప్పి మాలతినీ వాళ్ళ అమ్మనీ కన్విన్స్ చేయవచ్చుకానీ, అవి నీ ముఖతః వాళ్ళు వినడమే మంచిది. అదీగాకుండా నీ మనసులో విషయాలు, కాంప్లెక్సులూ బయటకు చెప్పకుంటే నీ మనసూ తేలికపడుతుంది. నిన్ను అంగీకరించేదీ లేనిదీ వాళ్ళ నిర్ణయానికి వదిలేస్తాను.'

కొన్ని నిముషాలు అతనుగోవర్ధనరావు వంకనిర్నిమేషంగాచూశాడు. 'మీది చాలా గొప్ప హృదయమండి. సాయంకాలం మీయింటికి తప్పకుండా వస్తాను. నాకు మాలతి అంటే యెంతో ఆరాధనా భావం. ఆమె నా పూర్వాపరాలు తెలుసుకోవడం చాలా ముఖ్యం. అందుకు మీరు అవకాశం కల్పిస్తున్నందుకు మీకెంతయినా ఋణపడివుంటాను' అన్నాడు.

"సాయంత్రం నీ కోసం వెయిట్ చేస్తూ వుంటాను.'

'అలాగే సర్.'

ఆనాడు సాయంకాలం నాలుగింటికే గోవర్ధనరావు ఇంటికి వచ్చాడు. మాలతికీ ఆనాడు కాలేజీ సగంపూట సెలవు యివ్వడంతో ఇంటి దగ్గరే వున్నది.

'మాలతీ! నీకో గుడ్‌న్యూస్' అన్నాడు ఆమెను చూస్తూనే.

'ఏమిటి నాన్నా?'

'మాధవరావును మనింటికి పార్టీకి ఇన్వాయిట్ చేశాను.'

'పార్టీనా? ఏం పార్టీ?'

'వుత్తి పార్టీనే! నీకు పుట్టిన రోజు అని చెప్పాను. అయిదింటికి వస్తాడు.'

'నెల్రకితమేగా నాకు పుట్టిన రోజయింది.'

'అయితేనేం! ఈ రోజు నీకు నిజమైన పుట్టినరోజు. అతడు నీకు దూరంగా వుండటానికి బ్యాక్గ్రౌండ్ చాలా వుంది. అదంతా వివరిస్తాడు.'

'నిజంగానా నాన్నా! అతడు నన్ను—'

'నీమీద అతనికి పూర్తిగా మనసుందమ్మా. కాని—'

'ఏమిటి నాన్నా?'

'అతని నోటి ద్వారా అతని కథ విన్నాక నీవు యే విధంగా నిర్ణయం తీసుకుంటావు అనేది నీకే వదిలేస్తానమ్మా!'

మాలతి మీద పన్నీటిజల్లు కురుస్తున్నట్టుంది.

'అతనికోసం యేమైనా మంచి టిఫిను చేయించమ్మా.'

'ఇంకా అరగంటకూడా లైంలేదు. ఏం చేయించను నాన్నా?'

'మీ సుభద్ర ఆంటీకి తెలుసు యేం చేయాలో! ఆమెకు చెప్పి నీవు

త్వరగా డ్రెస్ చేసుకో. చూడు మాలతీ అమ్మను మాత్రం కాస్త సస్పెన్సు లోనే వుంచుదాం' అన్నాడు.

మాలతి నవ్వుకుంటూ లోపలకు వెళ్ళింది.

'అత్తయ్యా' అంది గారెలకు పిండి రుబ్బుతున్న సుభద్రతో.

'ఏమిటమ్మా?'

'అయిదింటికి యెవరో గెస్టు వస్తున్నారట! ఏదయినా స్వీటూ- కారా తయారుచేయమన్నారు.'

'స్వీటా?'

'అవునత్తయ్యా! యేదయినా మంచిది.'

'అలాగేనమ్మా!' అంది సుభద్ర.

మాలతి ఇవతలికి వస్తూంటే వరలక్ష్మమ్మ అక్కడికి వస్తూ ఆ మాటలు విన్నది.

'ఎవరే ఆ వచ్చేది' అంది.

'ఏమో నాకూ తెలీదమ్మా - నాన్నగారు చెప్పమంటే చెప్పాను' అంటూ పైకివస్తున్న నవ్వును ప్రయత్నంమీద అణుచుకుంటూ తనగదిలోకి వెళ్ళిపోయింది మాలతి.

ఇన్నాళ్ళ తరువాత కూతురు ముఖంలో కనిపిస్తున్న దీప్తికి కారణం యేమిటో ఆమె వూహించుకోలేక పోయింది. మాధవరావు వస్తున్నాడు. తమ ఇంటికి వస్తున్నాడు అని పదే పదే అనుకుంటూ మాలతి హృదయం పరవళ్లు తొక్కసాగింది. ఆమె డ్రెస్ చేసుకుంటూనే అయిదు ఎప్పుడు అవుతుందాఅని వాచీవంక చూసుకుంటోంది. మాధవరావు సరిగ్గా అయిదింటికి చేతిలో వొక బహుమతి బంగీతో వచ్చాడు. మాలతీ, గోవర్ధనరావూ హాల్లోనే కూర్చుని అతని రాకకోసం యెదురుచూస్తూ వున్నారు.

మాధవరావును లోపలికి ఆహ్వానిస్తున్న శబ్దంవిని వరలక్ష్మమ్మ అక్కడికి వచ్చింది. భర్తకు స్నేహితుడూ అంటే ఆమె యే యాభై ఏళ్ళ వ్యక్తినో వూహించుకున్నదిగాని మాధవరావు లాంటి యువకుణ్ణి గాదు.

మాధవరావు వస్తూనే 'హేపీ బర్త్ డే టూ యూ' అంటూ తన చేతిలో బంగీని మాలతికి అందిచ్చాడు.

'థాంక్యూ' అంది మాలతి దాన్ని అందుకుంటూ.

'కూర్చోవోయ్' అన్నాడు గోవర్ధనరావు.

మాధవరావు ఒకసోఫాలో కూర్చుంటే మాలతి అతనికెదురుగా వున్న సోఫాలో కూర్చుంది. ఆతురతతో ఆబంగీని విప్పింది. అది పెయింటింగు. 'దరిజేరిననావ.' తన వూహమేరకు అతడు ఆ చిత్రాన్ని పూర్తి చేశాడు. తుఫాను భీభత్సంలో ఇద్దరు పిల్లలను వొడి దగ్గర కూర్చో బెట్టుకొని, ప్రయాసతో గెడవేస్తూ దాదాపు వొడ్డుకు చేరుస్తున్నది నావను. ఆమె ముఖం అలసినట్టువున్నా కనులలో ధైర్యం ఆత్మవిశ్వాసం గోచరిస్తున్నవి.

'మొత్తానికి చిత్రం పూర్తి చేశారు' అంది.

'ఇప్పుడెలా వుంది?'

'చాలా బాగుంది.'

వాళ్ళను అయోమయంగా చూస్తూవున్న భార్యను లోపలికి తీసుకు వెళ్ళాడు గోవర్ధనరావు.

'వాళ్ళకు టిఫిను పట్రా. అన్నట్టు కుర్రవాడు ఎలావున్నాడు?' వరలక్ష్మమ్మ మరీ విస్తు పోయింది.

'కుర్రవాడికేం నిక్షేపంలా వున్నాడు. కాని మీ వుద్దేశం యేమిటి?'

'పెళ్ళి చూపులు.'

'ఏమిటి! నాకు మాట మాత్రమైనా చెప్పలేదే!'

'ఆసంగతి వాళ్ళకూ తెలీదు. కుర్రవాడు నాకు నచ్చాడు. మాలతి అతణ్ణి ఇదివరకే చూసింది. తక్కినవిషయాలు తరువాత మాట్లాడుకుందాం! టిఫిను నీకూ నాకూ కూడా పట్రా.'

బాగానే వుంది వరుస అనుకుంటూ వరలక్ష్మమ్మ లోపలికివెళ్ళింది. గారెలకోసం రుబ్బుతున్న మినప్పిండినే మరికాస్త మెత్తగారుబ్బి, జాంగ్రీలు తయారుచేసి అరటికాయ బజ్జీలు వేసి, కాఫీ ఫ్లాస్కులో పోసివుంచింది సుభద్ర అప్పటికే. వాటిని నాలుగు ప్లేట్లలోపెట్టి ట్రేలోసర్ది వరలక్ష్మమ్మ చేతికిచ్చి 'కాఫీ తరువాత తీసుకువెడుదురుగాని' అంది.

'అమ్మా సుభద్రా! ఆ అబ్బాయిని నీవుకూడాచూసి నీఅభిప్రాయం చెప్పమ్మా! కొత్తరకం పెళ్ళిచూపులు యేర్పాటు చేశారు మీ అన్నయ్య' అంది వరలక్ష్మమ్మ.

'మీరందరూ చూస్తే చాలదా అమ్మా!'

'నీవూ చూడు. ఇందులో తప్పేముంది? అతనెవరో, అతని వివరాలేమిటోకూడా తెలీదు. ఏమిటో' అనుకుంటూ ట్రే తీసుకొని ఇవతలికివచ్చి దాన్ని టీపాయ్‌మీద పెట్టింది.

'ఈయనే మాధవరావని, మన ఇంటికిప్లాను వేసేది' అన్నాడు గోవర్ధనరావు వరలక్ష్మమ్మతో. అప్పుడర్థమైంది ఆమెకు విషయం.

'నమస్కారమండీ' అన్నాడు మాధవరావు లేచినిలబడి.

'ఫరవాలేదు కూర్చోనాయనా' అంటూ తనూ మాలతి పక్కన కూర్చుంది వరలక్ష్మమ్మ. మాలతి అందరికీ టిఫిన్ ప్లేట్లు అందించి తనూ వొకటి తీసుకుని కూర్చుంది. మాధవరావు ప్లేటులోవున్న జాంగ్రీ వైపూ, బజ్జీలవైపూ పరిశీలనగా చూస్తూ తినడం ప్రారంభించాడు.

'అన్నట్టు మీదేవూరు బాబూ! మీ నాన్నగారు ఏం చేస్తుంటారు' అన్నది వరలక్ష్మమ్మ.

'మా వూరి పేరూ...మా నాన్నగారి పేరూ మాత్రం చెబితే చాలదండీ. నా కథ చాలా చెప్పాలి. అదంతా వినే వోపిక మీకు వుందోలేదో' అన్నాడు మాధవరావు.

'నీ విషయాలు పూర్తిగా చెప్పు మాధవరావ్. ఫరవాలేదు. మాకు వినే వోపిక వుంది' అన్నాడు గోవర్ధనరావు. మాధవరావు కాఫీ తాగిన తరువాత సర్దుకుని కూర్చున్నాడు, తన గత విషయాల కథనానికి—

# 15

సుభద్ర డైనింగ్ హాల్ కిటికీలోంచి మాధవరావును చూసింది. వొక్కసారి వులిక్కి పడింది. ఇతడు ఈ మాధవరావు-మనసులో యేదో ఉద్విగ్నత! వొక్కసారి వెళ్ళి అతణ్ణి...అంతలో తన పరిధి గుర్తుకు వచ్చింది. తానీ ఇంటిలో వంట మనిషి! అతడు-అతడు ఈ ఇంటికి కాబోయే అల్లుడు. ఇంతలో మాధవరావు తన కథను ప్రారంభించాడు.

'నా అసలు పేరు మోహన్‌కుమార్. నన్ను ప్రసవించిన కొన్నా

ళ్ళకే నన్ను కన్నతల్లి ఈ లోకం విడిచి వెళ్ళిపోయింది. కాని నాకాసంగతి బాగా వూహ వచ్చినదాకా కూడా తెలియదు. నన్ను తన ప్రాణంలో ప్రాణంగా పెంచుతున్న వ్యక్తి నా మారుటి తల్లి అన్న విషయం యాదృచ్ఛికంగానే బయటపడిందిగాని లేకపోతే ఈ జన్మంతా కూడా తెలిసి వుండేది కాదు—'

సుభద్ర తన కళ్ళను గట్టిగా మూసుకున్నది. అవును. అతడు చెప్పే విషయాలు అతనికి వూహ తెలిసిన దగ్గరనుండే. అతను గమనించినంత వరకే. అతని కథనంతో పాటు ఆమె ఆలోచనలూ గతంలోకి వెళ్ళినాయి.

* * * *

జయరాం మెడికల్ రిప్రసెంటేటివ్‌గా పని చేస్తున్నాడు. అతనితల్లీ తండ్రి తప్ప చెప్పుకోదగ్గ బంధువులు యెవరూలేరు. అతడు పుట్టిందీ పెరిగిందీ ఇంటర్ వరకూ చదివింది అంతా తెనాలిలోనే. వారు వుంటున్న డాబా ఇల్లు తప్ప ప్రత్యేకమయిన ఆస్తి యేమీ లేదు. జయరాంకు వూర్లు తిరగడం అంటే సరదా. అందుకనే ఇంటర్ పూర్తి కాగానే మెడికల్ రిప్రసెంటేటివ్‌గా వొక కంపెనీలో వుద్యోగం వస్తే చేరిపోయాడు. అతనికి వుద్యోగం దొరకగానే పెళ్ళి కూడా జరిగిపోయింది. త్వరలో మనవణ్ణో, మనవరాలినో యెత్తుకోవాలని అతని తలిదండ్రులు యెంతో సంబరపడ్డారు. కాని ఆ ఆశ తీరకుండానే వొకరి తరువాత వొకరు వెళ్ళిపోయారు. వారు పోయిన సంవత్సరం తరువాత జయరాం భార్య భాగ్యలక్ష్మి గర్భం ధరించింది. అప్పటికే జయరాంకు వివాహం జరిగి ఆరేడేళ్ళు అయిపోయింది. ఇంత వరకూ సంతానం కలగకపోతే తనకింక ఆ యోగం లేదేమోనని అతడు ఆందోళన పడసాగాడు. కాని ఇప్పుడతని బెంగ తీరిపోయింది.

భాగ్యలక్ష్మి పురిటికి పుట్టింటికి రేపల్లెకు వెళ్ళింది. ప్రసవం అతి కష్టంమీద జరిగింది. దాంతో ఆమె ఆరోగ్యం బాగా దెబ్బతిని పుట్టిన పిల్లవాడికి రెండో నెల తిరిగేలోగా ఆమె కన్ను మూసింది. జయరాం బ్రతుకు వొంటరిదయిపోయింది. పిల్లవాణ్ణి అత్తవారింట్లోనే వుంచాడుగాని, వారు అతణ్ణి మరో పెళ్ళి చేసుకుని పిల్లవాణ్ణి తీసుకువెళ్ళమని వొత్తిడి చేయసాగారు. ఆ పిల్లవాణ్ణి చూస్తూ వుంటే పోయిన తమ కూతురు గుర్తుకు

వచ్చి వారి కడుపు తరుక్కుపోతుందట. చిన్నతనంలోనే విధురుడయిన జయరాంకు వెంటనే సంబంధాలు రాసాగినాయి. తనకు లేకలేక వొక్క కుర్రవాడు కలిగాడు. ఆ వచ్చే భార్య వీడ్ని యెలా చూసుకుంటుందోనని అతని మనసు ఆందోళన పడింది. కాని తన కొడుకు చాలా అదృష్టవంతుడు. మంచి మనసుగల మారుటితల్లిని సంపాదించుకోగలిగాడు. తన జీవితమూ మోడుబారిపోకుండా మరో భాగ్యలక్ష్మిని తీసుకువచ్చాడు. కొడుక్కి మోహన్‌కుమార్ అని ముద్దుగా పేరు పెట్టుకున్నారు. రోజులు గడుస్తున్నవి. మోహన్‌కుమార్‌ను అతి గారాబంగా తన ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటున్నది లక్ష్మి. 'మరీ నీ ప్రేమ అంతా వాడిమీదే వొలకబోయకు. నేను కూడా వున్నాను' అనేవాడు జయరాం.

అన్నప్రాశనం దగ్గరనుండీ అక్షరాభ్యాసం వరకూ మోహన్ కుమార్‌కు జరపవలసిన వేడుకలన్నీ యెంతో ముచ్చటగా జరిపించింది లక్ష్మి. ఆమె ఆ పిల్లవానికి సవతి తల్లి అని వేలెత్తి చూపే ఆస్కారం చుట్టు పక్కల వారికి యెవరికీ లేకుండా ఆమె నడుచుకుంటున్నది. అంతే గాదు ఇరుగుపొరుగు వారికీ ఆమె అంటే యెంతో అభిమానం యేర్పడింది. ఆమె కాలక్షేపానికి మిషను కుట్టడం నేర్చుకున్నది. దానితో ఆమెకు వూపిరి సలపని పని. ఇరుగుపొరుగు వారికి జాకెట్లూ, చిన్న పిల్లలకు చొక్కాలూ గౌనులూ కుట్టిపెట్టేది. పిల్లవాడికి అయిదో యేడు వెళ్ళబోతూ వుండగా వాడ్ని దగ్గరే వుండి స్కూల్లో చేర్పించింది. కొట్టిపోసినట్లు మాట్లాడేవాడు. స్కూల్లో రాయించిన అక్షరాలు పొందికగా పలకమీదగాని నోటుబుక్కులోగాని రాసేవాడు. చిన్న చిన్న పద్యాలు, ఎక్కాలు చెప్పింది చెప్పేవాడు.

లక్ష్మి సంబరమే సంబరం. పిల్లవాడికి చక్కదనంతోపాటు తెలివి తేటలు కూడా దేవుడు బాగా ఇచ్చినందుకు ఆమె యెంతో మురిసిపోయింది. ఇటువంటి కొడుకును చూసుకుని మురిసిపోయే భాగ్యం వాడ్ని కన్నతల్లికి లేకపోయినందుకు ఆమె మనసు అప్పుడప్పుడూ బాధపడుతూ వుండేది. మోహన్‌కుమార్ ఎంత అల్లరి చేసినా వాడిమీద చెయ్యి వెయ్యడానికి ఆమెకు మనసు వచ్చేదికాదు. వాడు అడిగిందల్లా ఇస్తూ వున్నా వొకోసారి

యేదో మొండికెత్తేవాడు. అయినా వాడ్ని యేదో విధంగా బుజ్జగించేది. ఇటువంటి సమయంలోనే జయరాంకు లక్ష్మిమీద చాలా కోపం వచ్చేది.

'లక్ష్మి వాడ్ని నువ్వాన్నా మందలించు. లేకపోతే నేను మందలించి నప్పుడు అడ్డు రాకు' అనేవాడు.

ఆమె మౌనంగా వుండిపోయేది. ఆమె మనసులో యెన్నో భావ నలు. ఇన్నేళ్ళకు ఆమె కడుపులో కొత్త ప్రాణి కదులుతున్న సూచనలు. ఈ శుభవార్త భర్తకు యెలా చెప్పడం.

ఆ రోజు అతను టూర్ నుండి వచ్చాడు. అతనికి చాలా ఇష్ట మయిన అరటికాయ బజ్జీలు, జాంగ్రి తయారు చేసింది. మోహన్‌కూ అవి అంటే చాలా ఇష్టం. భర్తకు టిఫినుపెట్టి సిగ్గుపడుతూ దగ్గర కూర్చుంది.

'ఏమిటి విశేషం? ఇవి నేను అడక్కుండానే తయారుచేశావు' అన్నాడు.

ఆ సమయంలో పక్కనున్న మోహన్ అన్నాడు.

'అమ్మా! మా క్లాసులో రామం అనే అబ్బాయి వున్నాడు. వాడికో చెల్లాయి పుట్టిందటనే-నాకూ వో చెల్లాయి కావాలే అమ్మా!' అని.

జయరాం కొంటెగా చూశాడు. లక్ష్మి ముఖం ఎర్రబారిపోయింది.

'మొదట మనం వాయిదా వేశాం. తరువాత దేవుడు వాయిదా వేస్తు న్నాడు. నీ ముద్దుల కొడుక్కి యేం సమాధానం చెబుతావో చెప్పు' అన్నాడు.

'తమ్ముడో, చెల్లెలో వాడి కోరిక తీరుస్తానులెండి' అన్నది.

'ఏమిటేమిటి' అన్నాడు జయరాం యెగిరి గంతేసినంతపనిచేసి.

'అవునండీ' అంది తలదించుకుని లక్ష్మి.

'ఒరే మోహన్ నీకు తమ్ముడు కావాలా, చెల్లాయి కావాలా' అడి గాడు.

'నాకు ఇద్దరూ కావాలి' అన్నాడు మోహన్.

ఇద్దరూ గొల్లున నవ్వారు. వాళ్ళు యెందుకు నవ్వుతున్నారో అర్థం గాక వాళ్ళ నవ్వుతో శృతి కలిపాడు. ఈ విషయం జయరాంకు యెంతో ఆనందాన్ని కలగజేసినా మనసులో వొక ప్రక్క భయమే. మోహన్ తల్లి గుర్తుకు వచ్చి మనసులోనే దేవుడికి దణ్ణం పెట్టుకునేవాడు లక్ష్మికి

సుఖప్రసవం కావాలని. లక్ష్మికి పుట్టింటికి వెళ్ళి పురుడు పోసుకునే ఆస్కారం లేదు గనక ఆమెకు నొప్పులు రాగానే అక్కడే హాస్పిటల్లో అడ్మిట్ చేశాడు. కాన్పు కష్టంమీదే జరిగింది. ఈసారి తల్లి ప్రాణానికి అపాయం లేకపోయినా పుట్టిన ఆడబిడ్డ కొన్ని గంటలసేపుకన్నా యెక్కువ బతకలేదు. చెల్లెలి కోసం యెదురు చూసిన మోహన్‌కు నిరాశే కలిగింది. లక్ష్మి కంటతడి పెట్టుకుని ఆ పసివాడ్ని వోదార్చింది.

'దిగులు పడకు లక్ష్మీ! మనకింతే ప్రాప్తం అనుకుందాం. నీవు క్షేమంగా బయటపడ్డావు నాకంతే చాలు!' అన్నాడు జయరాం.

రోజులు యదాలాపంగా గడిచిపోతున్నవి. మోహన్ ఏడవ తరగతికి వచ్చాడు.

డ్రాయింగు వెయ్యడంలో, మ్యాపులు వెయ్యడంలో యెంతో శ్రద్ధా నేర్పా కనపరుస్తున్నాడు మోహన్. పత్రికల్లో ప్రచురితమయ్యే పువ్వులు, జంతువులు, కొన్ని క్లోసప్ చిత్రాలు మొదలయిన వాటిని డ్రాయింగు పేపరు మీద దించి చక్కగా వేయగలుగుతున్నాడు. ఇది చూచి లక్ష్మి యెంతో మురిసిపోయేది. ఇన్నాళ్ళ తరువాత లక్ష్మి మళ్ళీ గర్భవతి. సరిగ్గా మోహన్ పరీక్షల సమయానికే ఆమెకు పురుడు వచ్చి ఆడపిల్లను యెక్కువ కష్టం లేకుండానే కన్నది. చదువులో యెంతో చురుకుగా వున్నట్టు కనిపించే మోహన్ ఆ సారి పరీక్ష తప్పాడు. కాని ఆ విషయం ఇంట్లో చెప్పడానికి భయపడ్డాడు. ఆ రోజు వుదయం బజారుకు వెళ్ళి ఇంటికి వచ్చిన జయరాం రుసరుసలాడుతూ 'ఒరే మోహన్!' అని గట్టిగా కేక పెట్టాడు.

ఆ సమయంలో మోహన్ కాగితాలు కత్తిరించి యేదో తయారుచేసే ప్రయత్నంలో వున్నాడు. లక్ష్మి పసిబిడ్డకు పాలు పడుతోంది. ఎన్నడూ లేని భర్త రూక్ష కంఠం విని ఆమె అదిరి పడింది. మోహన్ మాత్రం ఆ స్వరానికి అర్థం గ్రహించినట్టున్నాడు. బిక్క మొహం వేసుకొని తండ్రి యెదుటికి వచ్చి నిలబడ్డాడు.

'ఏమిటండీ!' అన్నది లక్ష్మి భర్తను సమీపించి.

'వాడు ఈసారి పరీక్ష తప్పిన సంగతి నాకు ఎందుకు చెప్పలేదు' అన్నాడు జయరాం కోపంతో భార్యవంక చూస్తూ.

'తప్పాడా? వాడు తప్పడమేమిటండీ! యెవరు చెప్పారు మీకు' అంది అయోమయంగా.

'రంగనాథం మేష్టారు చెప్పాడు. "వాడు లెక్కల్లోనూ, ఇంగ్లీషు లోనూ చాలా పూర్‌గా వున్నాడని ప్రతినెలా ప్రోగ్రెస్ రిపోర్టులో రాస్తున్నా మీరు పట్టించుకోనేలేదు. అనవసరంగా వొక సంవత్సరం వృథా అయింది" అని.'

మోహన్ కంట జలజల నీరు కారుతున్నది.

'పీడి ప్రోగ్రెస్ ఎప్పుడయినా చూశావా నువ్వు? నేనింత వరకూ వొక్కసారి కూడా చూడలేదు.'

'మీరు చూస్తున్నారేమోనని నేనూ చూడడం లేదండీ. ఏం మోహన్ ప్రోగ్రెస్ ఇచ్చారా ఈసారి' అడిగింది లక్ష్మి. ఇచ్చారు అన్నట్టు తల ఆడించాడు మోహన్.

'అలా దిక్కులు చూస్తావేరా! తీసి చూపెట్టు!' కసిరాడు జయరాం!

'ఉండండి! మీరు వాడ్ని మరీ భయపెట్టేస్తున్నారు.'

'నీవిట్లా వెనకేసుకొచ్చే వాడిలా తయారయ్యాడు-బుద్ధిమంతుడు బుద్ధిమంతుడు అని మురిసిపొయ్యేదానివి. ప్రోగ్రెస్ తియ్యరా! మార్కులు ఎలా తగలడ్డాయో చూద్దాం.'

ఏదో పుస్తకంలో దాచిన తన ప్రోగ్రెస్ కార్డును బయటకు తీసి తండ్రి చేతికి ఇచ్చాడు. వాడు నిలువునా వణికిపోతున్నాడు. జయరాం పరి శీలనగా చూస్తున్నాడు దాన్ని. ప్రతి నెలా క్లాసు పరీక్షలు పెడుతూనే వున్నారు. లెక్కల్లోనూ, ఇంగ్లీషులోనూ నూటికి పదిహేను దాటడంలేదు. తక్కిన సబ్జెక్టులలోనూ అత్తెసరు మార్కులే. వొక్క డ్రాయింగులో మాత్రం ఫస్టు మార్కు వీడిదేలా వుంది. రిమార్కుల కాలంలో ప్రతినెలా 'ఇంకా శ్రద్ధగా చదవాలి' అని యెర్ర సిరాతో రాస్తూనే వున్నారు.

'చూడు' అన్నాడు ఆ కార్డును భార్యచేతి కందిస్తూ.

లక్ష్మి దాన్ని పరిశీలించింది.

'అదేమిటండీ ప్రతినెలా మీరు లక్షణంగా సంతకంపెట్టి పంపిస్తూ దాన్ని అసలు చూడనేలేదని బుకాయిస్తారేం' అంది.

తాను వొక్కసారయినా చూడని ప్రోగ్రెస్ కార్డులో తన సంతకమా? జయరాంకు అయోమయంగా వున్నది.

'లక్ష్మి వొక మాట అడుగుతాను నిజం చెప్పు' అన్నాడు ఎర్రబడ్డ కళ్ళతో.

'అడగండి' అంది ఆమె కూడా కాస్త భయపడుతూ.

'వీడిమీద నీవు చాలా శ్రద్ధ చూపిస్తున్నావని వీడి చదువు విషయం కూడా నేను పట్టించుకోడం లేదు. ఇంతకు ముందు క్లాసులో ప్రోగ్రెస్‌లు నీవే చూచేదానివి కదా.'

'అవును. మీరు టూర్‌ల మీద వుంటారు గనక నేనే చూచి సంతకం పెట్టేదాన్ని.'

'మరి ఈసారి?'

లక్ష్మి కాస్త తటపటాయించింది. కాని పిల్లవాడి పరిస్థితి విషమించింది. వాడ్ని సరయిన మార్గంలో పెట్టడం తమ బాధ్యత. ఇంక తను వెనక్కేసుకువచ్చి లాభంలేదు. 'ఈసారి నించి నాన్నగారి సంతకమే కావాలటమ్మా. నాన్నగారి దగ్గరే తీసుకుంటాను' అంటే సరే కాబోలునను కుని వూరుకున్నాను. ఇదివరకు క్లాసుల్లోనూ లెక్కల్లో, ఇంగ్లీషులో తక్కిని వాటికంటే కాస్త తక్కువగానే వుండేవి మార్కులు. కాని ఇంత అధ్వాన్నంగా మాత్రంకాదు. అయితే ఇవి మీ సంతకాలు కావా?' అన్నది వున్న విషయం చెబుతూ లక్ష్మి.

'లక్ష్మి ఇవి నా సంతకాలేకాని, నేను పెట్టినవి మాత్రంకావు. వేలెడు లేడు అప్పుడే వీడు ఎంతకు తెగించాడు!'

జయరాం కళ్ళు చింత నిప్పుల్లా వున్నవి. నడుముకు వున్న బెల్టును వూడదీశాడు. లక్ష్మి భయపడి అడ్డు రాబోయింది. 'లక్ష్మి! నువ్వు తప్పుకో. వీడి తోలు వొలుస్తాను ఈనాడు.'

బెల్టు మోహన్ వీపుమీద ఛెళ్ళుమంది. వాడు కెవ్వుమన్నాడు. మరో దెబ్బ-'అమ్మా!' మోహన్ కేక-ఇంకో దెబ్బ-'అమ్మా!' మోహన్ కేక.

లక్ష్మి ఇంక తట్టుకోలేక అడ్డుగా నిలబడి జయరాం చేతిని గట్టిగా

పట్టుకుంది. 'ఏమిటండీ! వాడు చేసింది ఏమంత తప్పు పని అని ఇట్లాచావ బాదుతున్నారు' అంది.

'పెద్ద తప్పా అని మెల్లగా అంటున్నావా! రేపు చేతులకు బేడీలు వేసి జైల్లోకి తోస్తేగాని నీకు తెలిసిరాదు.'

'చాల్లెండి మీ అర్థంలేని మాటలు-'

'ఇలా చేయడాన్ని ఫోర్జరీ అంటారు తెలుసా? ఇది ఇంటి విషయం గనుక సరిపోయింది. ఈ అలవాటును మొక్కలోనే తుంచకపోతే ఈ జన్మలో వీడు యెన్ని ఘోరాలయినా చేస్తాడు తెలిసిందా?'

లక్ష్మి మోహన్‌ను గట్టిగా వాటేసుకుంది. ఆమెకూ దుఃఖం ఆగకుండా వస్తున్నది. 'తక్కువ మార్కులు వచ్చినందుకు భయపడి అలా చేసి వుంటాడు. అది యెంతటి భయంకరమయిన తప్పో వాడికి అర్థమయ్యేట్టు చెప్పి ఇక ముందు ఇలాంటి పని చేయకుండా చూసుకునే బాధ్యత నాది సరేనా-'

మోహన్ అప్పటికే సొమ్మసిల్లి పోయాడు. అతడ్ని భుజంమీదకు యెత్తుకుని లోపలకి తీసుకువెళ్ళి మంచంమీద పడుకోబెట్టింది. జయరాం ఉగ్రస్వరూపం ఇంకా శాంతపడలేదు. 'ఏమో ఎట్లా ఆఘోరిస్తావో! వాడు బాగుపడ్డా, చెడ్డా ఆ పేరు నీకే దక్కుతుంది' అంటూ విసవిసా వీధిలోకి వెళ్ళిపోయాడు జయరాం.

మోహన్ వీపుమీద వాతలు తేలి వున్నాయి. పల్చగా వాటిమీద కొబ్బరి నూనె రాసింది. వాడి ముఖాన్ని చన్నీళ్ళతో తుడిచింది. వాడు ఏడుస్తూనే కళ్ళు తెరిచాడు, 'మరెప్పుడూ చేయను నాన్నా, కొట్టకునాన్నా' అంటూ.

లక్ష్మి వాడ్ని గుండెలకు హత్తుకుంది. 'ఇంక కొట్టరులే నాన్నా' అంటూ లోపలికి వెళ్ళి వొక గ్లాసులో పాలు తీసుకువచ్చి వాడిచేత తాగించింది. కొన్ని నిముషాలకు మోహన్ వూరడిల్లాడు. కాని దెబ్బల బాధకు మూలుగుతూనే వున్నాడు.

'నాన్నలాగా సంతకాలు నువ్వే పెట్టావా మోహన్' అనడిగింది.

'అవునమ్మా-వొక్క నాన్న సంతకమే యేమిటి యెవరి సంతకమయినా వొకసారి చూస్తే చాలు. ఇట్టె చేసెయ్యగలను. ఎవరు ఎలారాస్తే

అలా రాయగలను...' అతని కంఠంలో ఆ ప్రజ్ఞ తనకున్నందుకు గర్వం ధ్వనించింది. లక్ష్మి ఆశ్చర్యంగా వింది. ఇది నిజంగా అతని ప్రతిభకు నిదర్శనమే అయినా ఆరోగ్యకరమయిన లక్షణంకాదు. ఆమె చాలా సేపు ఆలోచించింది. ఇదేదో గొప్ప తెలివి అని మురిసిపోతున్న ఆ చిన్నారి మనసుకి ఈ విషయం చట్ట విరుద్ధమని యెలా చెప్పడం?

'మోహన్! నేను నీకు కావాలా వొద్దా' అంది యేదో నిశ్చయానికి వచ్చి లక్ష్మి. మోహన్ అయోమయంగా చూశాడు. 'నువ్వు కావాలమ్మా!' అన్నాడు బిక్క మొహం వేస్తూ.

'అయితే మరెప్పుడూ ఇలాంటి పని చేయకూడదు.'

'అంటే...'

మరొకరి సంతకంలాగా యెప్పుడూ సంతకంపెట్టకూడదు. అది చాలా తప్పుపని. పోలీసు వాళ్ళు పట్టుకొని బాగాకొట్టి చీకటి కొట్లో పడేస్తారు తెలుసా?'

'అలా అవుతే ఇంకెప్పుడూ చేయనమ్మా' అన్నాడు మోహన్.

'ఇకమీద ప్రతినెలా ప్రోగ్రెస్ కార్డు నాకు చూపెట్టాలి. నీకు ఎందులో నన్నా తక్కువ మార్కులువస్తే నాకుగాని నాన్నగారికిగాని చెప్పాలి. ఆ పాఠాలు ఇంకా బాగా చదివి ఎక్కువ మార్కులు తెచ్చుకోడానికి ప్రయత్నించాలి. ఇలా మరొకరి సంతకాలు పెడితే అందరూనిన్ను దొంగ అంటారు. నువ్వు డ్రాయింగులో చూపించేశ్రద్ధ తక్కినపాఠాల్లోనూ చూపించాలి.'

'నాకు డ్రాయింగు అంటే చాలా ఇష్టం అమ్మా. గుళ్ళోలేపూ అలాంటి పెద్ద పెద్ద బొమ్మలు వేయాలనిపిస్తుంది.'

'అలాగా. అది ప్రత్యేకంగా నేర్చుకోవాలి. కాస్తపెద్దవాడివయ్యాక నేర్చుకుందువుగానీలే.'

'అమ్మా హరికథ చెబుతున్నప్పుడు కమానుతో వాయిస్తారే దాన్ని యేమంటారే?'

'వయోలిన్ అంటారు. ఏం?'

'అదికూడా నేర్చుకోవాలని వుందమ్మా.'

లక్ష్మికి నవ్వు వచ్చింది. ఇంత చిన్న మనసులో యెన్నెన్నికోరి

కలు! వీడికి చిత్రలేఖనం మీద అభిలాషవుంది. అందులో తప్పక రాణించ గలడు. సంగీతం మీద ఆసక్తి వున్నట్టుంది. గాని దాన్ని స్పష్టంగా చెప్ప లేకపోతున్నాడు. వీడి కోరికలు తీర్చగలుగుతే యెంతో వృద్ధిలోకి వస్తాడు. కాని జీవితానికి ముఖ్యంగా కావలసిందివిద్య. కనీసం గ్రాడ్యు యేట్ అన్నాకాకపోతేయెలా? తన కోరికఏమో వీణ్ణి తీర్చిదిద్ది ఇంజనీరును చేయాలని.



'అవన్నీ నేర్చుకోవచ్చుగాని, ముందు నీవు శ్రద్ధగా చదువుకోవాలి. ఈసారి తప్పినట్టు నాతో యెందుకు చెప్పలేదు?'

'నాకు భయం వేసిందమ్మా.'

'భయపడి తప్పుడు పనిచేయకూడదు. చూశావా నాన్నగారికి ఎంత కోపం వచ్చిందో! నాన్నగారు ఇంటికి రాగానే నువ్వేంచేయాలో తెలుసా?'

మోహన్ తండ్రిపేరు వినగానే మళ్ళీ వణకడం ప్రారంభించాడు.

'అలా భయపడకూడదు. నాన్నగారి కాళ్ళకు నమస్కరించి, 'నేను చాలా తప్పుచేశాను నాన్నా. మరెప్పుడూ యిలాచేయను. నన్ను క్షమించు నాన్నా' అనాలి. తెలిసిందా! అన్నది.



'అలాగేనమ్మా' అన్నాడు మోహన్.

వాడ్ని ముద్దు పెట్టుకుని అక్కున చేర్చుకుంది లక్ష్మి.

## 16

మోహన్ పెంపకంలో తనతప్పేమిటో తెలుసుకున్నాక లక్ష్మిలో వొక విచిత్రమైన చైతన్యం కలిగింది. అది మోహన్ భవిష్యత్తును ఉన్నతంగా తీర్చిదిద్దాలన్న దీక్షగా రూపం దాల్చింది. ఆ సారి స్కూలు తెరవగానే వెళ్ళి స్వయంగా టీచర్లను సంప్రదించింది. మోహన్ బలహీనంగా వున్న లెక్కలూ, ఇంగ్లీషులో ప్రత్యేకంగా ట్యూషన్ పెట్టించింది.

రోజూ సాయంత్రం వాడు ఇంటికి రాగానే గంటసేపు ఆడుకో డానికి వదలడం, తర్వాత ఇంట్లో కూర్చోపెట్టి ఆనాడు స్కూల్లో చెప్పిన పాఠాలను గురించి వివరాలు తెలుసుకోవడం, హోంవర్కువుంటే దాన్ని పూర్తిచేయించడం. నెల పరీక్షలు విషయంకనుక్కొని ఆరోజుల్లో ప్రత్యేక

శ్రద్ధతో చదివించడం. ప్రతినెల ప్రోగ్రెస్‌కార్డు చూడటం. రోజూ ఉదయం ఆరింటికిలేపి తయారుచేసి వాణ్ణి ట్యూషన్‌కు పంపడం అంతా ఒక కార్య క్రమం యేర్పరచుకొని దాని ప్రకారం వాణ్ని దారికి తీసుకు వస్తున్నది. రాని పాఠాలను ఒకటికి నాలుగుసార్లు చదివించేది. ఇంగ్లీషు స్పెల్లింగులు వల్లింపచేసేది. క్రమంగా మోహన్ చదువు ఒక దారినపడింది.

ఆ సంవత్సరం పరీక్షల్లో వాడు క్లాసులో ఫస్టు వస్తే లక్ష్మి ఆనం దానికి అవధులు లేకుండా పోయింది. ఈ శ్రద్ధ ముందే తీసుకునివుంటే ఒక సంవత్సరం వృధాఅయ్యేదికాదుగదా అనుకుంది. ఈ దీక్ష ఇప్పటితో వదిలిపెట్టేదికాదు. మోహన్ ఎదుగుతున్నాడు. కౌమారప్రాయం అతనిలో మార్పులు తీసుకువస్తూవున్నది. అతడు అపుతప్పి ప్రవర్తించకుండా చూసుకోవాలి.

'ఇప్పుడు నీవు హైస్కూల్లో ప్రవేశించావు మోహన్. ఈ మూడు సంవత్సరాలూ నీవు చదువుపట్ల చూపే శ్రద్ధనే నీముందు చదువుకు పునాది అవుతుంది. చదువుమీద పెట్టవలసిన శ్రద్ధ కబుర్లమీదా, ఆటలమీదా పెడితే తర్వాత జీవితంలో చాలా విచారపడవలసి వస్తుంది. నువ్వు బాగా చదువు కుని చాలా గొప్పవాడివి కావాలి బాబూ.'

'అంటే?'

'అంటే నువ్వు గొప్ప ఇంజనీరువు కావాలి.'

'ఇంజనీరు అంటే చాలా పెద్ద ఉద్యోగంకదమ్మా.'

'అవును. అందుకనే చాలా శ్రద్ధగా చదవాలి. నూటికి తొంభై మార్కులన్నా తెచ్చుకోవాలి ప్రతి పరీక్షలో.'

'అలాగైతే ఎప్పుడూ చదువుతూనే ఉండాలి కదమ్మా!'

'ఎప్పుడూ చదవాలనికాదు నాయనా. చదివిన దాన్ని బాగా అర్థం చేసుకోవాలి. నీవు అర్థం చేసుకున్న దాన్ని మళ్ళీస్పష్టంగా చెప్పగలగాలి. చూడు మోహన్ నీకు ఏసబ్జెక్టు అయినా సరిగ్గా అర్థం కాకపోతే నాతో చెప్పు. అందులో నీకు ట్యూషన్ పెట్టిస్తాను. తెలిసిందా!'

'మరి ఆడుకోడం' అన్నాడు బుంగమూతిపెట్టి.

లక్ష్మి కాసేపుఆలోచించింది. పిల్లలకుఆటలమీదకూడా మనసు వుం టుంది కదా.

'స్కూలునించి వచ్చాక సాయంత్రం దీపాలుపెట్టేవరకూ ఆడుకో! శెలవు రోజుల్లో కాసేపు ఎక్కువే ఆడుకో! అంతేగాని రోజల్లా ఆటలమీదే ధ్యాస పెట్టుకోకూడదు.'

'అమ్మా మరి నాకు అది అది వయోలిన్ ఎప్పుడు నేర్పిస్తావ్?'

లక్ష్మి చిన్నగా నవ్వింది. వయోలిన్‌కి కనీసం రెండేళ్ళ సాధన అన్నా కావాలి. ఈ స్కూల్ ఫైనల్ దశలో ఆ సాధన ప్రారంభిస్తే చదువుకు తప్పకుండా అంతరాయం కలుగుతుంది. చిన్నవాని ఆసక్తి కాదనడానికీ ఆమెకు మనసొప్పడంలేదు.

'తప్పకుండా నేర్పిస్తాను మోహన్. నువ్వు పదోక్లాసు పాసయ్యే సరికి ఇంకా కాస్త పెద్దవాడివవుతావు. అప్పుడు ఎవరైనా మాస్టారునుపెట్టి నేర్పిస్తాను.'

'నాకు ఇప్పుడే నేర్చుకోవాలని వుందమ్మా. ఇప్పుడు వేసవి కాలం శెలవులుగదా!'

లక్ష్మి మోహన్ ముఖం వంకచూసింది. అతని కళ్ళు ప్రాధేయ పడుతున్నట్టుగా వున్నవి. ఆమె మనసు జాలితో కరిగిపోయింది.

'అలాగే! నాన్నగారితోచెప్పి మంచి మాష్టారును చూడ మంటాను.'

'అదికాదే అమ్మా. పోస్టాఫీసు వీధిలో రాఘవయ్య వకీలుగారు. వాళ్ళ అబ్బాయి శేషు మాక్లాసేగా. వాళ్ళక్కయ్యకు వయోలిన్ నేర్పిస్తున్నారు. ఆ మాష్టారుని నేను వాళ్ళ యింటికి వెళ్ళినప్పుడు చాలాసార్లు చూశాను. ఆయన చాలా బాగా వాయిస్తాడమ్మా. ఆయన ఇంగ్లీషు పాటలు కూడా వాయిస్తాడే.'

నిజంగా మోహన్‌కి వయోలిన్ మీద ఇంత ఆశక్తి వున్నదా! ఆ వుత్సాహాన్ని తను అణచడమెందుకూ!

'అలాగే చూద్దాంలే' అన్నది.

'అలాగే అంటే కాదమ్మా. ఆ మేష్టారుని మనఇంటికితీసుకువస్తాను.'

'అదికాదురా. మీనాన్నగారికి ఈవిషయం చెప్పాలి. ఆయన ఇష్ట పడాలి.'

'నువ్వు చెబితే నాన్నగారు తప్పకుండా వొప్పుకుంటారమ్మా!' మోహన్ బతిమాలాడు.

రాత్రి పడుకునే ముందు భర్త దగ్గర ఈ విషయం కదిపింది.

'చదువైంది. ఇక సంగీతం కాబోలు' అన్నాడు జయరాం.

'అదికాదండీ పిల్లలకు ఇప్పటినుండీ కళల్లో ప్రవేశం వుండడం మంచిదే. వాడు అంతగా కోరుతున్నాడు. అయినా ఇప్పుడు వేసంగి శెలవులు. వృధాకాలక్షేపంకంటే ఇదో వ్యాపకం వుంటే మంచిదేగదా' అన్నది.

'ఆ పిచ్చికళ తప్ప వాడు మరే కళసాధన చేసినా నాకభ్యంతరం లేదు' అన్నాడు జయరాం.

'ఏ పిచ్చికళ?'

'అదే ఫోర్జరీ.'

ఆ మాటలతో లక్ష్మి వులిక్కి పడింది.

'మీరు దాన్నే ఇంకా మనసులో పెట్టుకున్నారా! తెలియక యేదో చేశాడు. మందలించాను.'

'ఇప్పుడు తెలియక చేసి వుండొచ్చు. కాని అది వాడి తత్వంగా మారిందా వాడికోసం నువ్వు తీసుకునే ఇంతోటి శ్రమా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. వాడు మాత్రం కటకటాల వెనక వుండక తప్పదు.'

'ఛ! ఏమిటండీ ఆ మాటలు. వాడా విషయం పూర్తిగా మరచి పోయాడు. మళ్ళీ కెలకడం దేనికీ...'

'నీ ఇష్టం' అన్నాడు జయరాం.

లక్ష్మికి ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. చాలా సేపు భర్త చెప్పిన విషయాన్నే ఆలోచిస్తూ పడుకుంది. మోహన్ అలాంటిపని ఇంక ఎన్నడూ చేయడు అని ఆమె అంతరాత్మ ఖచ్చితంగా చెప్పాక ఆమెకు నిద్ర పట్టింది. మర్నాడు ఉదయమే జయరాం టూర్ వెళ్ళిపోయాడు. సుమారు పది గంటలకు మోహన్ వయొలిన్ విద్వాంసుడు సీతాపతిగార్ని ఇంటికి తీసుకువచ్చాడు. ఆయనకు అరవై అయిదేళ్ళు వుండవచ్చు వయసు. తెల్లగా, బక్కగా, కట్టుడు పళ్ళతో వున్నా ఆయన కళ్ళల్లో కళా వైదుష్యం మెరిసిపోతున్నది. ఆయన్ను సాదరంగా లోపలకు ఆహ్వానించి కూర్చుండ చేసింది.

లక్ష్మి ఇంకా యేమీ చెప్పకముందే ఆయన 'మీ వాడికి ఫిడేలు నేర్చుకోవాలని చాలా ఆసక్తిగా వున్నట్టుంది' అన్నాడు.

'అవునండీ! వాడు సంవత్సరం క్రితం నుండీ అడుగుతున్నాడు. ఇప్పటి నుండీ ఎందుకులే అనుకున్నాను. ఇప్పుడు మరీ పట్టుబట్టి మిమ్మల్ని తీసుకు వచ్చాడు. మీది ఈ వూరేనా?'

'కాదమ్మా-మాది ఏలూరు. నేనీ ప్రాంతం వదలి చాలం ఏళ్ళ యింది. నేనసలు ద్వారం వారి శిష్యుడ్ని. విద్య నేర్చుకున్నాక మద్రాసు వెళ్ళిపోయాను. కచ్చేరీలకు ఆ ప్రాంతాల్లో వుండే అవకాశాలు ఇక్కడ లేవుగదా. అదిగాక అక్కడ సినిమాల్లో కూడా వాయిస్తూ వుండేవాడ్ని. మా పెద్దబ్బాయి యీ వూళ్ళో బాంకు మానేజరు. నాకూ ఆరోగ్యం అంతగా బాగుండకపోతే వచ్చి ఇక్కడే వుంటున్నాను రెండేళ్ళుగా.'

'ఇక్కడ చాలామంది పిల్లలకు పాఠాలు చెబుతున్నారా-'

'అబ్బే లేదమ్మా! ఇప్పుడు దీన్ని వృత్తిగా పెట్టుకోలేదు. రాఘవయ్యగారు చాలా అడిగితే సాయంత్రంపూట వారి అమ్మాయికి చెబుతున్నాను. మీవాడు తరుచూ వాళ్ళ ఇంటికి స్తూ వుంటాడు. నేనాపిల్లకు నేర్పే పాఠాలను శ్రద్ధగా వింటూ వుంటాడు. వీడి కున్న ఆసక్తి ఆ అమ్మాయికి వుంటే బావుణ్ణు అనిపిస్తుంది నాకు.'

'అయితే మీకు వీడికి నేర్పడానికి వీలు వుంటుందా?'

'అంటే నేను ఇంత దూరం రాలేను కాని ఇప్పుడు శెలవులేగదా. రోజూ వుదయం పూట రెండు గంటలు పంపించు. ఈ రెండు నెలలూ గడిచాక తరువాత ఎప్పుడు చెప్పేదీ ఆలోచిద్దాం. దీని మూలంగా వాడి చదువూ పాడు కాకూడదు.'

'అలాగేనండి. తమ ఫీజు...'

'చెప్పానుగదమ్మా ఇది వృత్తిగా పెట్టుకోవడం లేదనీ. పిల్లవాడు ముద్దుగా వున్నాడు. నేర్చుకోవాలని ఆసక్తి చూపిస్తున్నాడు. ఇలాంటి వారికి నేర్పడం మాకు తృప్తిగా వుంటుంది. వీడికి ఫీజు అంటూ నీవేమీ బెంగపెట్టుకోకమ్మా. నాకు భగవంతుడు యేదో ఇంత ఇచ్చాడు. అదే చాలు.'

లక్ష్మికి ఆనందం పొంగిపోయింది.

'ఎప్పటి నుండి పంపమంటారు.'

'రేపు దశమి. మంచిరోజు రేపటి నుండి పంపించు.'

'అలాగేనండీ! మరి వీడికో ఫిడేలు కొనాలిగదా! ఎంతుంటుందో యేమో!'

'ఇప్పుడే కొత్త ఫిడేలు ఎందుకమ్మా! సాధనకు నా దగ్గర పాతది వొకటి వున్నది. అది చాలు ప్రస్తుతానికి. వీడు శ్రద్ధపెట్టి నా శిష్యుడు అనిపించుకుంటే నేనే వీడికి మంచి ఫిడేలు బహుమతి ఇస్తాను. ఇంక వస్తానమ్మా.'

'ఉండండి కాఫీ తీసుకు వెడుదురుగాని' అంటూ లోపలికి వెళ్ళి కాఫీ తెచ్చి ఇచ్చింది. ఆయన వెళ్ళిపోయాక మోహన్ లక్ష్మిని గట్టిగా వాటేసుకున్నాడు.

# 17

కాల ప్రవాహంలో మూడు సంవత్సరాలు దొర్లుకు పోయినవి. మోహన్‌కు స్కూల్ ఫైనల్ పూర్తి అయ్యేసరికి అతని వయోలిన్ సాధన కూడా పూర్తి అయింది.

సీతాపతిగారు తన విద్య నంతా మోహన్‌కు క్షుణ్ణంగా నూరిపోశాడు. ఎన్నో అపూర్వ రాగాలు, మెళకువలు ప్రత్యేకంగా మోహన్ చేత సాధన చేయించాడు. ఇంతటి శ్రద్ధగల శిష్యుడు దొరికినందుకు సీతాపతిగారు యెంతగానో మురిసిపోయేవారు. ఆయన సినిమా ఫీల్డులో కూడ పనిచేసిన వాడు కావడంచేత ఆయనకు పాశ్చాత్య బాణీలు కుడా బాగా తెలుసు. వాటిలోనూ తన ప్రియ శిష్యునికి తర్ఫీదు ఇచ్చారు. ఆయన మాటచెప్పినట్టుగానే సంగీతం పూర్తి చేయగానే మద్రాసు నుంచి కొత్త వయోలిన్ తెప్పించి బహుమతిగా ఇచ్చాడు.

మోహన్ తన ప్రథమ కచ్చేరీని తన గురువు సాన్నిధ్యంలో, తన స్కూల్ ఫైనల్ పరీక్షలకు ముందు జరిగిన స్కూల్ డే నాడు జరిపాడు. ఆనాడు హాజరైన పిన్నలు పెద్దలు కూడా అతని వయోలిన్ వాదనను యెంతగానో ప్రశంసించారు. ఇంటికి వచ్చాక అతనికి దృష్టి

తీసింది లక్ష్మి. మోహన్ లక్ష్మికీ, తండ్రికీ పాదాభివందనం చేశాడు. ఇప్పుడు లక్ష్మికి మరొక ఆడపిల్ల. పెద్దపిల్ల సుధకి నాలుగు పూర్తి అయి అయిదోయేడు వచ్చింది. రెండవ పిల్ల లత పుట్టగానే లక్ష్మి ఆపరేషన్ చేయించుకుంది.

'ఎందుకు లక్ష్మి, నీకడుపున వొక మగపిల్లవాడు కలగాలని లేదా నీకు' అన్నాడు జయరాం.

'నా అదృష్టం ఇంతే అనుకుంటాను. నాకు మోహన్ వున్నాడు చాలు. వయసుమీరిన తరువాత వస్తున్న కాన్పులివి. ఎలావుంటుందో యేమో! వీళ్ళను సక్రమంగా పెంచి పెద్ద వాళ్ళను చేయగలిగితే చాలు' అన్నది.

జయరాం యేమీ మాట్లాడ లేకపోయాడు. భార్య ఇష్టానుసారమే ఆమెకు ఆపరేషన్ చేయించాడు. యౌవన ప్రాంగణంలో అడుగుపెడుతున్న మోహన్ నిజంగానే, రేకులుతీర్చుకుని పరిమళాన్ని వెదజల్లే గులాబి పువ్వులా మోహనాకృతిని సంతరించుకుంటున్నాడు. స్కూల్ ఫైనల్లో క్లాసు రావడంతో అతనికి కాలేజీలో సీటు సులభంగానే దొరికింది. కాలేజి ప్రవేశంతో మోహన్ జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమైంది. ఇంత కాలం తను చూస్తున్నది మాత్రమే ప్రపంచం కాదనీ, తాను చదివింది మాత్రమే విద్య కాదనీ, ఈ ప్రపంచం చాలా విశాలమైందనీ, తాను నేర్చుకోవలసింది ఇంకా చాలా వుందనీ అతనికి తెలిసి వచ్చింది.

కాలేజీలో బోధనా పద్ధతీ, విద్యార్థుల ప్రవర్తన కూడ ఇదివరకటి కంటే భిన్నంగా వుంటున్నది. బుద్ధివికాసానికీ, భావవైశాల్యానికీ ఈకాలేజీ చదువు యెంతో అనువైనది అని అతడు గ్రహించాడు. ఈ దశలోనే అతనికి చిత్రలేఖనం అభ్యసించడానికి చక్కని అవకాశం వచ్చింది. మొదట నుండీ డ్రాయింగులో మంచి కౌశలం వుందతనికి. దేనికైనా ప్రతికృతులు సులభంగావేయగలడుగాని ఆ ప్రతిభ గురు బోధ వల్ల తీర్చి దిద్దబడింది కాదు. సంగీతం సాధన చేసినట్టుగానే చిత్రలేఖనం కూడా యెవరైనా మంచి గురువు దగ్గర అభ్యసించాలని అతనికి కోరికగా వుండేది. తల్లితో ఆ మాట చెప్పాలనుకునే వాడుగాని, ఆమె తన కోసంతీసుకుంటున్న శ్రద్ధ శ్రమ గుర్తించే వయసొచ్చాక ఆమెను మరింత వొత్తిడి చేయడానికి అతనికి మనసొప్పేదికాదు.

బొంబాయి జే.జే. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చాలా కాలం అధ్యాపకుడుగా పని చేసిన వొక చిత్రకారుడు ఆ వూరికి వచ్చి నివాస మేర్పరచుకున్నాడు. అతను కొంకణీ వ్యక్తి. నరేంద్ర కామత్ అతని నామధేయం. సీతాపతిగారిలాగే ఇతను వయసయిపోవడం చేత కొడుకు దగ్గరకు వచ్చేశాడు. ఆయన కొడుకు ఆ వూళ్ళో కెనరా బ్యాంకులో ఏజెంటుగా వుంటున్నాడు. నరేంద్ర కామత్ తన వ్యాపకాని కోసం వొక కమర్షియల్ ఆర్టు కంపెనీ పెట్టుకున్నారు. సినిమాస్లయిడ్లూ, బానర్లూ, హోర్డింగులూ, ఇతర ప్రకటన ప్రక్రియలు తయారు చేస్తుంటాడు.

నరేంద్రకామత్, చిత్రాలనూ, రేఖాచిత్రాలను, మోహన్ ఆంగ్ల పత్రికల్లో చాలా వాటిలో చూశాడు. అతను ప్రస్తుతం తమ వూళ్ళోనే వున్నాడని తెలిసి, ఇన్నాళ్ళూ తనలోనే అణచి పెట్టుకున్న కోరిక మళ్ళీ పైకి వుబికింది. తనకు చిత్రకళ నేర్పడానికి ముందు కామత్‌గారు అంగీకరిస్తే, తరువాత తల్లి అనుమతి తీసుకోవచ్చు అనుకున్నాడు.

ఇంతకాలం తను జాగ్రత్తగా దాచుకున్న డ్రాయింగు బుక్కులూ, చిత్రాలు వగైరా తీసుకుని కామత్‌గారిని కలుసుకుని వాటిని చూపించి తన కోరిక విన్నవించుకున్నాడు. ఆయన వాటిని పరిశీలనగా చూశాడు. తరువాత మోహన్ ముఖాన్ని పరిశీలనగా చూశాడు. అతని కళ్ళల్లో తృష్ణని చూశాడు. కామత్ చాలాసేపు తన చూపును మోహన్ మీదనే నిలిపి మౌనంగా వుంటే అతనికి ఇబ్బందిగా తోచింది. కొన్ని నిముషాలు గడిచాక, 'నీ చదువుకి ఇబ్బంది కలుగుతుందేమో. ఈ కళల మీద ధ్యాస పెట్టిన వారు చదువును అశ్రద్ధ చేస్తారు' అన్నాడు.

మోహన్ మనసు చివుక్కుమంది. మౌనంగా వుండి పోయాడు. అతని కన్నుల్లో తేమ కదలడం చూసి కామత్ చిన్నగా నవ్వుకున్నాడు.

'సరే నీకంత ఆసక్తిగా వుంటే నిన్ను చిన్న బుచ్చడమెందుకు! కాని నువ్వు చదువు విషయం మాత్రం అశ్రద్ధ చేయకూడదు' అన్నాడు.

'అలాగే నండీ' అన్నాడు మోహన్ వుత్సాహంతో. రోజూ కాలేజి టైం అయ్యాక గంటో రెండు గంటలో కామత్ ఇంటికి వెళ్ళే ఏర్పాటు చేసుకున్నాడు. 'మీకు ఫీజు' అన్నాడు నమ్రతగా.

కామత్ నవ్వారు. 'నువ్వేమీ ఇవ్వనక్కర లేదు. పైగా నేనే నీకు

పాకెట్ మనీ ఇస్తాను.' మోహన్ తనను తానే నమ్మలేక పోయాడు. 'అదేమిటండీ' అన్నాడు ఆశ్చర్యంగా.

'ఫిగరింగ్, లెటరింగ్ విషయంలో నీకు నేను కొన్ని మెళకువలు తప్ప ప్రత్యేకంగా యేమీ చెప్ప నక్కరలేదు. నేనెలాగూ కమర్షియల్ వర్క్ తీసుకుంటున్నాను. నాడిజైన్స్ మీద నీవు పనిచేద్దువుగాని. నాకు నీలాంటి చురుకైన అసిస్టెంటు కావాలి. తీరినప్పుడు కలర్ కాంబినేషన్సు వగైరా చెబుతాను' అన్నాడుకామత్.

ఈ విషయమంతా విని లక్ష్మి తల మునకలుగా ఆశ్చర్యపడింది.

'చూడు మోహన్! నీకు కళల మీద ఆసక్తి దేవుడిచ్చిన వరం! దానికి నేను అడ్డుతగలను. కాని జీవితానికి చదువు ముఖ్యం! నీవు ఇంజనీరు కావాలని నేను కలలు కంటున్నాను. కామత్‌గారు చెప్పినట్టు నీవు నీ చదువు విషయంలో మాత్రం అశ్రద్ధ చేయకు' అన్నది.

జయరాం అంతా విని మౌనంగా వుండి పోయాడు. మోహన్ దిన సరి కార్యక్రమం విరామంలేకుండా తయారైంది. ఉదయం కాస్సేపు సంగీత సాధన, తరువాత నోట్సు రాసుకోడం. కాలేజీకి వెళ్ళడం. సాయంత్రం పదింటి దాకా కామత్‌గారి దగ్గర పనిచేయడం. రాత్రి ఇంటికి వచ్చాక స్నానం, భోజనం. రాత్రి పదకొండు దాటిందాకా చదువుకోడం. మోహన్ కార్యక్రమంతో పాటు లక్ష్మికి పని యెక్కువే అయిపోయింది. అతని వేళకు తగ్గట్టు అన్నీ అమర్చాలి. పైగా తాను పసిబిడ్డ తల్లి. పెద్ద పిల్ల అల్లరి పనులు. తన ఇంతోటి పనులలోనూ మోహన్‌కు చెల్లెళ్ళను కాస్సేపైనా ఆడించక పోతే యెదో వెలితిగా అనిపించేది. ఈ సంసారం ఇలాగే చల్లగా సాగిపోవాలని లక్ష్మి రోజూ దేవుడికి దండం పెట్టుకునేది. కాని మనుష్యులు కోరినట్టుగానే అన్నీ జరగవుకదా! మోహన్‌కు ఇంటర్ మొదటి సంవత్సరం గడచిపోయింది సాఫీగానే. రెండవ సంవత్సరంలోనూ కొన్ని మాసాలు దొర్లి పోయినాయి. అతని చిత్రలేఖనం మంచి పట్టులో సాగుతున్నది. చదువు దీక్షతోనే సాగుతున్నది. కాని జయరాం ఆరోగ్యమే హఠాత్తుగా దెబ్బతిన్నది. అతడు మంచం పట్టాడు. పరీక్ష చేసిన డాక్టర్లు అది బ్లడ్ కాన్సర్ అన్నారు. మందులు కొంత వుపశమనం కలిగించవచ్చు కాని జబ్బు మాత్రం నయం కాదని తేల్చి చెప్పేశారు. లక్ష్మికి గుండె

పగిలినట్టుగా వున్నా ధైర్యాన్ని కోలుపోకుండా భర్తకు సేవలు చేస్తున్నది. తండ్రి పరిస్థితి చూసి మోహన్ మాత్రం పూర్తిగా డీలాపడి పోయాడు. అదిగమనించి లక్ష్మి ఆందోళన పడింది. మోహన్ అధైర్యపడి చదువు పాడు చేసుకుంటే మరో సంవత్సరం అతని జీవితంలో వృధా అయిపోతుంది అని అతనికి యెంతో ధైర్యం చెప్పింది.

'మోహన్ నీవు నాన్నగారి విషయమే ఆలోచిస్తూ కూర్చోకు. ఆ సంగతి నేను చూసుకుంటాను. నీ మనసు చదువు మీదనే ఉండనీ' అని.

అహోరాత్రాలూ తనకూ, కొడుక్కూ విసుగులేకుండా సేవలు చేస్తున్న భార్యను చూసి జయరాంకు ఎంతోజాలి కలిగింది. వొక రాత్రి చాలా పొద్దు పోయినా మోహన్ ఇంటికి రాలేదు. ఆ రోజు కామత్‌గారి ఇంట పని అధికంగా వుండటంచేత కాస్త పొద్దు పోయినదాకా వుండి పోవలసి వచ్చింది. ఇంత పొద్దు పోయినందుకు తల్లి యేమనుకుంటుందోనని జంకుతూనే ఇంటికివచ్చాడు. ఆ సమయంలో తండ్రి తల్లితో అంటున్న మాటలువిని అతడు ఛ్రాన్పడిపోయాడు.

'వస్తాడులే! వాడేం చిన్నవాడా పొద్దుపోతే దారితప్పి పోవడానికి. వాడిమీద నీవు పెంచుకున్న మమకారంచూస్తే నాకు యేమనాలో తోచడం లేదు లక్ష్మీ. వాడు పోయిన జన్మలో యేదోకాస్త పాపం చేసుకొని మరో తల్లి కడుపున పడ్డాడుగాని లేకపోతే నీకడుపునే పుట్టవలసింది. మారుటి తల్లి ఇంత ప్రేమగా చూడటం స్త్రీల చరిత్రలోనే అరుదైన విషయం.'

'ఊరుకోండి ఇప్పుడవన్నీ యెందుకు. పొద్దున్ననగా తినివెళ్ళాడు. ఇంత పొద్దుపోయినా రాలెదేమని కంగారు పడుతున్నాను' అంది లక్ష్మి.

వెన్నులోంచి యెవరో బాకు దిగేసినట్టయింది మోహన్‌కు. చడీ చప్పుడు లేకుండా తనగదికివచ్చి మంచంమీద వాలిపోయాడు. అతనికి దుఃఖం కట్టలుతెంచుకునివచ్చి తలగడకు ముఖాన్ని ఆనించిభోరున యేడవ సాగాడు. మోహన్ కోసం ఎదురు చూడడానికి వీధిగుమ్మం వైపుకు వచ్చిన లక్ష్మి అతనిగదినుండి యేడుపు శబ్దం వినిపించి ఆశ్చర్యంగా లోపలికి వెళ్ళింది. మోహన్ వెక్కివెక్కి యేడుస్తున్నాడు.

'మోహన్! ఏమిటిది-ఏం జరిగింది' అంటూ మంచంమీద కూర్చుని అతని తలను యెత్తి అక్కున చేర్చుకుంది.

'నువ్వే నాఅమ్మవని చెప్పమ్మా! నువ్వే నాఅమ్మవని చెప్పమ్మా!' అంటూ తన తలను ఆమె రొమ్ము కేసి కొట్టుకోసాగాడు.

లక్ష్మికి విషయం అర్థమైపోయింది. ఇతడు చాటునుండి తండ్రి మాటలువినివుంటాడు. ఇంతకాలం గుప్తంగావున్న విషయం హఠాత్తుగా బయటపడింది. మోహన్ కన్నీళ్ళను కొంగుతో తుడిచింది. 'నీవు చాటు నుండి నాన్నగారి మాటలు విన్నావుకదూ!'

'నేను లోపలికి వస్తూవుంటే వినిపించాయమ్మా.'

'ఇప్పుడు నేను నీకు అమ్మను కాను అనిపిస్తున్నదా?'

'ఆ వూహకూడా నేను భరించలేనమ్మా!'

'అవుతే ఆ విషయం ఇంక పట్టించుకోకు. ఏడేడు జన్మలకూ నేనే నీ తల్లిని. నీవే నాకొడుకువు. అర్థమైందా. ఇంక పిచ్చిఆలోచనలుచేయకు. వొకవంక నాన్నగారి అరోగ్యంబాగాలేదు. మరొకవంక నీకు పరీక్షలు దగ్గర పడుతున్నవి.తొంభై శాతంమార్కులువస్తేగాని ఇంజనీరింగులో సీటు దొరకడం కష్టం. శ్రద్ధగా చదువుకో. పరీక్షలయ్యేవరకూ పెయింటింగ్ క్లాసులు మానుకో! ఫరవాలేదు' అంది.

'ఈ నెలాఖరు వరకూ వెళ్ళి తర్వాత పరీక్షలయ్యేవరకూ మానేస్తానమ్మా. నాన్నగారి విషయం డాక్టర్లు యేమంటున్నారు?'

లక్ష్మి యేమని జవాబు చెప్పగలదు. 'కాస్త నిదానంగా నయమౌతుందంటున్నారు-ఇంక భోజనానికిలే! చాలా పొద్దుపోయింది' అంది లక్ష్మి.

మోహన్ కళ్ళు తుడుచుకుని ఆమెను అనుసరించాడు. జయరాం ఆరోగ్యం నానాటికీ క్షీణించిపోతూవున్నది. మోహన్‌కు పరీక్షలు నానాటికీ దగ్గర పడుతూవున్నవి. వీరిరువురి మధ్యన ఇద్దరు పసిపిల్లలమధ్యనా లక్ష్మి నిజంగానే నలిగిపోతున్నది. జయరాం మోహన్ పరీక్షలు పూర్తి అయ్యే వరకూ ఎలాగయినా బతికివుండాలన్న ఆశతో కష్టంమీద ప్రాణాలను బిగపట్టుకున్నాడు. అతని పరీక్షలు అయిపోయిన మరునాడు రాత్రి విపరీతంగా రక్తం కక్కుకుని శాశ్వతంగా కన్నుమూశాడు. తనగుండెల్లో పుట్టెడు దుఃఖాన్ని అణచిపెట్టుకొని తండ్రికి తలకొరివిపెట్టి తిరిగివచ్చి పసిపిల్లవానిలాయేడుస్తున్న మోహన్ తలను తన గుండెకు హత్తుకుని తెల్లవార్లూ వోదారుస్తూ కూర్చుంది లక్ష్మి. కాటుకకట్లను చీల్చుకుని ఉద

యించబోతున్న బాల భాస్కరునిలో భవిష్యత్తులో ఇంజనీరు పట్టా పుచ్చుకుని విశ్వవిద్యాలయం ఇవతలకు వస్తున్న మోహన్ యొక్క దరహాస వదనాన్ని చూడగలిగింది లక్ష్మి.

# 18

'నేనింక చదువు మానేస్తానమ్మా.'

'మానేసి?'

'ఏదైనా ఉద్యోగం చూసుకుంటాను.'

'ఏం ఉద్యోగం?'

'ఏదయినాసరే.'

'ఈ పాటి చదువుకి నీకు వచ్చే ఉద్యోగం ఎంతదయివుంటుంది! ఎల్. డీ.సి. ఉద్యోగాలకుకూడా ఎం.ఏలు ఎగబడుతున్న రోజులివి. నువ్వీ నిర్ణయం ఎందుకు తీసుకుంటున్నట్టు?'

'ఇల్లు గడవాలి గదమ్మా.'

'ఇల్లు గడవడం అంటే?'

'అంటే అంటే- నాన్నగారు మనకు ఇంక లేరుగా. ప్రతినెలా ఆయనతెచ్చే సంపాదనాలేదుగా!'

'అందుకని నీవు సంపాదనకు బయలు దేరుతానంటావా? ఇల్లు గడవడం కష్టంగా వుందని నీతోచెప్పానా? లేనిపోనివి వూహించుకుని నీ బంగారు భవిష్యత్తును పాడు చేసుకోకు.'

'అమ్మా...'

'నా ఆశయం నెరవేర్చాలని నీకు లేదా మోహన్! నిన్ను తీర్చి దిద్ది వొక మంచి హోదాలో నిలబెట్టాలన్న నా కలలన్నీ పగటి కలలు చేస్తావా...' లక్ష్మి కంఠం రుద్ధమైంది.

'నా వుద్దేశం అది కాదమ్మా. బి.ఇ.చదవడం అంటే మాటలుకాదు. నాన్నగారు బతికివుండి సంపాదిస్తూవుంటేనే అది చదివి పూర్తిచేయడం కష్టమై వుండేది. వొక్క సంవత్సరంతో అయ్యేపనా- ఎంత డబ్బుకావాలి! నీకు నామీద ఎంత ప్రేమవున్నా నేను నాస్వార్థమే చూసుకుంటే యెలా

గమ్మా! ఇంక చెల్లాయిల మాటయేమిటి! వారూ చదువుకోవాలి. తర్వాత వారికి పెళ్ళిళ్ళు చేయాలి.'

అతని మాటలకు లక్ష్మి చలించి పోయింది. అతడు చెప్పేదాంట్లో అసత్యం యేమాత్రమూ లేదు.

జయరాం పని చేస్తున్న కంపెనీవారు అతని ఫండు డబ్బు చాలా భాగం అతని రుగ్మత నివారణకోసం అప్పుగా ఇచ్చారు.

నయంకాదనితెలిసినా జబ్బుచాలాడబ్బు దిగమింగిగాని జయరాంను దిగమింగలేదు.

తర్వాత చేతికి వచ్చిందికాస్తా కర్మలకు సరిపోయింది.

ఈ పరిస్థితిలో మోహన్ బి. ఇ. చదవడం మాటలుకాదు. తన కోరిక గొంతెమ్మ కోరికే అయినందుకు లక్ష్మి మనసు విలవిల లాడు తున్నదికాని, తనదీక్షకు ఫలితంగా దీపంలా వెలిగిపోవలసిన అతనిభవిష్యత్తును చేతులారా ఆర్పి, అంధకారం చేయడమా!

కాకూడదు. అలా యెన్నటికీ కాకూడదు.

లక్ష్మి వొక నిర్ణయానికి వచ్చింది.

'మోహన్ నువ్వు మరొక ఆలోచన చేయకు. సీటుకు దరఖాస్తు పెట్టు' అన్నది లక్ష్మి ఆజ్ఞాపిస్తున్నట్టు.

'అమ్మా ఎలాగమ్మా?'

'చూడు మోహన్ ఈ ఇల్లు నీది. ఇది నీ అవసరానికి పనికిరానప్పుడు అదివుండీ దండుగే.'

మోహన్ చకితుడై పోయాడు ఆమె నిర్ణయంవిని.

'మనకు తలదాచుకోడానికి వుండేది ఇదొక్కటే నమ్మా! దీన్ని కూడా అమ్మేస్తే-'

'ఫరవాలేదు మోహన్. నీవు ఇంజనీరు వయ్యాక ఇంతకు మించిన ఇల్లే కట్టించగలవు. నువ్వు మరో మాట మాట్లాడకు.'

'మరి మనం వుండడానికో!'

'నాకూ పిల్లలకు ఒక చిన్న గదిచాలు. సర్దుకుంటాం. నీకు సీటు తప్పకుండా వస్తుందని-నువ్వు ఆవూళ్ళోనే హాస్టల్లో వుండి చదువుకో.'

మోహన్‌కు ఒక్కసారి దుఃఖం ముంచుకు వచ్చింది.

'అమ్మా నువ్వు యేమైనాచెప్పు. ఈపనిమాత్రం నేను చేయలేను. నీకు దూరంగా ఒక్క రోజుకూడా బతుకలేను. ఒక చిన్న ఇల్లుతీసుకుని అంతా అక్కడే వుందాం.'

'మోహన్ నీకు ఎలా అనుకూలమో అలాగే చేద్దాం. చెల్లాయిలు ఇంకా చిన్న పిల్లలు. వారిచదువు ఏవూళ్లోనైనా సాగించవచ్చు. నీవు మాత్రం యేపరిస్థితిలోనూ చదువు మానుతాను అని నాతో చెప్పకూడదు. తెలిసిందా!'

'అలాగేనమ్మా!'

మోహన్‌కు బి. ఇ.లో సీటు వచ్చింది.

పూర్వీకమైన ఇల్లే అయినా సెంటరులో ఉండడంచేత దాని ధర పాతికవేలు పలికింది.

లక్ష్మికి తన జీవితాశయం ఫలించబోతున్నందుకు ఎంతో ఆనందంగా వున్నది. ఇరుగు పొరుగువారూ, ఆమెను ఎరిగున్న వారూ, ఆమె సౌజన్యాన్నీ సహృదయాన్నీ యెంతో శ్లాఘించారు. ఇంతకాలం అందరికీ తలలో నాలుకలావున్నవ్యక్తి తమను విడిచి దూరంగా మరోవూరికి వెళ్ళి పోతూవుంటే అందరికీ చాలా బాధ అనిపించింది.

సీతాపతిగారు జయరాం పోవడానికి కొన్ని నెలలక్రితమేపోయారు. కామత్ మాత్రం మోహన్ వెళ్ళిపోతున్నందుకు చాలా బాధపడ్డాడు.

'వీలైనప్పుడల్లా వచ్చి కలుస్తూ వుండు' అన్నాడు మోహన్‌ను గాఢాలింగనం చేసుకుంటూ.

'తప్పకుండా నండీ' అన్నాడు మోహన్ ఆయన పాదాలకు నమస్కరిస్తూ.

మోహన్ కొత్త వుత్సాహంతో బి.ఇ.లో ప్రవేశించాడు. అతని నడవడీ, చదువుమీదశ్రద్ధా లెక్చరర్లను అవలీలగాఆకట్టుకున్నాయి. అతని చదువు నిరాఘాటంగా కొనసాగింది.

లక్ష్మి అన్ని విషయాల్లోనూ ఎన్నో విధాలుగా కనిపెట్టుకునిఅతని అవసరాలు ఏవీ లేవనకుండా సంసారాన్ని గుట్టుగా సాగించుకు వస్తున్నది.

రోజులు ఇట్టే దొర్లిపోయి చూస్తూవుండగానే మోహన్ బి. ఇ. అయికూర్చున్నాడు.

ఆనాడు లక్ష్మి పొందిన ఆనందం వర్ణనాతీతం.

మోహన్ ఆమె మోకాళ్ళను కౌగలించుకుని ఆనందావేశాలు పొంగి రాగా యెంతసేపు యేడ్చాడో అతనికే తెలియదు.

'ఇంక మన కష్టాలు గట్టెక్కిపోతాయి నాయనా. నీకు మంచిఉద్యోగం రావాలని మనసారా దీవిస్తున్నాను' అన్నది అతని తల నిమురుతూ.

'ఇదంతా నీ దీవెన ఫలితమే కదమ్మా' అన్నాడు మోహన్.

ఆ నాడు వారి ఇంటికి దీపావళి పండుగ ప్రత్యేకంగా వచ్చినట్టు అయింది.

మోహన్‌కుమార్ బి. ఇ.

అతనిపేరు ప్రక్కన ఈ డిగ్రీ చూసి వేలకు వేలు కట్నంతో అతడ్ని పెళ్లాడడానికి కన్యలు ముందుకు వస్తున్నారు గాని, అతడుఆశించి నట్టుగా తగిన వుద్యోగం మాత్రం రావడం లేదు.

బి.ఇ. పూర్తికాగానే పిలిచి వుద్యోగం ఇచ్చేరోజులు పోయి చాలా కాలమయింది.

ఇంజనీర్ల సంఖ్య నానాటికీ పెరిగిపోతున్న రోజులు. వారందరికీ సరిపడా వుద్యోగాలు ప్రభుత్వం డిపార్టుమెంట్లలో దొరకడం అంతేమాటలు కాదు. సిఫార్సులూ గట్రా వున్నవారి పనే అంతంతగా వుంది. కేవలం మెరిట్ మాత్రం వుంటే యెవరడుగుతారుగనక!

పేపర్‌లో ప్రకటనలు చూసిచూసి విసుగుపుడుతున్నది మోహన్‌కు. అతను డిగ్రీ పుచ్చుకుని అప్పుడే ఆరునెలలు గడిచిపోయినయ్.

'దిగులు పడకు నాయనా! నీ శ్రమవృథాపోదు' అని ధైర్యం చెబుతున్నది లక్ష్మి. అంతకంటే ఆమె చేయగలిగింది యేముంది?

ఆమె మాటకు తగినట్టుగానే రాజమండ్రి ప్రాంతంలో పనిచేయడానికి ఇరిగేషన్ డిపార్టుమెంటుకు వొక ఇంజనీర్ కావలసివచ్చి పేపర్‌లో ప్రకటన పడింది.

అందుకు కావలసిన అర్హతలన్నీ మోహన్‌కు వుండడంచేత వెంటనే దరఖాస్తుఫారమ్ తెచ్చుకుని పూర్తిచేసి, దానితో జతపరచవలసిన సర్టి

పికెట్లు ట్రూకాపీలు జతపరచి, దాన్ని స్వయంగా ఆ డిపార్టుమెంటులో ఇవ్వడానికి బయలుదేరాడు.

అక్కడా బోలెడు మంది అభ్యర్థులు. అందులో మోహన్ సహ విద్యార్థి వెంకట్రావు వొకడు. ఏలూరు వాస్తవ్యుడు. మెరిట్‌లో మోహన్ తరువాత అతడే.

ఇంకా అప్లికేషన్‌లు తీసుకునే సమయం రాలేదు.

వెంకట్రావు మోహన్ అప్లికేషను అందుకుని యథాలాపంగా చూస్తూ వున్నాడు వివరాలను.

'పర్టికులర్స్ ఏమయినా వదిలేశానా?' అడిగాడు మోహన్ వెంకట్రావు తన మొహాన్ని అదోలా పెట్టడం చూసి.

'బాబూ! నీకీ వుద్యోగం రాదు. అప్లికేషను చించిపారేసి ఇంటికి వెళ్ళు' అన్నాడు.

'పాడు జోకూ నువ్వూనూ!' అంటూ తన అప్లికేషను వాపసు తీసుకున్నాడు.

'జోకు కాదురా చిట్టితండ్రీ! నువ్వు మూడు నెలల వోవర్ ఏజ్... ప్రకటన సరిగ్గా చూడలేదా? అందులో ఎయసుసంగతిఖచ్చితంగా చెప్పారు' అంటూ తన జేబులో వున్న కటింగు తీసి చూపించాడు.

మోహన్ తారీకులు లెక్కవేసి చూసుకున్నాడు. వెంకట్రావు చెప్పింది నిజమే. అతడు ఖిన్నుడైపోయాడు. బరువుగా అడుగులువేసుకుంటూ ఇవతలికి వొచ్చి ఆవరణలో వో చెట్టుకింద నిలబడిపోయాడు.

అభ్యర్థులు ఒక్కొక్కరే తమ అప్లికేషన్‌లు అందచేసి వెళ్ళిపోతూ వుంటే అతని కళ్ళలో నీరు తిరిగింది.

ఈ వొక్క లొసుగూ లేకపోతే నిజంగా ఈ వుద్యోగం నీకేదక్కేది అని అతని అంతరాత్మ అదేపనిగా చెబుతున్నది.

అతడు గట్టిగా కళ్ళుమూసుకున్నాడు కొన్నిక్షణాలు.

o o o

ఇంటర్వ్యూనాడు మోహన్‌కూడా అక్కడికి రావడం చూచి ఆశ్చర్యపడ్డాడు వెంకట్రావు.

'ఏరా నువ్వూ వచ్చావు!' అన్నాడు.

'పిలిచారు! వచ్చాను!' అన్నాడు మోహన్ ముక్తసరిగా.

'అప్లికేషను పెట్టావా యేమిటి? లాభం లేదన్నానుగా!'

'అన్నావుగాని, మార్కులూ, ఇతర విషయాలూబాగానే వున్నాయి గదా. కన్సిడర్ చేస్తారేమో పెట్టి చూడు అంది మా అమ్మ. సరేనని పెట్టాను. పిలిచారు మరి.'

'అలాగా' అన్నాడు వెంకట్రావు. అతని దృష్టిలో మోహన్ ప్రత్యర్థిలా వున్నాడు. తక్కినవారి విషయం అతనికి తెలియదుగాని మెరిట్‌లో మోహన్ తరువాత తనే ఆ ఉద్యోగానికి అన్ని అర్హతలు గలిగినవాడని అతని దృఢ విశ్వాసం. అతను చెప్పినట్టుమార్కులకుప్రాధాన్యత ఇచ్చారా తన అవకాశం తన్నుకు పోయినట్టే అని భయం పట్టుకుంది.

అప్లికేషన్‌లు రిజిస్టరయిన సంఖ్యాక్రమంలో ఇంటర్వ్యూలిస్టు తయారు చేయబడింది కనుక మోహన్ పేరు ఎక్కడో చివర్నవుంది. అదీ వొక సంతృప్తే మోహన్‌రావుకి.

ఇంటర్వ్యూ మధ్యాహ్నం రెండు తరువాతగాని మొదలు కాలేదు. ఆ రోజు కొందర్ని పిలిచి తక్కినవారిని మరుసటి రోజు మధ్యాహ్నం రమ్మన్నాడు.

'వెంకట్రావు ముందు బాచ్‌లోనే అయిపోయాడు. వేసిన ప్రశ్నలకు తడుముకోకుండా జవాబులు చెప్పాడు. అందుచేత ఆ వుద్యోగం వస్తే తనకే వస్తుందన్న ఆత్మ విశ్వాసంతో తనవూరికి వెళ్ళిపోయి, అపాయింట్ ఆర్డర్సుకోసం ఆతురతతో యెదురు చూస్తూ కూచున్నాడు.

నెలా పదిహేనురోజులు గడిచిపోయినా ఎదురు చూసిన ఆర్డర్సు వచ్చేసూచన కనిపించలేదు. వోపిక చచ్చి ఏ విషయమూ కనుక్కుందామని బయలుదేరి ఆ ఆఫీసుకి వచ్చారు.

అక్కడ మోహన్ వొక టేబుల్ ముందు కూర్చుని యేవో కాగితాలు పరిశీలిస్తుండడం చూచి వెంకట్రావు తెల్లబోయాడు.

'మోహన్!' అన్నాడు ఆశ్చర్యంగా.

'ఏమిట్రా అలా తెల్లబోతున్నావు' అన్నాడు మోహన్.

'నీకు... నీకు ఉద్యోగం యిచ్చారా?'

'అవును! జాయినయి పదిహేనురోజులయింది.'

'అసంభవం! ఇది జరగడానికి వీలులేదు.' కోపంగా అన్నాడు.

'ఏమిట్రా పిచ్చికూతలు! ఇంటర్వ్యూలో బాగా ఆన్సరు చేశాను. అర్హతలు వున్నాయి. వుద్యోగం యిచ్చారు' అన్నాడు.

'అలా జరగడానికి వీలు లేదు. ఈ వుద్యోగం నాకేవచ్చివుండాలి.'

'అదేమో నాకు తెలియదు. నన్ను జాయిను కమ్మని ఆర్డర్సు ఇచ్చారు. వుద్యోగం చేస్తున్నాను' అన్నాడు మోహన్. ఇంక అతనితో వాదనపెట్టుకోడానికి ఇష్టంలేక తన దృష్టిని కాగితాలమీదకు మళ్ళించాడు.

వెంకట్రావు తుఫానులా ఆఫీసరు గదిలోకి వెళ్ళాడు. అక్కడ యేం జరిగిందోయేమో మోహన్‌కు తెలియదుగానిపావుగంటగడిచాక అతడు రుసరుసలాడుతూ బయటకు వెళ్ళిపోవడం మాత్రం గమనించాడు మోహన్.

కాసేపటికి ప్యూను అతని దగ్గరకు వచ్చి ఆఫీసరు పిలుస్తున్నారని చెప్పాడు.

మోహన్ మనసులోగందరగోళం బయలుదేరింది అయినా మామూలుగా వుండడానికి ప్రయత్నిస్తూ ఆఫీసరు గదిలోకి వెళ్ళాడు.

ఆఫీసరు ముందు తన పర్సనల్ ఫైలు వుంది.

అతడు ఎగాదిగా మోహన్ను చూశాడు. 'నీ డేట్ ఆఫ్ బర్తు ఏమిటి' అని అడిగాడు.

మోహన్ తడుముకోకుండా చెప్పాడు. అయినా అతని ముఖం మీద చిరుచెమట పడుతున్నది.

అఫీసరు మరే ప్రశ్న వేయలేదు.

'ఇంక నీవు వెళ్ళ వచ్చు' అన్నాడు.

మోహన్ ఇవతలికి వచ్చాడుగాని అతని గుండెలు మాత్రం దడదడ కొట్టుకుంటున్నవి. ఆ రోజంతా ఆఫీసులో అన్యమనస్కంగానే కూర్చున్నాడు. మర్నాడు రెండవ శనివారం తరువాత ఆదివారం కావడం చేత సెలవులు. అది వొకందుకు నయమేననిపించిందతనికి. కాని మనసులో అవ్యక్తమయినఆవేదన.అస్తవ్యస్తమయిన ఆలోచనలు. తలవిపరీతమయిన పోట్లకు గురి అయినట్లు బాధ. అతడు ఇంటికి వచ్చిన వాలకం చూసి లక్ష్మి ఖంగారుపడింది. నుదుటిమీద చెయ్యిపెట్టిచూసింది. జ్వరం పెట్టి పోతున్నది. మోహన్‌కు దృష్టితీసింది. తరువాత డాక్టరుకు చూపించి ఇంజె

క్షను, మందులు ఇప్పించింది. కాని జ్వరం నాలుగురోజుల తరువాతగాని తగ్గుముఖం పట్టలేదు. దరిమిలా అతడు ఆఫీసుకు వెళ్ళలేకపోయాడు సోమవారం నుంచీ.

'ఆఫీసు... ఆఫీసు' అంటున్నాడు కలవరించినట్లుగా.

'ఫరవాలేదు నాయనా! నువ్వేమీ కావాలని ఎగగొట్టలేదు గదా. వొంట్లో బాగాలేనప్పుడు ఏం చేస్తాం? డాక్టరు సర్టిఫికెటు పంపించవచ్చు.'

'అంతే అమ్మా! అంతేలే!' అన్నాడు నీరసంగా.

తనమొదటి జీతంతో తల్లికి, చెల్లెళ్ళకీ యేమేం కొంటాడో చెప్పకుపోతున్నాడు. లక్ష్మికి నవ్వు వచ్చింది.

'అలాగే కొందువు. ఇప్పుడు అవన్నీ ఆలోచించకు.'

జ్వరం తగ్గినా అతని ముఖంలో ఏదో పరాకు, ఏదో చికాకు.

'ఇంకా వొంట్లో నీరసంగా వుందా బాబూ!'

'లేదమ్మా! రేపటి నుండి—'

అతనికెందుకో కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే తల్లి ముఖం చూడలేక తన ముఖాన్ని పక్కకు తిప్పుకున్నాడు. తనమీద అన్ని ఆశలు పెట్టుకున్న తల్లితో తన మనసును కలవరపెడుతున్న విషయం యెలా చెప్పకో గలడు. కాని అది ఎంత కాలమని దాగుతుంది. ఆ రాత్రి ఏడు గంటల సమయానికి పోలీసులు వచ్చి మోహన్ చేతికి సంకెళ్ళు వేస్తూ వుంటే లక్ష్మి కొయ్యబారిపోయింది.

# 19

'లాయర్‌గారూ నా మోహన్‌ను ఎలాగయినా రక్షించండి. మీకు ఎంతఫీజు కావాలన్నా ఇచ్చుకుంటాను. వాడు చాలా అమాయకుడండీ.'

లక్ష్మి కళ్ళల్లో బొటబొటా నీళ్ళు కారుతున్నవి.

'నా శాయశక్తులా ప్రయత్నిస్తానమ్మా! కాని నాకు విశ్వాసంలేదు. ఇది ఫోర్జరీ కేసు. ఉద్యోగ నిబంధనలనుబట్టి అతనికి వయసు దాటిపోయింది. అది కొద్దికాలమే కావొచ్చుగాని ప్రభుత్వ నిబంధన నిబంధనే వారైే దాన్ని సడలించాలిగాని దానికి ప్రత్యామ్నాయం యేమీలేదు. మీ

వాడు చాలా నేర్పుగా స్కూల్ సర్టిఫికేట్‌లో తను పుట్టిన తేదీ మార్చి వేశాడు. ఇది ఫోర్జరీనే గాకుండా ఎంబెజిల్‌మెంట్. అంటే ప్రభుత్వాన్ని మోసం చేసి ఉద్యోగం సంపాదించడం' అన్నాడు లాయర్ రంగనాథం.

'మీ ఋణం వుంచుకోను లాయర్‌గారూ. వాడికా వుద్యోగం లేక పోయినా ఫరవాలేదు కాని జైలు పాలు కాకుండా చూడండి.'

'చెప్పానుగదమ్మా ఎంతో ఆరితేరిన చెయ్యి అయితే తప్ప ఇంత నేర్పుగా ఫోర్జరీ చేయడం జరగదమ్మా. అతనికి ఉద్యోగం దొరకదేమో నన్న ఆందోళనతో దాని పర్యవసానాలు తెలియక అలా చేశాడన్న పాయింటుతో కేసును లాగాలి.'

'అలాగే చేయండి లాయర్‌గారు. వాడ్ని మాత్రం ఎలాగయినా రక్షించండి.'

లాయరు ముందు చెప్పిందే చెప్పి చాలాసార్లు మొరపెట్టుకుంది లక్ష్మి. ఆమె మొర లాయరు ఆలకించినా-కోర్టుగాని, దేవుడుగాని ఆలకించ లేదు.

వెంకట్రావు చేసిన అభియోగంమీద ఆఫీసు వారు మోహన్‌యొక్క స్కూలు, కాలేజి రికార్డులను పరిశీలింప చేయడం జరిగింది. మోహన్ తన పుట్టిన తేదీని మార్చి ప్రభుత్వాన్ని మోసగించినందుకుగాను అది క్షమించ రాని నేరమై పోలీసు కంప్లయింటు ఇచ్చి అతడ్ని అరెస్టు చేయించడం, కేసు కోర్టుకు వెళ్ళడం జరిగింది.

ఆ కోర్టు వాతావరణమూ, ఆక్రాయి పరీక్షలు చూచి మోహన్ హడలిపోయాడు. తన నేరాన్ని అంగీకరించక తప్పలేదు అతనికి.

అతనికి రెండు సంవత్సరాల కఠిన శిక్ష పడింది. అదీ జడ్జిగారు కాస్త దయతో కేసుని సమీక్షించడం వల్ల జరిగింది. లేకపోతే శిక్షాకాలం ఇంకా అధికంగానే వుండవలసింది.

లాయరు రంగనాథం ఇంక తను చేయగలిగింది యేమీ లేక తల దించుకుని వెళ్ళిపోయాడు.

తను ప్రాణానికి ప్రాణంగా పెంచిన మోహన్ను పోలీసులు బేడీలు వేసి జైలుకు తీసుకు వెళ్తూవుంటే లక్ష్మి చూడలేకపోయింది.

ఆతడ్ని గట్టిగా వాటేసుకుని భోరున యేడ్చింది.

మోహన్ లక్ష్మి వైపుకు తన ముఖాన్ని తిప్పలేకపోయాడు. పోలీసు వారు వీళ్ళ యేడ్పుతో నిమిత్తం లేకుండా మోహన్ని లాక్కు వెళ్ళి వాన్‌లోకి తోసి తీసుకు వెళ్ళిపోయారు.

లక్ష్మికి ప్రపంచమంతా శూన్యంగా తోస్తున్నది.

మోహన్ ఇలాంటి పనికి మళ్ళీ సాహసిస్తాడనుకోలేదు. కనీసం ఈ విషయాన్ని తనతో వొకమాటు ముందుగా చెప్పివుంటే వ్యవహారం ఇంత దూరం వెళ్ళి వుండేదికాదు. ఆ వుద్యోగం చెయ్యి దాటిపోతుందేమోనన్న ఆత్రుతతో చాలా తొందరపడ్డాడు మోహన్.

ఎంత దీక్షతో చదివాడు! ఎంత గొప్పగా మార్కులు తెచ్చుకున్నాడు!

కానీ ఏం లాభం! అంతా బూడిదపాలయిన పన్నీరయింది.

ఇంక మోహన్ భవిష్యత్తేమిటి? తమ కుటుంబం భవిష్యత్తేమిటి? తమ సమస్తమూ మోహన్ చదువుకు ఖర్చు అయిపోయింది. మిగిలిన కాస్తా కేసు కోసం వ్యయమయిపోయింది.

ఇరుగూ పొరుగూ యెంతో సానుభూతితో మాట్లాడినా 'అంత మంచి కుర్రవాడు ఇదేం పాడుబుద్ధి! ఇంకానయం శిక్ష రెండేళ్ళతో పోయింది. లేకపోతే అయిదేళ్ళో ఏడేళ్ళో పడతాయటగా' అని అనసాగారు.

ఈ కేసు హైకోర్టుకు వెళ్ళినా లాభం వుండదని తెలుసుకున్నాక లక్ష్మి మోహన్ విడుదల విషయం పూర్తిగా నిరాశ చేసుకుంది.

రెండు సంవత్సరాలు.

తన మోహన్ కఠిన కారాగారశిక్షననుభవిస్తున్నాడు. లక్ష్మి మనసు కుమిలిపోతున్నది.

ఏది ఎట్లా వున్నా తాను రెండేళ్ళు వోర్చుకోక తప్పదు.

ఇంక అతనికి ప్రభుత్వోద్యోగం దొరకడంకల్ల. తన బంగారుకల భగ్నమయిపోయింది. తనుపడ్డ శ్రమ అంతా ఈనగాచినక్కలపాలయినట్టయింది. కాని తను జీవించి వుండాలి. మోహన్‌కోసం-ఇద్దరు ఆడపిల్లల కోసం. వొంటిమీద వున్న వొకటి రెండు ఆభరణాలకన్నా మరో ఆధారం లేదు. తను మెట్రిక్ పాసయినా ఈ వయసులో తనకు తగిన ఉద్యోగం

యేం దొరుకుతుందని! అయినా ప్రయత్నించింది. ఆ వూళ్లోనే కాన్వెంట్ స్కూల్లో ఆయా వుద్యోగం దొరికింది. అదే పదివేలు అనుకుంది.

వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడుగా అప్పడాలు వగయిరా తయారు చేసేది. సంసారం వీధిన పడకుండా నెట్టుకు వస్తున్నది.

ముద్దనోటి దగ్గర పెట్టుకుంటే మోహన్ గుర్తుకు వచ్చేవాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి. ఏం తింటున్నాడో ఎలా అతని కాలం గడుస్తున్నదో—

'అన్నయ్య యెక్కడికి వెళ్ళాడే? ఎప్పుడు వస్తాడే?'

పిల్లలు రోజూ అడుగుతుంటే ఆమె ప్రాణం తల్లడిల్లిపోయేది.

రోజులు భారంగా గడుస్తున్నవి.

సంవత్సరం గడిచింది. మరో సంవత్సరమూ నిదానంగా గడుస్తున్నది. జైల్లో అతని ప్రవర్తన బాగా వుంటే శిక్షా కాలం తగ్గించబడుతుందని చెప్పారు.

ఈ వొక్క విషయంలో తప్ప మోహన్ ప్రవర్తన ఈ కాలం కుర్రవాళ్ళకి యెవరికి అబ్బుతుందని! అతడు తప్పకుండా యేణ్ణర్ధానికంతా బయటపడగలడని విశ్వసించింది.

ఆ విషయమే కనుక్కోడానికి వొకసారి జెయిల్ సూపరింటెండెంట్‌ని చూచి మాట్లాడుదామని వెళ్ళింది.

కాని ఆమె ఆశించి వెళ్ళింది వొకందుకు. జరిగింది మరొకటి.

మోహన్‌కు శిక్ష మరి రెండేళ్ళు పొడిగించబడిందట!

లక్ష్మికి యేమీ బోధపడలేదు.

'ఎందుకండీ! మళ్ళీ యేం జరిగింది?'

'తన తోటి ఖైదీ తప్పించుకోడానికి సహాయపడ్డాడు. తనూ తప్పించుకోడానికి ప్రయత్నించాడు.'

'నిజమా—'

'మీతో అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమీ లేదమ్మా!'

'అతణ్ణి వొక్కసారి చూడాలి—'

'వీలు పడదమ్మా అతడీ జెయిల్లో లేడు '

'మరి...'

'క్షమించండమ్మా! ఆ విషయం చెప్పకూడదు.'

లక్ష్మి దుఃఖాన్ని తమాయించుకోలేక వలవలా యేడ్చేసింది.

'మోహన్, మోహన్ ఎందుకిలా చేస్తున్నావు' అంటూ.

మరో రెండేళ్ళు గడవాలి. మరో రెండేళ్ళు గడవాలి.

మోహన్ విషయంలో ఆమె ఆశలన్నీ నిరాశలే అయినవి. ఇరుగు పొరుగు వారికి యేమని జవాబు చెప్పడం. ఈ రెండు సంవత్సరాలయినా జెయిల్లో కుదురుగా వుంటాడా? ఒకసారి శిక్షకు పాల్పడికూడా మళ్ళీ అటు వంటి నేరానికి ఎందుకు వొడిగట్టినట్టు? తను ప్రేమతో ఆదర్శ మార్గంలో పెంచిన మోహన్ అందుకు భిన్నమయిన మరొక మోహన్ పెరుగు తున్నాడా? అతడు యే స్వరూపంతో బయట పడతాడో ఎలాంటి సంఘ విద్రోహక చర్యలు చేస్తూ జీవిస్తాడో లక్ష్మి వూహించుకోలేకపోయింది. ఈ పరిస్థితిలో ఈ పరిసరాలల్లో తాను జీవితం వెళ్ళబుచ్చడం కష్టం. మరే వూరయినా వెళ్ళిపోవాలి. అజ్ఞాతంగా కాలం గడపాలి. తన కడుపున పుట్టిన ఈ ఇద్దరు పిల్లల్నీ పెంచి పెద్దవాళ్ళను చేసి గౌరవప్రదమయిన జీవితంలో అడుగు పెట్టేట్టు చేయడం తన కర్తవ్యం. దీన్ని తను విస్మరించలేదు.

యెక్కడికైనా వెళ్ళిపోవాలని మనసుధృఢంగా సంకల్పించుకున్నా మోహన్‌పట్ల మమకారం ఆమె మనసును పీకుతూనేవుంది. రెండేళ్ళ తర్వాత విడుదలై తమను వెతుక్కుంటూ వస్తాడేమో. అప్పుడు తాము కనుపించకపోతే యేమైపోతాడు? మోహన్ తమను వెతుక్కుంటూ తప్పక వస్తాడు. అతడు వచ్చేవరకు ఎదురు చూడడమే మంచిదని లక్ష్మి తను వూరు విడిచే నిర్ణయాన్ని మార్చుకున్నది. బరువుగా కదులుతూ మరో రెండేళ్ళు గడచి పోయాయి. ఇదుగో వస్తాడు, అదిగో వస్తాడు అని మోహన్ కోసం యెదురు చూడసాగింది. కాని అలా నెలా, రెండునెలలూ గడిచినా మోహన్ వచ్చే సూచన కనుపించలేదు. మరి అతడు ఏమైనట్టు? మళ్ళీ యేదయినా గొడవచేసి శిక్షా కాలాన్ని పెంచేట్టు చేశాడా? ఆమె మనసు మోహన్ విషయంలో యేదో కీడును శంకిస్తున్నది. తన మనసులో ఆదుర్దా యెవరితో చెప్పుకోగలదు! పెద్ద పిల్ల సుధకి మోహన్ బాగానే

గుర్తుకు వస్తున్నాడు కాని చిన్నపిల్ల తనకు వొక అన్నయ్య వున్నాడన్న సంగతే మరిచిపోయింది.

'నీ కొడుకు ఇంకా విడుదలకాలేదా?'

ఇరుగుపొరుగు అమ్మలక్కల యక్ష ప్రశ్నలు. ఇంకా ఎంతకాలమని యెదురు చూడడం?

మనసులో కల్లోలాన్ని తట్టుకోలేక రాత్రిళ్ళు కుమిలి కుమిలి యేడ్చేది. రోజులు దొర్లిపోతున్నవి. మోహన్ రాలేదుగాని అతని దగ్గర నుండి ఉత్తరం మాత్రం వచ్చింది. ఆతురతతో విప్పింది కవరును. అది ఏవూరునుంచి రాసింది తెలీదు. ఎన్నాళ్ళ క్రితం రాసింది తెలీదు.

అమ్మా-

నిన్ను ఈ విధంగా పిలిచే యోగ్యతను నేను ఆనాడే పోగొట్టుకున్నాను. నీవూ, చట్టమూ కూడా క్షమించరాని నేరంచేసి అందుకుతగిన శిక్షనే అనుభవించానమ్మా. ఆ నరకం పగవాడికి కూడావద్దు. తెలియని చాపల్యంతో తాకినా నిప్పునిప్పే. అది చేతిని కాల్చక మానదు, ఆ బాధను భరించకాతప్పదు. ఆ మచ్చ జీవితాంతం అలావుండిపోకా తప్పదు. నాకు శిక్ష పూర్తిఆయి విడుదల అయ్యానమ్మా. కాని నీ దగ్గరకు రావడానికి లజ్జగా వుంది. నాకోసం యెన్నో త్యాగాలు చేసిన నీకు ప్రతిఫలంగా నీకొడుకు పలానా పనిచేశాడు అని నలుగురిచేతా వేలెత్తి చూపించుకునే స్థితికితెచ్చాను. ఏముఖం పెట్టుకుని నీదగ్గరకు రానమ్మా? అందుకనే వెళ్ళిపోతున్నాను. ఎక్కడికని చెప్పలేను. నేను సమాజంలో మళ్ళీ యోగ్యతను సంపాదించుకో గలిగితే అప్పుడువచ్చి నీ పాదాలమీదవాలి క్షమాభిక్ష కోరుతాను. నాకు తెలుసునమ్మా. లోకంలో నన్నెవరూ క్షమించకపోయినా నీవు క్షమించగలవని! ఈ నిర్భాగ్యుడు చెల్లెళ్ళను యేమని దీవించగలడు?

మోహన్.

లక్ష్మి ఆ ఉత్తరాన్ని పదే పదే చదువుకున్నది. చివరికి మన జీవితాలు ఇట్లా పరిణమించాయా మోహన్ అని చాలాసేపు యేడ్చింది. ఇంక తను ఈ వూళ్లో తలెత్తుకు తిరగడం దుష్కరం. ఈ వూరువిడిచి వెళ్ళిపోవాలి. ఎక్కడికి? మనసులో మోహన్ మీద మమకారం! ఉద్యోగాన్వేషణలో ఏవూళ్ళో వున్నాడో! అతని జీవితం తెగిన గాలిపటం కాకూ

డదు. అతణ్ణి అన్వేషించాలి. కాని ఏవూరనివెతకడం.ముందు హైదరాబాద్ వెళ్ళి తన రెక్కల కష్టంమీద బతుకుతూ మోహన్‌ను వెతకాలి అని నిర్ణయించుకుంది లక్ష్మి. అప్పడాలు వగయిరాఅమ్ముతూ నాలుగు వీథులు తిరుగుతూ మోహన్ కోసం గాలిస్తున్నది. కాని వరలక్ష్మమ్మ అభ్యర్థనతో ఆ అవకాశమూ పోయింది.

# 20

వివాహమైన దగ్గరనుండి భాగ్యలక్ష్మిగా వ్యవహరింప బడుతున్న తమ వరలక్ష్మమ్మ పేరడగగానే అప్రయత్నంగా 'సుభద్ర' అని తన అసలుపేరు చెప్పేసింది. వరలక్ష్మమ్మ మంచిమనసూ, ఉన్నత సంస్కారమూగల ఇల్లాలు కావడంచేత తనగతవిషయాలు ఆరాతీయకుండా తనను తమ కుటుంబవ్యక్తిగానే గౌరవిస్తుండడంచేత సరిపోయిందిగాని లేకపోతే తమ తన పూర్వచరిత్రను చెప్పుకోగలిగేదా! మరుగున వుండవలసిన కథ అంతా ఇప్పుడు వొక పోలీసు అధికారి యెదుటనే ఆవిష్కరింపబడుతూ వున్నది. ఇదంతా మోహన్ ఎందుకు చెబుతున్నట్టు? మోహన్ మాధవ రావుగా ఎందుకు మారినట్టు?

సుభద్ర తన ఆలోచనల్లోంచి తెప్పరిల్లేసరికి మోహన్ తను పెరిగిన వైనం జెయిలుకు వెళ్ళవలసిన పరిస్థితీచెప్పి తన జెయిలు అనుభవం చెబుతున్నాడు. సుభద్ర ఆసక్తిగా వినసాగింది.

o o o

'ఆ దొంగ సచ్చినోడికి కడుపు మండిపోయి ఆఫీసరుకు రిపోర్టు సెయ్యకుండావుంటేనువ్వీపాటికిఇంజనీరుగాయెలిగిపోతూండేవోడివన్నమాట ఆదొంగ నాయాలికి నీఅపిలికేషను ఎందుకు సూపిచ్చావంట' అన్నాడు గంగులు.

'వివరాలు సరిగ్గావున్నాయో లేవో చూడమన్నాను. వాడు వున్న మాటే అన్నాడు. వాడుచెప్పినట్టువిని వూరుకుంటే ఈ తిప్పలేరాకపోను.'

'ఏం సేద్దాం కరమరాత రాజ్యవేలాలనుంటే గాశారం గాడిదలు గాయిస్తుందంటార్లె ఈ లాంటి ఇశయాల్లో శానా జాగర్త అవసరంబాబూ.

అద్సరేగానీ వుట్టి ఫోర్జరీతేనా, జేబులు వగయిరా కొట్టెయడం లాంటివి యేమైనా చేతనౌనా? అస్సలు నీముఖం జూ త్తేయేవీయెరీగనోళ్ళావుంటావు. ఈ పనెట్టా సేశావబ్బా. ఎంతో గుండెధైర్నం వున్నోడుతప్ప సెయ్యలేడే!'

'ఈలాంటి పనికి గుండెధైర్యం కావాలని నాకు మొదటతెలీదు. చూసింది చూసినట్టు కాపీ చేసే నేర్పు వుందినాకు. డ్రాయింగులో నేర్పు వుండడంచేత అంకెలూ అవీకూడా సులభంగానే మార్చగలను. ఆ తెలివి తోనే ఈ తెలివి తక్కువపనిచేసి ఇలా ఇరుక్కుపోయాను' అన్నాడు మోహన్.

గంగలు తదేకంగా మోహన్‌కేసిచూస్తూ వున్నాడు. అతనిబుర్రలో యెన్నెన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నవి.

మోహన్ గంగులువైపు అమాయకంగా చూస్తూవున్నాడు. అతనా జెయిల్లోకి వచ్చి మూణ్ణెల్లకుపైనే అయినా మోహన్‌తో సన్నిహితంగా వచ్చింది వారంక్రితం నుండే. అతనికీ రెండేళ్ళ శిక్షే.

'అసలు నీకిక్కడినుండి బయటపడాలనిపించడంలా?' అడిగాడు గంగులు అదోలాచూస్తూ. మోహన్ నిస్పృహగానవ్వాడు. 'అదంతతేలికా?'

'నేనో వుపాయం ఆలోచించాలే. నువ్వు కాస్త సాయంజేత్తివా, మనిద్దరం బయట పడగలం.'

'పోలీసులు మళ్ళీ పట్టుకుంటే చావగొడుతారు.'

'పారిపోవడంగాదొశెహే. దర్జాగా కోర్టునుండి విడుదలకు ఆర్డరు తెప్పించుకునిమరీ.'

'అదెట్లా వీలుపడుతుంది?'

'సెబుతాగా. నువ్వు యెవరి సంతకమైనా వున్నదున్నట్టు సేసెయ్య గలవు గందా.' గంగులు తన పథకం చెప్పడం ప్రారంభించాడు. మోహన్‌కు సన్నగా వణుకు పుట్టుకొచ్చింది. అలా చేయడం సాధ్యమా? ఆవిషయాలన్నీ మోహన్‌కు ఆయోమయంగావుంది. మనుషులు ఇంతతెలివి మీరివుంటారా? గంగులుకి బంధువులమంటూ చెప్పుకుంటూ వొకరిద్దరు అప్పుడప్పుడూవచ్చి అతణ్ణి పరామర్శించిపోతూవుంటారు. వారు ఎంతో రహస్యంగా తెచ్చారు ఒక జడ్జీగారి సంతకం నమూనా, నకిలీ ఆర్డరూ.

ఆ రాత్రి బీటు పోలీసు గమనించకుండా ఆ నకిలీ ఆర్డరుమీద ఆ జడ్జిగారి సంతకం లాగే తను సంతకం చేసి ఇచ్చాడు-తను అసలు ఇందుకు వొప్పుకుని వుండేవాడేకాదు. గంగులు మాటలకి తాను పూర్తిగా కరిగి పోయాడు.

'పాపం మీ యమ్మగోరు నీ కోసం యెంత కొట్టుకులాడిపోతోందో!'

తల్లి ప్రసక్తి వచ్చేసరికి మోహన్‌కు దుఃఖం వచ్చి వలవలా యేడ్చాడు.

'ఆడపిల్లలా యేంటి యేడుత్తూ కూకున్నావ్. దైర్నంగ వుండాల. నెల తిరిగేలోగా ఇద్దరం బయట దర్జాగా వుండం...' అన్నాడు

ఏదో ఆశపుట్టింది. ఈ అవకాశం కలిసి రాకూడదా అనుకున్నాడు. గంగులు తెచ్చింది వొక ఆర్డరే. ఆ సంగతే అడిగాడు మోహన్.

'ఇద్దరికి వొక్కసారే తెప్పిత్తే అనుమానపడరూ. ముందు నేను బయటపడి వారం రోజులకల్లా నువ్వు మీ వాళ్ళ దగ్గరుండేట్టు చేస్తాను' అన్నాడు.

'మరి నువ్వెప్పుడు బయటపడతావు?'

'వోయబ్బో ఇంక కొన్నాళ్ళు పడుద్దిలే. ఈ సారి మావోళ్ళు రావాలా ఆళ్ళు దీన్ని పట్టుకెళ్లాలా దీనిమీద కోర్టు ముద్దరేయించాలా ఇంకా సానా పనుందిలే...'

దాదాపు మరో నెల గడిచింది. అన్నట్టుగానే గంగులు విడుదల ఆర్డరు, అదే మోహన్ సంతకం పెట్టింది కోర్టు ముద్రతో వచ్చింది. అతని కేసు రివ్యూ చేయబడిందనీ అతనిమీద కేసు తప్పుడు అభియోగం మీద జరగడంచేత ఆ కేసు రద్దు చేయబడిందనీ ఆ ఆర్డరు. మీసాలు మెలి పెట్టుకుంటూ గంగులు బయటకు వెళ్ళిపోయాడు.

మోహన్ ఇంక తన విడుదల యేర్పాటుకోసం యెదురు చూస్తూ కాలం గడుపుతున్నాడు. అతడు ఆశించినట్టు విడుదల ఆర్డరు యెన్నాళ్ళకూ రాలేదు సరికదా అసలు విషయం బయటపడింది వొకనాడు. జెయిలు సూపరింటెండెంట్‌కి అదే కోర్టు నుండి గంగుల్ని వెంటనే హైదరాబాద్ సెంట్రల్ జెయిలుకి ట్రాన్స్‌ఫర్ చేయవలసిందని వుత్తర్వులు

వచ్చాయి. అది చూచి హడలిపోయిన సూపరింటెండెంట్ అతని విడుదల పత్రాన్ని వెతికి బయటకు తీయించి పట్టుకుని కోర్టుకు పరుగెత్తాడు. అక్కడే తేలింది అది నకిలీ ఆర్డరని.

మళ్ళీ కేసు-మళ్ళీ విచారణ. క్రాస్ పరీక్షలో మోహన్ బయట పెట్టక తప్పలేదు. కాని ఈసారి కొంత ధైర్యం చేసి అబద్ధం చెప్పాడు. అలా సంతకం పెట్టి ఇవ్వకపోతే తన వాళ్ళను చంపిస్తానని గంగులు బెదిరించాడని. ఈ విషయం యెవరికయినా తెలిసినా అంతపనీ జరుగుతుం దన్నాడనీ. అయినా తనకు శిక్ష పొడిగించటం తప్పలేదు. ఆ జెయిల్లోంచి మరో జెయిలుకి మార్పు. ఇక్కడ మరీ దారుణంగా పని చేయించేవారు తనచేత. ఎప్పుడూ తల్లి గుర్తుకు వస్తూ వుండేది. దుఃఖం ముంచుకువచ్చేది కాని ఏం చేయగలడు.

గంగులు హాయిగా తప్పించుకున్నాడు. తనకే వేలునాకి వ్రతం చెడిందన్నట్టు మళ్ళీ యీ రొంపిలోకి కూరుకుపోవడం జరిగింది. తనకు తనమీదే అసహ్యంగా వున్నది. ఈ స్థితిలో తల్లినీ చెల్లెళ్ళనూ యే ముఖం పెట్టుకుని చూడడం-మరోసారి ఈ నీచత్వానికి వొడిగట్టినందుకు తల్లి తనను చీదరించుకుంటే—ఏమయినా విడుదలయ్యాక సమాజంలో గౌర వంగా నిలబడే స్థానం లభించే వరకూ తన వాళ్ళ దగ్గరకు వెళ్ళకూడదు అంటున్నది అంతరాత్మ. శిక్షా కాలం పూర్తి అయి అతనికి జెయిలునించి విముక్తి కలిగింది.

తల్లినీ చెల్లెళ్ళనీ చూడాలని మనసు యెంతగా తపించిపోతూవున్నా తన నిర్ణయాన్ని మార్చుకోలేదు మోహన్. మరో ఆలోచన చెయ్యకుండా రాత్రికి రైలెక్కి మరుసటిరోజు వుదయానికల్లా హైదరాబాదు వీధుల్లో తిరుగుతున్నాడు మోహన్. ఏ కంపెనీలోనయినా మంచి వుద్యోగం సంపా దించుకోవాలి. ఎట్లా? ఈ వాలకం చూస్తే తనను కంపెనీ గడపైనా తొక్క నివ్వరే! మోహన్ ఆలోచిస్తూ వెడుతున్నాడు. తన సమీపం నుంచి దూసుకువెళ్ళిన వోడంత కారొకటి అల్లంత దూరం వెళ్ళి ఆగి అలాగే వెనక్కి వచ్చి తన వద్ద ఆగింది.

అందులో డ్రయివరు తప్ప ఎవరూ లేరు. గుబురు మీసాలు,

తెల్లటి యూనిఫారమ్, కౌంటీకాప్ ధరించి వున్నాడతను. తనను యెగా దిగా చూసి తలుపుతీసి లోపలికి రమ్మన్నట్టు తల ఆడించాడు. మోహన్ విస్తుపోయి చూశాడు.

'అలా సూత్తా నిలబడక గబాల్న లోపలకొచ్చిసెయ్' అన్నాడు.

కంఠం గుర్తుపట్టాడు. గంగులు.

'గంగులూ' అనబోయాడు ఆవేశంతో.

'ముందు కారెక్కు. నింపాదిగా మాట్లాడుకుందాం.'

నడిరోడ్డు- జనం పోగవుతారేమోనన్న భయం. చటుక్కున కారెక్కి అతని పక్కన కూర్చున్నాడు- కారు కదిలివెడుతున్నది.

'గంగులూ!' అన్నాడు పళ్ళు కొరుకుతూ.

'కూకలెట్టమాక. కూకో- మొత్తానికి ఇడుదలయిందన్నమాట.'

'నన్ను ఇరికించి నువ్వు తప్పుకున్నావుగదూ? నువ్వు దగాకోరువి.'

'నీ దగ్గరి కొద్దామని ఆర్డరు కాయితం టయిపు కూడా సేయించాను. నాయాల్ది ఇంతలో గల్లంతై పోనాది. నాతోడు. నేకపోతే నువ్వీపాటికి హాయిగా వుండీవోడివి.'

'నమ్మ తగ్గమాటేనా?'

'నేను కటకటాలు తప్పించుకోడానికి అంత సాయం జేసినోడివి. నిన్ను దగా సేత్తానా?'

'నిన్ను పోలీసులు పట్టుకోలేదా?'

గంగులు గలగలా నవ్వాడు.

'ఈ యేశంలో నువ్వు నన్ను పోల్చుకోగలిగావా? పోంటాక్ కారు నడుపుతున్నాను. పోలీసోళ్ళు కాదుగందా నాయాల్ది ఆ బెమ్మదేవుడుకూడా పోల్చుకోలేడు' అన్నాడు గంగులు ధీమాగా.

తనలో యెంత ఆవేశం వున్నా ప్రస్తుతం గంగుల్ని యేమీ చేయ లేనని తోచింది అతనికి. అయినా గంగుల్ని ఆటపట్టించాలని-

'ఇప్పుడు నీ సంగతి పోలీసులకు చెపుతాను' అన్నాడు.

'సెప్పు! భయపడతాననుకున్నావా? ఏత్తే మా రెండేళ్ళు ఖైదులో యేత్తారు. అంతే గందా. నా కిట్టాంటివన్నీ అలవాటే. కానీ నీ ముందు

నూరేళ్ళు బతుకుంది జాగరత. నీ యెనకాతలే వుండి నీ యెనక మద్దెల దరువు యేత్తూ వుంటాను. నా తడాకా నీకు తెల్దు' అన్నాడు.

పగపట్టిన తాచులా వెంటపడతాడేమో. మోహన్ మనసుభయంతో కంపించిపోయింది. మౌనంగా వుండిపోయాడు.

ఒక్క జైల్లో వున్నంత మాత్రాన తనకూ ఇతనికీ భేదంలేదా? ఇంక తన జీవితం అంతా యింతేనా! మోహన్ ఆలోచనలు యెటో పోతున్నవి. పరధ్యానంగానే తన విషయం చెప్పాడు.

'నీ పిచ్చిగాని వుజ్యోగాలు యీదులెంబడి దొరుకుతాయా? జరిగిందంతా పీడకల అనుకుని మరచిపో. ఇయ్యాల్టినుంచి నీ బతుకు మారిపోద్ది.'

'అంటే?' అన్నాడు అయోమయంగా.

'ఎంత సెడ్డా నువ్వు ఇంజినీరువి గదా. నీ సదువు వూరికేపోదులే. నా యెంటపద. ముందీ బిచ్చగాడి యేసం మార్చు. తరువాత సంగతి చెపుతాలే.'

కారు యేదో భవంతి ఆవరణలోకి వెళ్ళింది. అది షఫైర్ నైట్ క్లబ్బు. గంగులు వెళ్ళి క్లబ్బు సెక్రటరీతో యేదో రహస్యంగా చెప్పాడు. అంతే అతను వచ్చి మోహన్‌ను సగౌరవంగా తీసుకువెళ్ళి వొక ఎయిర్ కండిషన్డు రూంలో ప్రవేశపెట్టాడు. కాస్సేపటికి గంగులు తనకు రెండు మూడు జతల మంచిబట్టలు తెచ్చాడు.

'మనబాస్ బొంబాయి యెళ్ళాడు. రెండు మూడు రోజులకి గాని రాడు. అందాకా నువ్విక్కడే హాయిగా తిని, తొంగో. అంతలో నీ రంగే మారిపోద్ది. నీ కేం కావాలన్నా మోమాటం యెట్టుకోకుండా చెకెట్రీనడుగు' అన్నాడు గంగులు.

మోహన్ తలూపాడు. వారిరాజోపచారాలకుతన్మయుడై పోయాడు. మధ్యాహ్నం భోజనంచేసి పడుకున్నవాడు సాయంత్రం యేడింటికి గాని మెలకువరాలేదు. ఒద్దికంగా కప్పుకేసి చూస్తూ అలాగే పడుకున్నాడు. కిందనుండి సన్నగా పాశ్చాత్య సంగీతం వినిపిస్తున్నది. ఇన్నాళ్ళకు మళ్ళీ సంగీతం. మనసులోయేదో ఆవేశం పరవళ్ళుతొక్కింది. లేచి బట్టలుమార్చుకొని కిందకు వచ్చాడు. అప్పటికి ఆర్కెస్ట్రా ఆ ట్యూను వాయించడం పూర్తి చేసింది. మరోటి మొదలు పెట్టడానికిసన్నద్ధమౌతున్నది. మోహన్

మ్యూజిక్ డైరెక్టరు దగ్గరకు వెళ్ళి అడిగాడు తాను వయోలిన్ సోలో, వాయిస్తానని. అతడు మొదట కాస్త విస్తుపోయినా చేతికి వయోలిన్ ఇచ్చాడు. ఉత్సాహంతో మోహన్ వయోలిన్ సోలో ఆ క్లబ్బు శ్రోతలకు అపూర్వంగా వుండి అతిలోక పారవశ్యాన్ని కలిగించింది.

# 21

'నీది జాలిపడదగ్గకేసే అయినా వొక జడ్జిగారి సంతకం కూడా ఫోర్జరీ చేయగలిగిగావంటే నీవు చాలా ఘటికుడివిఅయివుండాలనిపిస్తోంది.' అన్నాడు భుజంగరావు.

ఠీవిగా వున్న భుజంగరావు విగ్రహాన్ని తలెత్తి చూడలేక తికమక పడుతున్న మోహన్ ఆయన ఈ మాట అనడంతో అతనికి శిరస్సుమరింత కిందకి వంగిపోయింది. తన విషయాలన్నీ పూర్తిగా గంగులు ఆయనతో చెప్పి, 'ఈయనకు బయట వుజ్యోగాలుదొరకడంకష్టం- నన్నాదుకున్నట్టు తవరే ఈయన్ను కనికరించాలి. చాలా తెలివయినవోడు. యేదో తెలీక తప్పు సేశాడు' అని తనను గురించి సిఫార్సు చేశాడు గంగులు. ఇప్పుడాయన ధోరణి చూస్తే తనమీద యేదో పెద్ద అనుమానం పెట్టుకున్నాడనిపిస్తోంది ఏమని చెప్పాలో తోచడం లేదు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయినయ్.

'నీ సర్టిఫికెట్లు దగ్గరున్నాయా?'

'అవన్నీ కోర్టులో ఇరుక్కున్నాయి. మళ్ళీ యూనివర్శిటీ నుండి డూప్లికేట్లు తెప్పించాలి.'

'వాటిని నువ్వే సృష్టించగలసమర్థుడివి.' అతడు వికటంగానవ్వాడు పెద్ద జోకు వేసిన వాడిలా.

బతుకు అపహాస్యంగా తోస్తున్నది. మనసు కుమిలిపోయింది.

'ఇంజనీరుగా వెలిగిపోవలసినవాడివి ఇటుకలు మోసేవాడి స్థితికి చేజేతులా తెచ్చుకున్నావుగదా. నేనూ వున్నమాటే చెబుతున్నాను. నాచేతి కింద చాలా కంపెనీలూ, వొక బాంకూ వున్నాయి. ప్రస్తుతం వొక కన్‌స్ట్రక్షన్ కంపెనీకి అర్కిటెక్టు చాలా అవసరమనుకో. ఒకవేళ నిన్ను

అపాయింటు చేసుకుంటాను. నువ్వు మళ్ళీ అలాంటిపని చేయవని నమ్మక మేమిటి? అవసరం అయితే రేపు నా సంతకమే ఫోర్జరీ చేసి నా కంపెనీలు దివాలా తీయించవచ్చుగదా!'

దెబ్బతిన్నట్లు చూశాడు మోహన్. 'ఇంతటి శిక్ష అనుభవించాను. ఇంకా అటువంటి తెలివితక్కువ పనియెందుకు చేస్తాను?'

'అది తెలివితక్కువ పనిగాదు. చాలా తెలివైన పని. నీకు నా దగ్గర వుద్యోగం కావాలంటే చాలా కఠినమయిన నిబంధనలు పాటించవలసి వుంటుంది' అన్నాడు.

'చెప్పండి.'

'ముందు నీ పేరు మార్చుకోవాలి. ఎందుకంటే నీ పేరు కోర్టు కెక్కింది. జెయిలు రిజిష్టరులోకి ఎక్కింది. రేపు యెవరికయినా ఈసంగతి తెలిస్తే నీలాంటివాడ్ని చేరదీసినందుకు నా కంపెనీ పరువు గంగలో కలుస్తుంది.'

'మీ యిష్టం వచ్చిన పేరు పెట్టండి. నా కభ్యంతరం లేదు అలా చెలామణి కావడానికి.'

భుజంగరావు కాసేపు ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టాడు. 'ఏదో వొకటి- మాధవరావు అనుకో మాటవరసకు.'

'అలాగే! తరువాత.'

'నా దగ్గర పనిచేస్తున్నంత కాలం నీవు ప్రయివేటుగా వేరే పనులు చేయకూడదు. మన కంపెనీ పనులూ డైరెక్టుగా డీల్ చేయకూడదు. నీవు చేయవలసిన ప్రతీ పని నేను కేటాయిస్తాను.'

'అలాగేనండి.'

'నేను ఏ పని చెప్పినా, ఏ వేళ చెప్పినా చేయడానికి సిద్దంగా వుండాలి. ఎదురు ప్రశ్న వేయకూడదు.'

'సరేనండి.'

'నీ గత విషయాలు నీకూ, నాకూ, గంగులుకీ తప్ప మరెవ్వరికీ యే విధంగానూ తెలియకూడదు.'

'అలాగేనండి. కాని, నాకు తల్లీ, చెల్లెళ్ళూ వున్నారండి. వారిని ఆదుకునే అవకాశం నాకు లేకపోతే ఈ ఉద్యోగం నాకు అక్కరలేదు.

ఏదో నాకు చేతనయింది చేసుకుని బతుకుతాను' అన్నాడు విసిగిపోయి చివరకు మోహన్.

'అబ్బో చాలా కోపం వచ్చినట్టు వుందే. మీ వాళ్ళను ఆదుకోవద్దని నేనేమీ చెప్పలేదు. ఎటొచ్చీ గత విషయాలు బయటపడకుండా చూసుకో వాలి అంతే. మీ వాళ్ళు పొరపాటున అయినా పాతపేరుతో పిలుస్తే వెనకటి కథంతా బయటకు లాగేస్తారు జనం.'

అతను కాస్త ఆలోచించాడు. 'మీ యిష్టం. ఇంకా ఏమయినా కండి షన్సు వున్నాయా?'

'ప్రస్తుతానికి ఇంతే. నీ ప్రవర్తననుబట్టి రిలాక్సేషన్‌గాని, రిజిడిటీ గానీ వుంటుంది.'

'నా డిసిగ్నేషనూ, జీతం, వగైరా' మెల్లగా అన్నాడు. భుజంగ రావు మళ్ళీ ముఖాన్ని పైకి ఎత్తాడు ఆలోచిస్తున్నట్టుగా.

'ముందు నీకు డిజైన్ వర్కులో పరీక్ష పెడతాను. అదిగనుక కరె క్టుగా చేశావంటే, నీకు చీఫ్ ఆర్కిటెక్టుగా పని ఇస్తాను. జీతం పదహారు వందలూ ఆపైన అలవెన్సులూ.'

అదివిని మోహన్ ఒక్కసారి వులిక్కిపడ్డాడు. ఇంక జీవితమే పూర్తిగా మారబోతుంది. తనూ తనవాళ్ళూ పాత కష్టాలు మరిచిపోయి హాయిగా బతకొచ్చు. అతడు వుబ్బితబ్బిబ్బైపోతున్నాడు. 'అలాగేనండి- టెస్టు యెప్పుడు పెడతారు?'

'ఇవ్వాళ కాదు. రేపు మధ్యాహ్నం. నా కండిషన్లు అన్నీ నీకు సమ్మతమేగదా!'

'సమ్మతమేనండి.'

'మధ్యన యేదైనా పేచీ పెడితే ఇరుకులోపడిపోతావు. జాగ్రత్త. ఇక్కడ నా పలుకుబడి నీకు తెలీదు. నీకు మంచినీళ్ళు కూడా పుట్టకుండా చేయగలను.'

'.........'

'ఏదో అన్నానని మరీ అంత భయపడిపోకు. చెప్పవలసిన విష యాలు చెప్పాలిగదా. నువ్వు చాలా పెద్ద తప్పు పని చేశావు. చేయగలవు.

D-11

అందుకనే నా జాగ్రత్తలో నేను వుండవలసివస్తున్నది. కాని నువ్వు దాచ కుండా నాతో నిజం చెప్పినందుకు నిన్ను చాలా లైక్ చేస్తున్నాను.'

'థ్యాంక్యూ సర్.'

'రేపు కనుపించు. మా ఆఫీసులో.'

మోహన్ గంగులూ అవతలికి వెళ్ళబోయారు.

'మోహన్' అని వెనుక నుండి భుజంగరావు కంఠం వినిపించింది. అతడు వెనక్కు తిరిగాడు. భుజంగరావు పెద్దగా నవ్వాడు.

'ఏమిటండి' అన్నాడు కంగారుగా మోహన్‌రావు.

'అప్పుడే వొక నిబంధన మరచిపోయావు. ఈలాగే బయటపడిపోయి నా కొంపముంచగలవు వొకనాడు. నీపేరు మాధవరావు అని చెప్పానా! ఎంత ఎరిగున్నవారు నిన్ను మోహన్ అని పిలినా నీవు యెరగనట్టు వుండిపోవాలి.'

'గుర్తుంచుకుంటానండి.'

ఇద్దిరూ ఇవతలికి వచ్చేశారు భుజంగరావు ఇంటినుండి. 'బలేచాన్సు కొట్టావులే. తంతే బూర్లబుట్టలో పడ్డట్టు. నాయాల్ది జెయిల్లో పడితేపడ్డావు గాని—'

జీతం పదహారువందలు, పైన అలవెన్సులూ! ఆ రాత్రి తీయని కలలుకంటూ నిద్రపోయాడు మాధవరావు వురఫ్ మోహన్ కుమార్.

మర్నాడు అతడు భుజంగరావు ఆఫీసుకు అంటే మెట్రోపాలిటిన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీకి వచ్చాడు. ఆయనతో ఇంచుమించు ఆయన వయసులో వున్న వ్యక్తి మాట్లాడుతూ వున్నాడు. భుజంగరావు ఇతణ్ణి లోపలికి రమ్మని కుర్చీలో కూర్చోమన్నాడు.

'ఈయన రమణయ్య అని ఇక్కడ ధనలక్ష్మి సిండికేట్ బ్యాంకు యొక్క బ్రాంచి మేనేజరు. ఈయనే నీకు టెస్టు పెట్టేది.'

'చెప్పండి' అన్నాడు మాధవరావు వినయంగా రమణయ్యకు నమస్కరించి. రమణయ్య తన పర్సు బయటికి తీశాడు. అందులోంచి వొక వంద, వొక అయిదు, వొక రెండు రూపాయిల కొత్తనోట్లు తీసి 'ఈనోట్లు చూశావా! వీటిని రెట్టింపు సైజులో వున్నది వున్నట్టు వెనకా ముందుకూడా కాపీ తీయాలి.'

'మరి పరీక్ష డిజైన్ వర్కు అన్నారు. నేను యే భవంతికో డిజైన్ అనుకున్నానుకానీ—' అన్నాడు వాళ్ళ వుద్దేశం అర్థంగాక.

'ఈపని నీవు చేయగలవాలేదా? అంతే కావాలి' అన్నాడు భుజంగ రావు. కాస్త శ్రమేకాని ఇదేమంత పెద్దపనికాదు అతనికి.

'చేయగలనండి!'

'అయితే చేయి. ఎదురు ప్రశ్నలు వేయకు. ఇందుకు నీకుకావలసిన పరికరాలేమిటో చెప్పు.'

'చిత్రించడం అంటే ఇవేకలర్సుతోకాదు. ఇండియన్ ఇంకుతో. సీరి యల్ నంబర్సు బ్లాంకుగా వుంచేయ్ ఫరవాలేదు.'

మాధవరావు తనకు కావలసిన పరికరాలు చెప్పాడు. మరోగంటలో ఆ వస్తువులు అమర్చబడ్డాయి. భుజంగరావు అతణ్ణి నాలుగయిదు గదులు దాటించి వొక ఏర్‌కండిషన్డు గదిలోకి తీసుకు వెళ్లాడు.

'ఈ పని పూర్తయ్యే వరకూ ఈ గదిలోనే వుండి నీకు యేం కావా లన్నా ఇదుగో ఈ ఇంటర్‌కం నంబరు నొక్కి చెప్పు. అవన్నీ సిద్ధంగా నీదగ్గరకు వస్తాయి' అన్నాడు భుజంగరావు.

వీటి నకళ్ళు తీయడానికి చాలా తెలివితేటలు కావాలి. అందుకనే తనకి పరీక్షపెట్టి వుంటారు. ఇందులో తను నెగ్గితే, ఇంక తన భవిష్యత్‌కు బంగారుబాట యేర్పడుతుంది. అతనిలో కొత్త వుత్సాహం వనమయూరంలా పురివిప్పి నాట్యమాడింది. అతను నోట్లను చాలాసేపు పరిశీలించి అందులో సంక్లిష్టమైన రేఖలను అవగాహన చేసుకుని తరువాత పనికుపక్రమించాడు.

పని పూర్తి కావడానికి మూడు రోజులు పట్టింది. అంతవరకూ అతడాగదినుండి బయటకు రాలేదు. పనిలో నిమగ్నుడయిన అతనికి కాల గమనమే తెలియలేదు. ఆ నోట్ల నకళ్ళను చాలాసేపు పరిశీలనగా చూశాడు రమణయ్య. అంతసేపూ మాధవరావు ఆదుర్దాగానే వున్నాడు. రమణయ్యా భుజంగరావు కూడా మాధవరావును అక్కడే వదిలి మరో గదిలోకి వెళ్ళి అరగంట తరువాత ఇవతలికి వచ్చారు నవ్వు ముఖాలతో.

'భేష్! సాధించావోయ్ మాధవరావ్! ఈయన బాంకు మేనేజరు గనుక నోట్ల విషయం ఈయనకు బాగా తెలుసు. అందుకని ఈయనచేత పరీక్ష పెట్టించాను. ఈ డ్రాయింగులే నీకు వుద్యోగం ఇప్పించటానికి

సర్టిఫికేట్లు. ఇవి నీ పర్సనల్ ఫైల్లో వుంటాయి భద్రంగా!' అన్నాడు భుజంగరావు.

'అయితే నాకు ఉద్యోగం ఇచ్చినట్టేనా?'

'ఇంకా సందేహిస్తున్నావా! నీ మొదటి పని ఇక్కడే దగ్గర్లో పటన్ చెరూ అని వూరుంది. అక్కడో ఫ్యాక్టరీ బిల్డింగుకు ప్లానూ, ఎస్టిమేట్సూ వెయ్యాలి.'

'మీకు చాల థాంక్సండీ' అన్నాడు మాధవరావు.

'అన్నట్లు ప్లాను అంటే గుర్తుకు వచ్చిందయ్యా భుజంగరావ్. నేను ఇల్లు కట్టించుకోవాలనుకుంటున్నాను. ఆ పనేదో మీ కంపెనీ వారే పూర్తిచేసి పెట్టాలి.'

'దానిదేం భాగ్యం—ఏ మాత్రం ఖర్చు పెట్టగలవేమిటి?'

'ముందు చక్కటి ప్లాను వేయించిపెట్టు.'

'ప్లీజ్ కన్‌సల్ట్ అవర్ ఛీఫ్ ఆర్కిటెక్ట్ మిష్టర్ మాధవరావ్' అన్నాడు భుజంగరావు.

'అతనేమంటాడు! నువ్వు వెయ్యమంటే వేస్తాడు.'

'రమణయ్యా కాస్త వోపిక పట్టు. ముందు ఫ్యాక్టరీ పని పూర్తికానీ! అతనికి కాస్త అనుభవం వస్తుంది. తరువాత నీ ఇంటిపని.'

'ఆ మాట అన్నావు బాగుంది. ఇంక నేను వస్తానోయ్! కంగ్రాచ్యులేషన్స్ మిష్టర్ మాధవరావ్' అంటూ వెళ్ళిపోయాడు రమణయ్య.

తరువాత భుజంగరావు తన పర్సు బయటకు తీసి-

'ఇదిగో నీవు డ్రాయింగు వేసినందుకు పారితోషికం వెయ్యి రూపాయలు. ఒక నెల జీతం అడ్వాన్సు—'

మాధవరావు మనసు ఆనంద లోకాల్లో తేలి ఆడసాగింది అంత డబ్బు మొదటిసారిగా చేతికందగానే. 'ఒక్క మనవి' అన్నాడు భయపడుతూనే.

'చెప్పు...'

'మా వాళ్ళను చూసి రావాలి. వీలయితే వెంట తీసుకు వచ్చేస్తాను.'

'కావలిస్తే వెళ్ళి చూసిరా. ఇక్కడ నీవు స్థిరపడ్డాక వాళ్ళను

తీసుకు వచ్చే యేర్పాటు చేయవచ్చు. మధ్యంతరంగా నీ చెల్లెళ్ళ చదువు పాడు చేయడమెందుకూ?' అన్నాడు కాస్త ఆలోచించి భుజంగరావు.

'అలాగేనండీ' అన్నాడు మాధవరావు.

అతడు ఇవతలికి రాగానే గంగులు ఎదురు పడ్డాడు 'గంగులూ నాకు వుద్యోగం ఇచ్చారు!' అన్నాడు సంభ్రమంగా మాధవరావు.

'నే చెప్పలా! అయ్యగారు కాస్త కరుకుగా మాట్లాడుతారుగాని మనసు యెన్నపూస. అడ్వాన్సు జీతం గూడా ఇచ్చేసి వుండాతే!'

'అవును గంగులూ! నీవు నాకు చాలా వుపకారం చేశావు. ఇందా' అంటూ రెండు వందలు ఆతనికి ఇచ్చాడు. గంగులు ఆ డబ్బును నిర్లక్ష్యంగా అందుకుని జేబులో కుక్కుకున్నాడు. మాధవరావు తనకూ, తల్లికీ, చెల్లెళ్ళకూ తగిన బట్టలు కొన్నాడు. స్వీట్ ప్యాకెట్లూ, పండ్లు వగయిరా తీసుకుని రాత్రే వూరికి ప్రయాణమయ్యాడు. రైలు జోరుగా వెడుతూ వుంటే అతని ఆలోచనలు హోరుగా సాగుతున్నవి. తన భవిష్యత్తు ఈ విధంగా ఇంత త్వరగా మారుతుందని తను వూహించి వుంటే తల్లికి ఆ విధంగా వుత్తరం రాసివుండేవాడు కాదు.

ఆ వుత్తరం చూచి తల్లి యెంతగా తల్లడిల్లి పోయిందో! కాని అప్పుడు అలా రాయడం కంటే తనకు గత్యంతరం లేకపోయింది. వాళ్ళు ఇన్నాళ్ళు ఎన్ని ఇక్కట్లు పడ్డారో! ఎలాంటి బ్రతుకుతెరువూ లేక ఎలా కాలం వెళ్ళబుచ్చారో! తాను చేసిన చిన్న పొరపాటు ఎన్ని కష్టాలకు దారి తీసింది! ఇక చస్తే ఆ నీచపు పని చేయకూడదు. భుజంగరావు పెట్టిన నిబంధనల విషయం తల్లికి వివరించి చెప్పి జాగ్రత్తగా మసలుకోమని చెప్పాలి. ఏమయినా ఆ చీకటి రోజులు గడిచిపోయినాయి. ఎదుట అపరంజి భవిష్యత్తు—

రైలు దిగి ఆతృతతో ఇంటికి వెళ్ళి 'అమ్మా అమ్మా' అనుకుంటూ ఆనందంతో ఇంట్లోకి వెళ్ళిన మాధవరావు తన యెదుట నిలబడ్డ అపరిచిత స్త్రీని చూసి కొయ్యబారిపోయాడు.

'ఎవరు కావాలండీ' అంది ఆవిడ అయోమయ్యంగా.

'మా అమ్మ అండీ! అదే భాగ్యలక్ష్మిగారు. ఇది మా ఇల్లు.'

'తెలీదండీ! మేమీ ఇంటికి క్రొత్తగా వచ్చాం.'

'అయితే మా వాళ్ళు...'

'మాకు తెలీదు. ఇరుగు పొరుగువాళ్ళని అడిగి చూడండి' అంటూ ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది.

ఇరుగు పొరుగు ఇల్లాండ్రు అతనిమీద అక్షరాలా విరుచుకు పడ్డారు. 'వచ్చావా బాబూ-ఏ ముఖం పెట్టుకుని! చేసిన నిర్వాకం చాలక ఇంకా అమ్మా అంటున్నావా!' అంటూ.

'ఇంతకీ వాళ్ళు యెక్కడున్నారో చెప్పండి.'

'ఇన్నాళ్ళూ కళ్ళల్లో వత్తులు వేసుకుని నీ కోసం చూసింది. ఇంక ఇక్కడ తలెత్తుకు తిరగలేక మా కెవరికీ చెప్పకుండా వెళ్ళిపోయింది' అంది అందులో వొకావిడ కాస్త మనసు కరిగి.

అతని గుండెలో అగ్నిపర్వతం బద్దలయింది. రెండు మూడు రోజులు అక్కడే వుండి అనుమానం వున్నచోటల్లా వెతికాడు. కాని ఆశ్రమే మిగిలింది. తన వాళ్ళు ఎక్కడికి వెళ్ళారు? ఎక్కడికి వెళ్ళారు? ఆ ప్రశ్న దిక్కుల్లో ప్రతిధ్వనించింది.

# 22

'మరీ అంతగా బెంబేలుపడిపోకు. చేతికి అందొచ్చిన చెట్టంత కొడుకు చెయ్యరాని దౌర్భాగ్యపు పనిజేసి జైలుపాలవుతే నలుగురిలో తలెత్తుకు తిరగలేక ఏ మారుమూల వూళ్ళోనో అజ్ఞాతంగా వుండొచ్చు. మనసు ధైర్యం చేసుకో. కలుసుకునే గీతవుంటే ఏనాటికయినా కలుసుకుంటావు' అంటూ మాధవరావును వోదార్చాడు భుజంగరావు.

'మనసును ఎలా కుదుట పరుచుకోడమో నాకు తెలీడం లేదు.'

మరీ తల్లి చాటు పిల్లవానిలా వున్నాయి అతని మాటలు.

'పిచ్చివాడా! కుదుట పరుచుకోడం అంటే ఆ ధ్యాస విడిచి మనసును ఇతర వ్యాపకాలపై లగ్నం చేయడం అన్నమాట' అని వివరించాడు.

'అదే ఎలా అని?'

'అదీ చెబుతాను. నీకు చిత్రలేఖనం వచ్చునన్నావు. తీరిక వేళల్లో యేదయినా పెయింటింగ్ చేస్తూ కూర్చో. నీకు సంగీతమూ వచ్చుకదా!

అది సాధన చేసుకో! క్లబ్బులో నెలకు రెండో మూడో ప్రోగ్రామ్స్ ఏర్పాటు చేస్తాను. ఇంక మనకు కన్స్ట్రక్షన్ వర్క్‌లో పడితే క్షణం తీరిక వుండదు. రేపు పటన్‌చెరువు వెళ్ళి సైట్ చూసి వచ్చి పని ప్రారంభించాలి. తెలిసిందా...'

'అదేం ఫ్యాక్టరీ?' అడిగాడు మాధవరావు.

'ఆగ్రో కెమికల్స్...'

మాధవరావుకి భుజంగరావు సలహాలు నచ్చినవి. అలాగే చేసి మనసును వూరడించాలి. మరో మార్గంలేదు అనుకున్నాడు. మరోసారి వెళ్ళి ప్రయత్నం చేయాలని కోరిక. కాని వెంటనే భుజంగరావు దానికి అంగీకరిస్తాడా? ఈ ఫ్యాక్టరీ పనేదో త్వరగా పూర్తిచేస్తే మళ్ళీ శెలవు అడిగే ఆస్కారం వుంటుంది. అతడు వూరికి వెళ్ళివచ్చినప్పటినుండీ కన్స్ట్రక్షన్ కంపెనీ గెస్ట్ రూంలోనే వుంటున్నాడు.

ఫ్యాక్టరీ పని మొదలు పెట్టాక అతని మకాం ఆగ్రో కెమికల్స్ వారి ఆఫీసు గెస్టు హౌస్‌కు మారింది. అతని సంగీత సాధనకీ, చిత్రలేఖనానికీ అనువుగా వుంటుందని ఈ యేర్పాటు భుజంగరావే చేశాడు. ఈ యేర్పాటు మాధవరావుకి హాయిగా వున్నది. ఫ్యాక్టరీ నిర్మాణం మొదలయింది. దాని పర్యవేక్షణ మాధవరావుదే. దాంతో అతనికి క్షణం తీరిక లేకుండా అయింది. ఇది తన తొలి నిర్మాణకార్యం గనుకదాని విషయంలో యెంతో శ్రద్ధ తీసుకుంటున్నాడతను. పనిలో అతని శ్రద్ధా, ఏకాగ్రత చూసి భుజంగరావు ఆశ్చర్యపోయాడు. తన దగ్గర ఇటువంటివాడు పనిచేయడం తన అదృష్టమే అనుకున్నాడు.

చూస్తూ ఆరునెలలు తిరిగిపోయాయి. ఎన్ని వ్యాపకాలు పెట్టుకున్నా తన వాళ్ళమీద జ్ఞాపకాలు వదిలిపెట్టడంలేదు మాధవరావును. వొకసారి వెళ్ళి చూసి రావాలి. వారెక్కడ వున్నారో కొన్నాళ్ళు వుండి అన్వేషించాలి. ఇదే ఆలోచన. సమయం చూచి భుజంగరావును అడగాలి అనుకొంటున్నాడు. ఎంతో చురుకుగా సాగుతున్న ఫ్యాక్టరీ నిర్మాణం హఠాత్తుగా కొన్నాళ్ళపాటు ఆపవలసి వచ్చింది. సిమెంటు కోటాకి రిలీజ్ ఆర్డర్స్ రావడంలేదు. భుజంగరావు దాని ప్రయత్నంమీదవున్నాడు.

'వారం రోజులపాటు మా వూరివైపు వెళ్ళి వస్తాను' అన్నాడు మాధవరావు అతణ్ణి సమీపించి.

భుజంగరావు యేమీ సమాధానం చెప్పలేదు. అతణ్ణి పరీక్షగా కొన్ని నిముషాలు చూసి 'అలాగే వెళ్ళిరా! కాని వెళ్ళేముందు చాలా రహస్యమయిన పని వొకటి చేయాలి.'

'చెప్పండి—'

'ఇలా చేయడం తప్పే అనుకో! అయినా గత్యంతరం లేక చేయవలసి వస్తున్నది-ఇది డైరెక్టరు సంతకం. దీన్ని ఈ స్టెన్సిల్‌మీద...'

మాధవరావు దెబ్బతిన్నట్టు చూశాడు.

'మరేం భయపడ . నేనున్నాను నీ వెనుక.'

'క్షమించండి...'

'నేనేపని చెబితే ఆ పని చేస్తానన్నావు—'

'అందులో ఇలాంటి పాడు పనులుంటాయని మీరు నాకు చెప్పలేదు.' మాధవరావుకు నిజంగానే కోపం వచ్చింది.

'చూడు నిన్ను నమ్ముకుని ఈ నిర్మాణం చేపట్టాను. ఇది మధ్యంతరంగా ఆగిపోతే యెవరికి లాభం చెప్పు?'

'ఆ సంగతి నాకు తెలీదు. ఇలాంటి వుద్యోగం లేకపోయినా ఫరవా లేదు నాకు-'

'మాధవరావ్! బింకాలు పోయి వీధిన పడకు. నాకు కోపంవస్తే భుజంగరావును కాను కాలభుజంగాన్ని! నువ్వు యెక్కడికి వెళ్ళినా వెంటాడుతాను. మీ వాళ్ళు యెక్కడున్నా వెతికించి వాళ్ళను—'

వినలేక మాధవరావు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. అప్రయత్నంగా స్టెన్సిల్ మీద...

'వెళ్ళి వారంలో తిరిగి వచ్చెయ్. మరేంఫరవాలేదు. అంతలోమనకు కావలసిన సామాన్లు రెడీగా వుంటాయి' అన్నాడు సెలవు మంజూరుచేస్తూ.

నీరసంగా రైలెక్కాడు-వారం తరువాత నీరసంగా తిరిగివచ్చాడు. తమవాళ్ళజాడ యెక్కడా కనుపించలేదు. ఎన్నివూళ్ళని వెదకడం, ఎన్ని రోజులని వెదకడం? అసలు బ్రతికే వున్నారో-లేదో-యేవో ఆలోచనలు. అతని వాలకంచూసి భుజంగరావు మళ్ళీ హైరానపడ్డాడు. నిజానికి మాధవ

రావుకు భుజంగరావు ముఖం చూడబుద్ధి కావడంలేదు. అసలు ఈ ఊరికే తిరిగి రావాలనిపించలేదతనికి. కలకత్తాకో, ఢిల్లీకో వెళ్ళిపోదామనిపించింది కాని భుజంగరావు బెదిరింపు గుర్తుకు వచ్చింది, తనవాళ్ళు యెక్కడున్నా వెతికించి వారి అంతు చూస్తానని.

అతడంత పనీ చేయగలసమర్థుడే. ఇప్పుడు తనకోసంగాకపోయినా, తనవాళ్ళక్షేమంకోరయినా తను భుజంగరావు గుప్పిట్లో ఇరుక్కొని వుండాలి. ఇదంతా మరిచి పోవడానికి డ్రింక్ తీసుకోవాలనిపిస్తుంది. అది క్లబ్బులో తనకు అందుబాటే-కాని అది అలవాటైపోయి-ఆ మత్తులో తన సంగతి తనే చెప్పేసుకుంటాడేమోనని భయం. పెయింటింగువర్కు కొంత మనసుకు వూరడింపు కలిగించేది. వయోలిన్ సాధన కొంత సంతృప్తిని కలిగించేది. ఈ రెండు ప్రక్రియలే తనను బతికి వుండేట్టు చేస్తున్నాయి. తక్కినవన్నీ చేయకూడని పనులుగానే కనుపిస్తున్నాయి.

తాను ఊరునుంచి తిరిగి వచ్చాక భుజంగరావు తనని ఫ్యాక్టరీ పనికి పంపడంలేదు. ఎందుకనో తాను పట్టించుకోలేదు. తనకింద అసిస్టెంటుగా వున్నతణ్ణి పంపిస్తున్నాడు. తనకింద పనిచేసేవారెవరూ పని వున్నంత వరకుతప్ప యెక్కువ మాట్లాడరు. తనతో చాలా చొరవగా మాట్లాడేది గంగులు ఒక్కడే. తనని తాగుడులోకి, ఆడపిల్లల వ్యవహారంలోకి దింపాలని వాడి తాపత్రయం. తనందుకు లొంగక పోయేసరికి, అతడూ భుజంగరావు లాగే యేదో బెదిరింపులకు దిగాడు. యాభై వందా వడుక్కొని కొన్నాళ్ళు నోరుమూసుకునేవాడు.

ఇన్నాళ్ళూ షఫైర్ నైట్ క్లబ్ అంటే ఏదో గౌరవమైన అభిప్రాయం వుండేది మాధవరావుకి. అక్కడికి కేవలం సంగీత ప్రియులు మాత్రమే వస్తుంటారని. కాని దానిరంగూ ఒకనాడు బయటపడిపోయింది.

ఒకరోజు తన పర్ఫార్మెన్సు పూర్తి అయింది. ఆనాడు తన ఆఖరు ఐటం.

భుజంగరావు, రమణయ్యా ఏదో పనిమీద బొంబే వెళ్ళారు. కనుక క్లబ్బుకి రాలేదు. ప్రోగ్రాం పూర్తయి తను బయలుదేరబోతూ వుండగా వర్షం మొదలయింది. కార్లలో వెళ్ళేవాళ్ళు వెళ్ళిపోయారు. కొంత మంది కాస్సేపుఅక్కడే తచ్చాడి లోపలికివెటోవెళ్ళారు. వాళ్ళు లోపల రూంలలో

వుంటారేమో ననుకున్నాడు మాధవరావు. వాన కాస్త తగ్గుముఖం పట్టగానే ఆర్కెస్ట్రా గ్రూప్ కూడా బయటకు వెళ్ళిపోయింది. తనూ వెళ్ళబోతూ వుంటే క్లబ్ సెక్రటరీ ఆపాడు.

'అప్పుడే వెళ్ళాలా?'

ఆ మాట అర్థంకాక అతని వంక చూశాడు.

'కాసేపు కూర్చో నీతో మాట్లాడాలి.'

ఇన్నాళ్ళకు ఇదే మొదటిసారి అతడు మాట్లాడటం. ఎప్పుడూ మౌనంగా గంభీరంగా వుంటాడు. అతనంటే మాధవరావుకు గౌరవం.

'చెప్పండి?'

'వాణి మీ పాణిలోవుంది. ఈ విద్వత్తును మరెక్కడైనా పవిత్ర స్థలంలో ప్రదర్శించరాదా...'

'అంటే మీ ఉద్దేశం?'

'మీ విద్యకు తగిన స్థలం కాదుఇది.'

'నాకు స్పష్టంగా చెప్పండి.'

'మీరు స్వయంగా చూడండి. నావెంటరండి...' ఆ సెక్రటరీ లేచి లోపలికి దారితీస్తూవుంటే మాధవరావు అతడ్ని అనుసరించాడు. ఏమైవుంటుంది. మనసులో ఏదో కుతూహలం! రెండు మూడుగదులూ, పొడుగాటి వరండా దాటి ఇంకోగదిలోకి వెళ్ళి ఈ భవనం మరోవైపుకు తీసుకు వెళ్ళాడు సెక్రటరీ. అక్కడ జూదశాల, పానశాల, కాబరే డాన్సులు, ఒకగదిలో బ్లూఫిల్మ్ ప్రదర్శనా. కొన్ని గదుల్లో వ్యభిచారం. అదంతా మరో ప్రపంచం. ఇక్కడా జనం కిటకిటలాడుతూనేవున్నారు. ఇక్కడికి రావడానికీ, వెళ్ళడానికీ కూడా రహస్య మార్గం వుంది. మాధవరావు తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు.

'మీకు వీటిలో పాల్గొనాలని వుందా?'

మాధవరావు ఏం సమాధానం చెప్పగలడు– 'ఈ క్లబ్బు నిర్వహిస్తున్నదెవరు?' అడిగాడు.

'చాలామంది నిర్వాహకులున్నారు. ముఖ్యుడుమీబాస్‌భుజంగరావు.'

మాధవరావు వులిక్కిపడ్డాడు ఆ పేరు వినగానే. 'ఇన్నాళ్ళు లేనిది ఇదంతా నాకెందుకు చూపిస్తున్నారిప్పుడు?'

'అవకాశం దొరికిందిగనుక. మీముఖంలో, కళ్ళలో అమాయికత్వం వుంది. ఈలంపటంలో ఇరుక్కుంటే జీవితంలో బయట పడటం కష్టం. వీలయితే మిమ్మల్ని ఇక్కడికి దూరం చేద్దామని.'

'నేను ఒక విధంగా ఇరుక్కునేవున్నాను. మీరెట్లా వచ్చారిందు లోకి...'

'వ్యసనాలకు తగులుకుని. పేకాటలో నానేర్పు కనిపెట్టి డబ్బు యెరజూపి తనగుప్పిట్లో పెట్టుకున్నాడు.'

'అలాగా?'

'ఇక్కడ ఉద్యోగం చేసే చాలామంది యేదో బలహీనతతో అతని పిడికిట్లో ఇరుక్కుని పోయినవారే. శ్లేష్మంలోపడ్డ ఈగల్లాంటి వారు.'

'శ్లేష్మంలోపడ్డ ఈగ' పదేపదే అనుకున్నాడు. తనబతుకూ అలాగే వుంది.

భుజంగరావు, రమణయ్యా బొంబాయి నించి చాలా వుత్సాహంగా తిరిగివచ్చారు. ఆ రోజు ఉదయం తను వయోలిన్ సాధన చేసుకుంటూ వుంటే ఇద్దరూ తన గదికివచ్చారు. ఎందుకో అతనికి అర్థంకాలేదు. ఎంతో సాత్వికుడిలా కనుపిస్తున్న ఈ రమణయ్యకు ఇతనితో ఇంత స్నేహ మేమిటి? ఇతడూ భుజంగరావు గుప్పిట్లోఇరుక్కుపోయివున్నాడా? భుజంగ రావు ముఖం చూడాలంటేనే అసహ్యంగా వున్నది మాధవరావుకు.

'చెప్పండి' అన్నాడు వినయంగా వారి దగ్గరకువచ్చి.

'మరేంలేదు రమణయ్యగారి సైటు ఈ సమీపంలోనే. పద చూసి వద్దాం. ఇల్లు కట్టుకోవాలని చాలా తొందరపడి పోతున్నారు' అన్నాడు భుజంగరావు. మాధవరావు యేమీ జవాబు చెప్పకుండా లోపలికివెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చాడు.

తనను కేవలం అక్కిరెక్కేగా వుపయోగించుకోవడంలో మాధవ రావుకు యెలాంటి అభ్యంతరంలేదు. ఇలా ఇండ్లకూ, భవనాలకూ ప్లాను గీసి వాటి నిర్మాణంపూర్తి అయ్యేవరకూ వుత్సాహంగా పనిచేయగలడు. కాని భుజంగరావు తనకు ఉద్యోగం ఇవ్వడంలో అతని ఆంతర్యం వేరు. ఆవిషయం ఇప్పుడిప్పుడే తనకు బోధపడుతున్నది. చాలా ఎద్దడిగావుండే సిమెంటూ, యినుముసామానూ, చెక్కరా, ఎరువులు, పాలడబ్బాలు,

బియ్యం వగయిరా అవసరవస్తువులకు ఆయా అధికారుల సంతకాల నమూనాలు సంపాదించి, ఫేక్ పర్మిట్లు సృష్టించడానికి అతడు తనను వుపయోగించుకుంటున్నాడు.

తను అలాంటి పని చేయనని మొరాయిస్తే ఏదో బెదిరింపుతో తను లొంగేటట్టుగా చేసుకునితనపని నెరవేర్చుకుంటున్నాడు. భుజంగరావుఅతడ్ని ఏదోవిధంగా బెదిరించగలిగినా లోలోపల అతనికి భయమే. మాధవరావుకు తన సంగతంతా తెలుసు గనుక, తనగుప్పిట్లోంచి తప్పించుకునిపోయి, తన సంగతంతా ఎవరికైనా చెప్పేస్తాడేమో నని. ఒకసారి మాధవరావు ఆమాటే అన్నాడు కోపంవచ్చి. అదివిని భుజంగరావు ముఖంలో ఆందోళన కనుపించినా అతడు చలించినట్టు కనపడలేదు.

'మాధవరావ్! కుందేలుపిల్ల సింహాన్ని బెదిరించినట్టువుంది నీవు చెప్పడం. ఈ ఫోర్జరీలు అన్నీ నువ్వు చేస్తున్నావుగాని నేను కానుగదా. నువ్వాకేసులో యిరుక్కుని జెయిలుశిక్ష అనుభవించివచ్చి, మారు పేరుతో నా దగ్గిరపనిచేస్తున్నవాడివి. అసలు నువ్వే ధోకాచేసి, ఈ ఉద్యోగంలో చేరావు అని చెబుతాను ఈవిషయం యిప్పుడేపోలీసులకురిపోర్టు యిస్తాను' అన్నాడు.

మళ్ళీ పోలీసు రిపోర్టు, కేసు విచారణ, శిక్ష. మాధవరావుకు ఆలోచనలన్నీ అస్తవ్యస్తమైపోయేవి. నిజంగా ఎక్కడికైనా పారిపోతే బాగుండును అనిపించేది. కాని కాని ఒక్కసారి తన తల్లి పాదాలమీదపడి తను చేసిన తప్పుకు క్షమాపణ కోరుకుని ఆ తరువాత ఆపని చేయాలనిపించేది. కాని తల్లి యెక్కడుందని వెదకడం.

రమణయ్య ఇల్లు పూర్తి అయి గోవర్ధనరావు రంగంలో ప్రవేశించడంతో ఈ కథ తిరగవలసిన మలుపు తిరిగింది. ఒక పోలీసాఫీసరు కూతురు ఇతనితో అంత సన్నిహితంగా వుండడమూ- భుజంగరావుకు ఈ విషయం పెద్ద సమస్య అయి కూర్చుంది. భుజంగరావు ఈ అనుమానంతో మాలతికి యేదయినా కీడు తలపెడతాడేమోనని మాధవరావుకు భయం పట్టుకున్నది.

మాలతిపట్ల అతని హృదయంలో యెంతో ఆరాధనా భావంకలిగినా తాను దూరంగా, ఇంకా దూరంగానే వుండవలసివచ్చింది. వొక కారణం

భుజంగరావు దుర్బుద్ధి, మరొకటి బయటకు చెప్పుకోలేని తన గత విష యాలు. గోవర్ధనరావు యొక్క ఆర్డరు తీసుకోవడం పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు అయింది భుజంగరావుకి.

గోవర్ధనరావుకుగాని, మాలతికి గాని తానుమరీసన్నిహితంకాకుండా చేయాలని అతడు తెగ హైరానాపడిపోయాడు. తను దూరంగా జరిగిన కొద్దీ మాలతి తనకు మరీ చేరువ అవుతూ వుంటే తన నిస్సహాయ స్థితికి దుఃఖం ఎచ్చేది. విధిలేక మాలతి మనసును నొప్పించవలసి వచ్చింది. తన జీవితాన్ని చేజేతులా ఇలా మలుచుకున్నాడు. అనుభవించక తప్ప తుందా! కాని ఈ కథకు ముగింపు ఈ విధంగా వుంటుందని అతడు కలలో కూడా వూహించలేదు.

# 23

సుభద్రకు కన్నీరు బొటబొటా కారుతున్నది. తన మోహన్ ఇన్ని ఇక్కట్లకు గురి అయ్యాడా? ఇంతటి మానసిక శిక్షకు పాలయ్యాడా? తన కోసం, చెల్లెళ్ళకోసం అతని మనసు అంత పరితపించిపోతున్నదా? తను వున్నచోటే వుండిపోయివుంటే బాగుండేదేమో- కాని అతడు రాసిన ఉత్త రంతో అతని విషయంలో తాను పూర్తిగా నిరాశ చేసుకోవలసివచ్చింది. అతడ్ని అన్వేషిస్తూనే తాను ఈ వూరు రావలసి వచ్చింది.

'బాబూ! నేను ఇక్కడే వున్నాను బాబూ! నా మోహన్!' అంటూ అతడ్ని అక్కున చేర్చుకోవాలని ఆమె మనసు కొట్టుకుంటున్నది.

ఆమె అంతరాత్మ గట్టిగా పట్టిలాగకపోతే మరుక్షణంలో సుభద్ర అంతపనీ చేసేది.

'నీవు అతని యెదుటకు వెళ్ళడం తగదు' అంది అంతరాత్మ.

'ఎందుకని? నా బిడ్డ, ఇన్నాళ్ళ తరవాత ఎన్నో ఇడుములుపడి అలసిపోయి కనుపించాడు. అతడు నన్ను వెదకడానికి వెళ్ళబోతున్నాడు. నేను కనిపిస్తే ఏం?'

'మాలతి ఎవరు?'

'గోవర్ధనరావు ఐ. పి. యస్. పోలీసాఫీసరు కూతురు.'

'మోహన్‌ను ఆమె ప్రేమించింది. గోవర్ధనరావు ఆమెనుఅతనికిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నాడు—'

'అంతకంటే నాకు కావలసింది ఏముంది?'

'నీవెవ్వరు?'

'నేను సుభద్రను.'

'పేరు కాదు. నీ స్థితి యేమిటి?'

'నేను— నేను— వారింట్లో'

'వంటలక్కవి- వరలక్ష్మమ్మ అన్నంత మాత్రాన నువ్వు వారికి దగ్గరగానో, దూరంగానో బంధువు మాత్రం కావు.'

'అయితే—'

'మోహన్‌కు కాస్త అదృష్టం తప్పింది గాని ఇంజనీరు కావలసిన వాడు. ఇప్పుడు గోవర్ధనరావు పలుకుబడితో అతను స్వతంత్రంగానే హోదాను సృష్టించుకోగలడు.'

'అయితేనేం?'

'మోహన్ తమ వంటలక్క కొడుకే అని తెలిస్తే!'

'అవును. తెలుస్తే గోవర్ధనరావు, వరలక్ష్మమ్మా బాధపడతారు.'

'నిజమే. కాని మోహన్ నన్ను వెతకడానికి వెడుతున్నాడుగా..'

'నీవు మరోవిధంగా వియ్యపురాలివైతే ఆ సంగతి వేరు. ఈ విషయం వేరు. ఏమయినా నీవు యిప్పుడు బయటపడకు.'

సుభద్ర మనసులో పెద్ద తుఫాను చెలరేగింది. ఇన్నాళ్ళ తరువాత ఇంత చేరువలో కనుపిస్తున్న తన కొడుకును తను సమీపించలేక పోతూ వుంది. ఆమె వొక నిశ్చయానికి వచ్చింది. ఈ సంగతంతా తనకేమీతెలియనట్టేవుంటుంది. మోహన్ తల్లిపేరు లక్ష్మి- తను సుభద్ర. ఈ వంటఇంటి నుండి తాను అవతలికి వెళ్ళదుగాక వెళ్ళదు. మోహన్ తనను వెదకటానికి వెళ్ళి నిరాశచేసుకుని వస్తాడు. గోవర్ధనరావు దంపతులు అతడ్ని వోదార్చి, తరువాత మాలతినిచ్చి పెళ్ళి చేస్తారు. మరుగున వుండి ఆ పెళ్ళిచూసి, తరువాత తను యెక్కడికయినా వెళ్ళిపోతుంది అంతే. ఆమె వొక నిశ్చయానికి వచ్చి కన్నీళ్ళు తుడుచుకుని కిటికీ పక్కనే నిలబడి తనివితీరా

మోహన్ ముఖాన్ని పరిశీలిస్తున్నది. అందంగా వున్న అతని ముఖంలో యేదో ఆవేదన, అలసటా- అతడ్ని వోదార్చలేని తన నిస్సహాయపరిస్థితి.

'అయితే మీ అమ్మనూ, చెల్లెళ్ళనూ వెదకడానికి ఈరాత్రే బయలు దేరుతావా బాబూ' అన్నది వరలక్ష్మి.

'అలాగే అనుకున్నానండి.'

'వెళ్ళి వెతికి తీసుకురాబాబూ! అంతమంచి మనసుగల ఇల్లాలి విష యం వినడం చాలా అరుదు. నిజంగా ఆమె దేవత.'

'చూడు మోహన్ మీ వాళ్ళను వెదకటానికి నేను అన్ని విధాలా సహాయం చేస్తాను- అక్కడ మా ఇంటెలిజెన్స్ డిపార్టుమెంటు సిబ్బంది నీకు మీ వాళ్ళ ఆచూకీ తెలుసుకోవడానికి సహాయపడతారు.'

అతను కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వున్నాడు. తరువాత 'నేను అంతదూరం వెళ్ళవలసిన అవసరం వుండదేమో ననుకుంటానండి..' అన్నాడు. వాళ్ళు ముగ్గురూ ఆశ్చర్యంగా అతని వంక చూశారు. ఈమాట విన్న సుభద్ర తృళ్ళిపడింది.

'అదేమిటి బాబూ! ఆమె యెక్కడ వున్నదో, ఎన్ని ఇడుములు పడుతున్నదో' అన్నది వరలక్ష్మమ్మ.

'ఆమె ఆచూకి నాకు తెలిసిపోయిందండి' అన్నాడు.

'నిజంగానా?' అన్నది ఆశ్చర్యంగా మాలతి.

'అవునా బాబూ?' అన్నది వరలక్ష్మమ్మ మరింత ఆదుర్దాతో.

'అవునండి! మీరు పెట్టిన జాంగ్రి, అరటికాయ బజ్జీలు చెప్పాయి ఆమె మీ యింట్లోనే వున్నదని' అంటూ అతడులేచి లోపలికి రాసాగాడు.

సుభద్ర గుండె దడదడలాడుతున్నది. కళ్ళను గట్టిగామూసు కున్నది. మరికొన్ని నిముషాలకు మోహన్ ఆమె మోకాళ్ళను కౌగలించు కుని వలవలయేడుస్తున్నాడు. గోవర్ధనరావు, వరలక్ష్మమ్మ, మాలతి అక్క డికి వచ్చి ఆ దృశ్యాన్ని చూచి చలించిపోయారు. సుభద్ర అతడ్ని లెవ నెత్తి తన హృదయానికి హత్తుకున్నది. మాలతికి యేదో గుర్తుకువచ్చి

మోహన్ తనకు బహుమతి ఇచ్చిన పెయింటింగును తీసుకువచ్చి అందులోని స్త్రీ మూర్తిని పరిశీలనగా చూసింది.

'అమ్మా యీవిడ ముఖంలో ఆంటీ పోలికలువున్నాయి కదూ' అంది. వరలక్ష్మమ్మ దాన్ని పరిశీలించి కిందరాసిన అక్షరాలు చదివింది 'దరిజేరిన నావ' అంటూ.



అప్రయత్నంగా మాలతి సుభద్ర పాదాలకు నమస్కరిస్తూవుంటే గోవర్ధనరావూ, వరలక్ష్మమ్మ, మోహన్ ముసిముసిగా నవ్వుకున్నారు.



—o—

# దరి జేరిన నావ

## పి. వి. కృష్ణమూర్తి

చిన్నతనంలో ఆకతాయి తనంగా తండ్రి సంతకం ప్రోగ్రెస్ కార్డు మీద ఫోర్జరీ చేసి చీవాట్లు తింటాడు మోహన్. అనేక కష్టాలకోర్చి ఇంజనీరింగ్ ప్యాసవుతాడు. ఉద్యోగ ప్రయత్నంలో తన వయసు 3 నెలలు ఎక్కువ కావటంతో స్కూల్ సర్టిఫికెట్లలో పుట్టినతేదీ మార్చివేసి, ఇది తెలుసుకున్న ఒక వ్యక్తి కంప్లయింట్ మూలంగా ఫోర్జరీ అండ్ ఎంబెజిల్ మెంటుకేసులో ఇరుక్కొని జైలు పాలవుతాడు. జైలులో గంగులు అనే ఖైదీమాటలతో బోల్తాపడి జడ్జీ సంతకం ఫోర్జరీచేసి అతన్ని తప్పించి, మళ్ళీ జైలు శిక్ష పొడిగింపుకోవాల్సి వస్తుంది. జైలునుంచి విడుదల అయ్యాక గంగులు తారసపడి అతన్ని భుజంగరావు అనే ఓ ఘరానా వ్యక్తికి పరిచయం చేస్తాడు.

డిజైనింగ్ టెస్ట్ అంటూ వందరూపాయల కాగితానికి నమూనా గీయిస్తారు భుజంగరావు అతనిమిత్రుడు రమణయ్య. అది చాలానేచురల్‌గా వుండని అతనికి ఇంజనీర్ ఉద్యోగం యిస్తానని దానికి కొన్ని నిబంధనలు పెడతాడు భుజంగరావు. వాటికి అంగీకరించి ఉద్యోగంలో చేరతాడు. కానీ కొంతకాలానికి అతనికి తెలిసి వసుంది తను 'శ్లేష్మంలో పడ్డఈగ' అని.

ఆ పరిస్థితిలో పోలీస్ ఆఫీసర్ అయిన గోవర్ధనరావు తనయింటి ప్లానుకోసం యితని దగ్గరకు వస్తాడు. ఆయనతో ఆయన అమ్మాయి కూడా వస్తుంది. ఇద్దరి మధ్యా ఆకర్షణ పెరుగుతుంది. ఈ విషయం గుర్తించిన భుజంగరావు అతన్ని హెచ్చరిస్తాడు. ఇక మాలతిని తన వద్దకు రావద్దని ఉత్తరం రాయిస్తాడు.

తర్వాత కథ ఏ మలుపు తిరుగుతుంది? మాలతి అతన్ని వివాహం చేసుకోగలుగుతుందా? శ్లేష్మంలో పడ్డ ఈగలాటి అతను బయటపడగలడా?

పి.వి. కృష్ణమూర్తిగారి సెంటిమెంటల్ సస్పెన్స్ థ్రిల్లర్!


**యం. శేషాచలం అండ్ కంపెనీ**

మచిలీపట్నం-సికింద్రాబాద్

Cover Printed at Nandini Art Printers, Hyd-29